

ఇతిహాస పరిశోధకమాల— ౧

ప్రాచీన

# భారతీయ గ్రంథాలయ చరిత్ర



అత్యంత ప్రాచీనములగు ఉపనిషత్తులలోని ధర్మమే మన మతము.
అందలి సత్యమే పరమాత్మ. అందలి పరిపూర్ణ, పరిశుద్ధ బ్రహ్మ
...మార్గము. అందలి హృదయశాంతియే ముక్తి.
...ంటె వేఱు సత్యము లేదు. ఇది ధ్రువము.







చారిత్ర పరిశోధకాచార్య
శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ




# A HISTORY OF
# ANCIENT INDIAN LIBRARIES

BY
Charitra Parisodhakacharya
SRI KODALI LAKSHMINARAYANA

" A good book is the precious life blood of a master spirit."

*Milton*

" You only, O books, are liberal and independent;
You give to all who ask,"

*Richard de Bury.*

1946

First Edition: 1000 Copies

 Price Rs. 2—8—0

# REASON

"Do not believe in what ye have heard; do not believe in traditions, because they have been handed down for many generations; do not believe in any thing because it is rumoured and spoken of by many; do not believe merely because the written statement of some old sage is produced; do not believe in conjectures; do not believe in that as truth to which you have become attached by habit; do not believe merely the authority of your teachers and elders; after observation and analysis, when it agrees with reason and is conducive to the good and gain of one and all, then accept it and live up to it.

(Buddha in Kalama Sutta of Anguttara Nikaya)

"No one should believe what is spoken by any sage, written in any book or affirmed by tradition unless it accords with reason."

(Buddha— Kinship between Hinduism and Buddhism p. 23)

He that will not reason is a bigot'.
He that cannot reason is a fool..
He that dare not reason is a slave.

H. Drummond



చారిత్ర పరిశోధకాచార్య

శ్రీమత్ కొడాలి లక్ష్మీనారాయణగారికి

తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురము తాలూకా

పామఱ్ఱు గ్రామవాస్తవ్యులు సమర్పించిన

సన్మాన పత్రము

అయ్యా!

తాము పరిశోధనా విషయమున చేసిన యమోఘ కృషికి మేము సంతసించి, చంద్రునకు నూలుపోగను సామెతగా రు 116 లు మా గ్రామముతరఫున మీకు సమర్పించుకొనుచున్నాము.

తాము జీవితపర్యంతము సత్యాన్వేషణము చేసి ఫలితాంశమును గ్రంథరూపముననను, ఉపన్యాసరూపముననను, ఆంధ్రప్రభ లో వేసినట్లు వ్యాసరూపముననను లోకమునకు తెలియజేసి సత్యమార్గదర్శకు లగుదురని విశ్వసించుచున్నాము.

పామఱ్ఱు
24-1-45

ఇట్లు,
పామఱ్ఱు వాస్తవ్యులు.

# పరిచయము

మన నగరములోని కుమ్మరిగూడెములో, శ్రీభూమానందమాదిప్పల హనుమంత రాజయోగీశ్వరులవారి (౧౨) ద్వాదశవార్షికోత్సవ సందర్భములో నేర్పాటుచేయబడిన సభలలో నుపన్యసించుటకు శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ గారు మన నగరమునకు వచ్చిరి. గురుశిష్యుల సంబంధమునుగూర్చి, జాతి మత భేదములనుగూర్చి, విశ్వమానవ సోదరత్వమునుగూర్చి, స్త్రీ విద్య-ఉన్నతినిగూర్చి, 4 ఉపన్యాసముల నొసంగినారు. ఈయుపన్యాసములన్నియు చారిత్రిక సంబంధములై ప్రమాణ సహితములుగా నుండుటచేత సికింద్రాబాదు వాస్తవ్యులకు విస్మయమును గల్గించెను. వీరి జన్మభూమి గుంటూరు జిల్లా తెనాలి తాలూకా మోపర్రు గ్రామము. ౧౯౦౪ మే ౧౪ వ తేది వీరిజననము. ఆంధ్ర ఆంగ్లేయ హిందీ భాషలను లెస్సగా నేర్చినవారు. ఇంటర్ మీడియట్ పరీక్షలో వీరి అభిమాన విషయము చరిత్ర. చరిత్రలో గతించిన ౧౪ ఏండ్లనుండి విశేష పరిశ్రమ సల్పుచున్నారు. భారత విదుషీరత్నములు ౧-౨ భాగములు ప్రకటించినారు. ౧౯౪౪-౪౫ సంవత్సరములలో ఆంధ్రప్రభలో రామాయణము చారిత్రక మైనదా? మహాభారత యుద్ధకాల నిర్ణయము, మహాభారత రచనాకాలనిర్ణయము., పాండవులన్యదేశీయులుకారా? మున్నగు వ్యాసములు వ్రాసి యనేక చారిత్రిక సత్యములబయటపెట్టి యాంధ్రదేశమునకు విభ్రమము కలిగించిరి. వీరుప్రస్తుతము ప్రాచీనభారతీయ గ్రంథాలయ చరిత్రమను ప్రాముఖ్యమగు గ్రంథమును ప్రమాణములతోసహా వ్రాసి ప్రకటించుచున్నారు. ఇంకను భారతీయ ఇతిహాసముల చరితము, వివాహముల చరితము, బౌద్ధమతముపై హిందువుల అత్యాచారములు మున్నగు గ్రంథములు వీరుస్థాపించిన ఇతిహాసపరిశోధకమండలి తరఫున ప్రకటింపనున్నారు. గుంటూరుసీమ రైతు సంఘము వారికి, బౌద్ధకాలరైతు చరితము, ప్రాగైతిహాసిక మహెంజదారో రైతు చరిత్రము, అను రెండుచారిత్రిక గ్రంథముల వ్రాసియిచ్చిరి. ఆంధ్రదేశములో వీరొసంగిన ఉపన్యాసములు లెక్కకు మిక్కుటములు. వీరుసంఘసంస్కరణాభిలాషులు. తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకా పామర్రు గ్రామవాస్తవ్యులు ది 24-1-45 న వీరి ఉపన్యాసములు విని, వీరి వ్యాసములకు సంతసించి, చారిత్రక కృషికై సన్మాన మొసగుచు రు 116 లు సమర్పించి, చారిత్రపరిశోధకాచార్య యను బిరుదొసంగిరి. అముద్రితములుగానున్న మిగత చారిత్రక గ్రంథములను కూడ త్వరలో ప్రకటించి మేలు చేయుదురుగాత. వీరి చారిత్రిక కృషి ఫలోన్ముఖమగునుగాత. భగవంతుడు వీరి కాయురారోగ్యములు గల్గించుగాతయని సికింద్రాబాదు వాస్తవ్యుల తరఫున వేడుచున్నాము.

(తెలంగాణ పత్రిక 1-6-46)

# REFERENCE BOOKS

Mccrindle's works (Six)
Ananda Kousalyayan - Jataka Tales (Hindi)
Cowell - " 6 Vols. (English)
Rahul Sankrityayan - Vinaya Pitaka
Max Muller - Sacred books of the East
James Legge - Travels of Pahiyan
Jagan Mohan Varma - Pahiyan (Hindi) -
Sungayun "
T. Watters -On Yuan Chwang's Travels (2 Vols)
Samuel Beal - Life of Hiuen Tsiang (Hwiu Li)
J. Takakusu(Itsing) - A record of the Buddhist religion as practised in India and the Malaya Archipelago
K. A. Nila Kantha Sastry-Foreign notices of South India
Dr' E- Sachua - Alberuni's India
Vrajaratna Das - Humayun Nama (Hindi) -
Strabo's Geography 3 Vols.
Asoka's Inscriptions - Lalita Vistara
Cambridge History of Ind a 6 Vols
V. A Smith - Early History of India- Oxford History of India- Asoka - Akbar the great Moghul
Elliot - History of India 8 Vols.
Rhys Davids - Buddhist India
Weber - The History of Indian Literature
A. A. Macdonall - A history of Sanskrit literature - India's past
M. Winternitz - A history of Indian literature (2 Vols.)
Max Muller - A history of Sanskrit literature - What can India teach us ?
M. M, Williams - Indian wisdom
Herbert H. Gowen - A history of Indian literature
A, B Keith - A history of Sanskrit literature
Keith and Macdonall- Vedic Index (2 Vols.)
Paul Massan Oursel - Ancient India and Indian civilization
Charles Seignobos - A history of ancient civilization
R.C. Dutt - Civilization in ancient India (2 Vols) - Ancient India
R. L Mitra - Indo Aryans

H. G. Rawilson - Intercourse between India and the western world - Indian Historical Studies
Rev. F. E Keay - A history of ancient Indian education
N. N. Mazumdar-A history of education in Ancient India
R. K. Mukherjee - Hindu Civilization - Harsha
N. N. Law- Promotion of learning in India. - Promotion of learning in India by Early Europian settlers
T. L. Shaw - A history of India
H. G. Wells - A short History of the world
N. N. Ghosh - Early history of India
K. R. Subrahmanian - Buddhist remains in Andhra and Andhra history
Cunningham - Ancient Geography of India
Frederick Harrisson - A book about books
Baij Nath Puri - India as described by Early Greek writers
B. C, Law - Women in Buddhist literature
E. W. Hopkins - The great epic of India
R. N. Mehta - Pre Buddhist India
P. T. Sreenivasayyangar - A history of the Tamils
J. N. Sircar - India through the ages
Phanidranath Bose - Indian teachers of Buddhist Universities
James H. Cousins - The cultural Unity of Asia
Sir John Marshall - Indus Valley civilization (3 Vols.)
C. L. Mariwalla - Ancient Sind
A. C. Das - Rig Vedic India
T. V. Mahalingam - Administration and social life under Vijayanagara Empire
The Imperial Gazetteer of India- Indian Empire (4 Vols.)
Indian Antiquary Volumes
Modern Reviews from 1930 Jan. to 1946 May
Encyclopedia Britannica Volumes (1929)
Telugu Encyclopedia (2 Vols)
Ganga Prasad Mehta - Chandra Gupta Vikramaditya (Hindi)
Pargiter - Ancient Indian historic tradition
Andhra University publication No. 11- A descriptive Catalogue of the Telugu manuscripts etc. etc

# తొలిపలుకు

చరిత్ర యనఁగా సత్యమును రాబట్టుటకు చేయు విచారణ. (An enquiry desiqned to elicit truth) వేదాంతము, వేదసారము, వేదశిరస్సు అని పిలువఁబడు ఉపనిషత్తులుకూడ 'సత్యంవద, ధర్మంచర' యని చెప్పుచున్నవి. ప్రాచీన గ్రంథములు సత్యమే పరమాత్మ యని నుడువుచున్నవి. బుద్ధదేవుఁడు సత్యమును గనుఁగొనుటకే వనంబులకుఁ జనెను. గాంధిమహాత్ముఁడుకూడ సత్యాన్వేషణమే (See 'My experiments with truth) చేయుచున్నాఁడు. నేనుకూడ నా పరిశోధనలలో సత్యమను పరమాత్మ నన్వేషించుచున్నాను. ప్రాచీన గ్రంథము లనేకములు అభూతకల్పనలు, కట్టుకథలతో నిండియున్నవి. అనేక గ్రంథములు మతప్రచారార్థమై వ్రాయఁబడియున్నవి. ఇందు నివురుగప్పిన నిప్పువోలె సత్యము మఱుఁగుపడియున్నది. అన్వేషించి దానిని బయటకు లాగవలయునని నేను ప్రయత్నించుచున్నాను. ఇది చరిత్రకారుని ధర్మమైయున్నది. ఇట్లు సత్యమును బయటపెట్టినచో, స్వలాభపరులు, అహంకారపూరితులగు కొందఱికి కొంపపోవునంత నష్టము గల్గవచ్చును. కాని, సత్యమను పరమాత్మ ఆజ్ఞను, ఉపనిషద్వచనముల నేను దాటఁజాలను. బుద్ధునికిఁ బూర్వమున నున్న అత్యంత ప్రాచీనములగు ఉపనిషత్తులు, అందలి ధర్మము నా ప్రాణము.

'భారతి విదుషీరత్నములు' ప్రకటించినది మొదలు (1932) సత్యాన్వేషణ సాగింప మొదలిడితిని. 1944 నవంబరులో రామాయణ మహాభారతముల మీఁద కొన్ని వ్యాసములు వ్రాసి, ఆంధ్రప్రభకుఁ బంపితిని. ఇందలి సత్యమును గ్రహించి, పత్రికాసంపాదకులగు శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు, వాని నన్నిటిని ప్రకటించి, ఆంధ్రలోకముతో నాకుఁ బరిచయమును గల్గించిరి. వారికి నా ప్రణామములు. ఆసమయముననే నేను మదరాసు పోయియుంటిని. శ్రీ పట్టికొండ రంగయ్య, శ్రీ జి. వి. కృష్ణారావు, శ్రీ బి. యస్. మూర్తి (M. L. A.)గార్లను గలసికొని, వారి ఆశీర్వచనములఁబొందియుంటిని.

మూర్తిగారు నాకు అమూల్యములగు సలహాల నొసంగియుండిరి. వారికి నా కృతజ్ఞతాంజలులు.

1945లో గుంటూరుసీమ రైతుసంఘమువారు 'భారత దేశ రైతుచరిత్ర' వ్రాయించవలెనని సంకల్పించియుండిరి. అందు ముఖ్యులగు శ్రీ ఆలపాటి సూర్యనారాయణ, పావులూరి బసవపున్నయ్యగార్లు నన్ను పిలిపించి, బౌద్ధకాలమునాటి, ప్రాగైతిహాసిక మహంజదారోకాలమునాటి, రైతుచరిత్రల వ్రాసిపెట్టవలెనని కోరిరి. ఈ పరిశోధనలు నేను చేయు కృషికి తోడాయెను. ఒకసంవత్సరములోపుగా ఆ రెండు భాగములు వ్రాసి యొసంగితిని. నన్నీ పరిశోధలకుం బ్రోత్సహించిన ఈ ప్రముఖుల కిరువురికి నా వందనములు.

నాకు అవకాశ మున్నపుడెల్ల 'గ్రంథాలయచరిత్రము' వ్రాసికొనుచుంటిని. 1944లో ఆలపాడు గ్రంథాలయ వార్షికోత్సవసభలో, గ్రంథాలయములం గూర్చి ఉపన్యసించితిని. తరువాత అమృతలూరు గ్రంథాలయ వార్షికోత్సవము (1945) కోలవెన్ను రామకోటీశ్వరరావుగారి అధ్యక్షతక్రింద జరిగినపుడు, నేను హెచ్చుగా గ్రంథాలయ చరిత్రమును, గ్రంథాలయములలో నుంచవలసిన పుస్తకములను గూర్చి ఉపన్యసించితిని. హేతుబద్ధముగాని గ్రంథములను సాధ్యమైనంత త్వరలో గ్రంథాలయములనుండి తొలంగించుట మంచిదని కూడ నేను చెప్పియుంటిని. గులకరాళ్ళు నూరుండుటకంటె, రత్నమొకటి చాలదా? మరల 1945లోనే గోవాడ గ్రంథాలయ వార్షికోత్సవము, గమిని వెంకటకృష్ణారావుగారి అధ్యక్షతక్రింద జరిగినపుడు, గ్రంథాలయాభిమానులగు పావులూరి ఆనందయ్యగారి ఆహ్వానముపై నేను వెళ్లి, గ్రంథాలయ చరిత్రమును జెప్పియుంటిని. నా యుపన్యాసములను రెండుచోట్ల విన్నట్టి, చాలకాలమునుండి గ్రంథాలయోద్యమములో కృషి సల్పుచున్నట్టి శ్రీ పాతూరి నాగభూషణముగారు నన్ను ప్రోత్సహించి, గ్రంథాలయచరిత్రను త్వరలో ముగించి ప్రకటించవలెనని నన్ను కోరిరి. మిత్రులు ఆవుల గోపాలకృష్ణమూర్తి, ఎం.ఏ., బి.యల్., గారు, ఇంగ్లీషులో వ్రాసినచో ప్రాముఖ్యత ఎక్కువగునని ప్రోత్సహించిరి. ఈ యిరువురికి నా నమస్కృతులు.

24-1-45వ తేదీన తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకా పామఱ్ఱు గ్రామవాస్తవ్యులు నన్ను సన్మానించుచు, నా చారిత్రిక పరిశోధనలకు సంతసించి రు 116 లు కానుకగా నొసంగిరి. నిష్కల్మషచరిత్రులు, యశోభిలాషులు నగు ఈ సజ్జనులకు నా మనః పూర్వక వందనములు.

ఈ గ్రంథ రచనకు అనేక గ్రంథముల, శిలాలేఖనములఁ బరిశీలించియుంటిని. గుంటూరు క్రిస్టియన్ కాలేజి గ్రంథాలయములోని గ్రంథముల నన్నిటి నేను వాడుకొనుటకు 'ప్రిన్సిపాలుగారు' అనుమతించియుండిరి, అందలి గ్రంథాలయాధికారులు విసుగులేకుండ, నేను కోరినపుడెల్ల పలుగ్రంథముల నొసంగిరి. మిత్రులు వై. రోశయ్యగారి కృషియే దీనికి కారణము. వీరి కెల్లరకు నా వందనములు. ఇంకను మదరాసులోని 'కానిమీరా', విశ్వవిద్యాలయ గంథాలయముల లోని గ్రంథములు, శాసనసంపుటములు హెచ్చుగా నుపకరించినవి. వేటపాలెము సారస్వత నికేతనములోఁగూడ రెండు దినము లుంటిని. ఏ. శ్రీనివాసరావుగారు నన్నెంతయో ఆదరించియుండిరి. వారికి నా నమస్కారములు. అనేక ఆంగ్లేయ, హిందీగ్రంథముల నేను స్వయముగాఁ దెప్పించుకొంటిని, ఇంకను నాకుఁ గావలసిన 'మాడర్న్ రివ్యూ' (Modern Review) పత్రికా సంపుటములను గతించిన 16 ఏండ్లనుండితమయొద్దఉన్నవాసిని శ్రీ కె. శ్రీరంగరాజన్ బి.ఏ.,ఎల్.టి. గారు నా కొసంగిరి. సదా నాశ్రేయస్సునుగోరు వీరికి నా నమస్కృతులు. ఈ పత్రికలలోని విమర్శనములు, వ్యాసములు నా జీవితపథమునే మార్చివైచినవి. ఇంకను నా శ్రేయస్సును సర్వవిధములఁ గోరునట్టి, హెచ్చుగాఁ బరిశోధించుటకు పూనా, కలకత్తా మున్నగుతావులకుఁ బోవలసినదిగా ప్రోత్సహించునట్టి మా యనుంగు మిత్రులు శ్రీ కల్లూరి చంద్రమౌళి, బి.యస్.సి. (M.L.A.) గారికి నాహృదయపూర్వక నమస్కారములు, ఇంకను బహువిధములుగా ప్రోత్సాహమొసఁగు మిత్రులు, మా గ్రామవాస్తవ్యులు, కులలక్ష్మి, సఫలతాది గ్రంథకర్తలు నగు శ్రీయుత వడ్లమూడి వేంకటరత్నముగారికి నా నమస్కృతులు. వీరి సలహాలు నాకు అమూల్యమైనవి. నా పరిశోధ

నల శ్రద్ధగా నవలోకించుచు, నాకు కుడిభుజముగా వ్యవహరించు ప్రియమిత్రుఁడు గోగినేని పాపయ్యగారికి నా వందనములు. నా కృషి కింకను సర్వవిధముల ప్రోత్సాహ మొసంగి, పెద్దలతో ననేకచోట్లఁ బరిచయము గల్గించిన శ్రీ బ్రహ్మానందగిరిస్వాములవారికి నా వందనములు.

17-5-1946 తేదీన మేము సికింద్రాబాదు వచ్చినప్పటినుండి సర్వవిధములగు వసతుల నేర్పరచి, నా క్షేమమును నిత్యము యోచించుచు, నన్ను బిడ్డవలె నాదరించి, అనేకమంది ప్రముఖులతోఁ, బత్రికాధిపతులలోఁ బరిచయమును గల్గించి, కుమ్మరిగూడలోని వారి ఉపన్యాసవేదికమీఁదకు నన్నాహ్వానించి 5 దినములు నేను ఉపన్యసించుట కవకాశ మొసంగినట్టి సికింద్రాబాదు వాస్తవ్యులు, సంఘసంస్కర్తలు, హరిజన నాయకులు నగు శ్రీ అరిగె రామస్వామిగారికి, పరిచయమును 1-6-1946వ తేదీ 'తెలంగాణ' పత్రికలోఁ బ్రకటించుటకు కారణభూతులైన 'ఆంధ్రపితామహులు' శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారికి, నాకు చేదోడువాదోడుగానుండి, సాయపడిన వారాల కుమారస్వామి, సి. వి. గుప్త, సత్తయ్యగార్లకు, సకాలమునకు పుస్తక మిచ్చిన 'రామా ప్రెస్' వారికి నా వందనములు.

భాషాంతరీకరణము స్వేచ్ఛగా, భావముచెడకుండ చేసియుంటిని. ఎంత శ్రమపడినను తప్పులు పడకపోలేదు. చదువరులు నన్ను క్షమింతురుగాత!

సికింద్రాబాదు,
7—6—1946

ఇట్లు
కొడాలి లక్ష్మీనారాయణ

# ప్రాచీన

# భారతీయ గ్రంథాలయ చరిత్ర

## ప్రథమాధ్యాయము

భారతీయ లిపి - మోబు శిలాశాసనము - బ్రాహ్మీలిపి పుట్టుక - భారతవర్షమునకు బాబిలోనియాకు వర్తక సంబంధము - రాఖల్ దాస్ బెనర్జీ పరిశోధనలు, మహంజదారో హారప్పల లిపి - ఆర్యుల దండయాత్ర - లిపి ప్రశంస - శిలా లేఖనము.

ప్రాచీన గ్రంథాలయములం గూర్చి తెలిసికొనుటకు ముందుగా భారతీయలిపినిగూర్చి విచారింపవలసియున్నది. భారతవర్షములో 'లిపి' యారంభమైన దెప్పుడు? అను విషయములో పాశ్చాత్య పౌరస్త్య విద్వాంసులలో తీవ్రమైన భేదాభిప్రాయములు గలవు. భారతవర్షములో వ్యవహారమునందున్న 'బ్రాహ్మీలిపి' వేలకొలంది యేండ్ల నుండి కలదని భారతీయపండితుల అభిప్రాయము. భారతీయులకు లిపి లేదనియు, ఫొనీషియావర్తకులు 'బాబిలోనియా'కు వ్యాపారార్థమై చనిరనియు, ఆ లిపిని బాబిలోనియనులు నేర్చుకొని, భారతీయ ద్రవిడ వర్తకుల కొసంగిరనియు, క్రీ॥ పూ॥ ఏడు లేక ఎనిమిదవ శతాబ్దము నుండి ఈ లిపి భారతవర్షములో వర్తక వ్యవహారములకుగాను వ్యాప్తిలో నున్నదనియు, అంతకుంబూర్వము భారతీయు లెఱుంగరనియు, వీబరు, బుహ్లారు, మెక్డనాలు, వింటర్ నిట్జ్, రైస్ డేవిడ్సు మున్నగు ప్రామాణికవిద్వాంసుల యభిప్రాయమై యున్నది.[1]

---

1. E. J. Rapson-- Cambridge history of India- chapter II. P. 62. Brahmi has been traced back to the Phoenician type of writing represented by the inscription in which, Mesha, King of Moab (850 B. C.) records his successful revolt against the kingdom of Israel. It was probably brought into India through Mesopatomia as a result of the early commerce by sea between Babylon and the parts of Western India. It is the parent of all the modern Indian alphabets.

Charles Seignobos - History of ancient civilization P. 84. "It is the Phoenicians that taught the world how to write." Paul Mausen Oursel — Ancient India and Indian civilization P. 220. "Ancient Indian script was Semite. Merchants trading with Babylon or even with Phenicians doubtless introduced it very early about 800 B. C. for the commercial use. From them it passed into the chancelleries of Kings and the Semite signs were added to and altered to render Aryan sounds. Kharoshti was introduced in the 6th Century B. C.

Ibid P. 219 — When Aryans entered India, they already had a a literature, but it was oral...There was no writing. Ibid P. 221... "writing was late".

Rhys Davids... Buddhist India P. 125... "The Indian traders namely Dravidians went on trade to Babylonia and learnt their script in the 7th or 8th Century B. C. It is Brahmi Script'

Weber and Buhler-Indian alphabet is derived from the North Semites. Weber— Indians borrowed their alphabet from the Phcenicians, Dr. Sucke, Issac Taylor—It is derived from that of the South Semites, in South Arabia (as quoted by Rhys Davids) Rhys Davids—Buddhist india—P. 119. "The Indian Alphabet is not Aryan at all. It was introduced into India by Dravidian merchants.

R. C. Dutt—civilization in Ancient India—Vol. 11 P. 28. 'Maxmuller—India had no written alphabet literature earlier than the 5th Century B. C. and the Indian alphabet is derived from the West."

R. L. Mitra—Indo Aryans. "There was no mention of writing' A. A. Macdonall—India's past. P. 7 "But the evidence available warrants the belief that martime Commerce between India and Babylon by the Persian Gulf flourished from about 700 to 480 B.C Specially Indian products—rice, peacocks and sandalwood- were known in the west by their Tamil designations. That they must have been imported from the west coast of India into Babylon by sea' is an inference to be drawn from an early Buddhist book, dating from perhaps 400 B. C.—corroboration of the date of the early trade between Mesopotamia and India is supplied by the alphabetical Phoenician writing, which was introduced into India and must have been in use there not later than about 700 B. C.

Ibid p. 50 "Minute palaeographical investigations made towards the end of last century, have shown that script here used is derived from the oldest form of northern semitic writing, that appears in Phoenician inscriptions and on the Moabite stone which was inscribed about 890 B. C. This may have been introduced by traders perhaps as early as 800 B. C. but its use was doubtless long limited to commercial requirements such as accounts and was then employed in the chancelleries for documents of various kinds.

Ibid p 51 "In the whole of ancient (Vedic) literature no evidence can be produced that writing was known".

H. G. Rawilson-Intercourse between India and the western world p. 14. 'Brahmi-script the parent script of India was borrowed from semitic sources probably about the 7th century B. C. (Buhler) Moabite stone was about 890 B. C. Ibid p. 26 Kharoshti script introduced no doubt by the Persians in their official documents remained in use on the North Western frontier till 4th century A. D.

Rev. F. E. Keay M. A. History of ancient Indian education P. 155 "Writing was introduced into India about 800 B. C. and the elaboration of the Brahmi Script was completed by about 500 B. C. or even earlier. Encyclopedia Britannica Vol. I (14th Edition 1929) P. 683 "The history of the Brahmi Alphabet is more difficult. Its origin is obscure.,'

M. Winternitz P. H. D. A History of Indian literature Vol I P 32 ' Stone of Mesha (Phoenician inscription) was about 890 B. C. Probably it was by Merchants perhaps already about 800 B. C. that writing was introduced into India. For a long time it was used for commercial purposes, records, correspondences, calculations etc. As many 22 Semitic characters— —44 letters. There was no writing in Vedic literature. Max Muller — What can India teach us ? P 17 ', Everyone who writes a letter, owes his alphabet to the Romans and Greeks; the Greeks owed their alphabet to the Phoenicians and the Phoenicians learnt it in Egypt.

E. J. Rapson — Cambridge history of India Vol. I Chap II P 151 ', The history of the alphabet has been used by Buhler to show that it was borrowed by traders from a South Semitic source via Mesopotamia about 800 B. C. but we cannot lay. any

మోబుశిలాశాసనములు - బ్రాహ్మిలిపికి పుట్టుక :—స్పష్టమైన వర్ణమాలగల శిలాలేఖనము, 1868 లో పాశ్చాత్య విద్వాంసులచేత కనిపెట్టబడినది. మోబ్ (Moab) రాజగు 'మేష' (Mesha) అను వాడు క్రీ॥ పూ॥ 890 సంవత్సర ప్రాంతమున, ఇస్రయిలు రాజగు (King Israel) జెహోరమ్ (Jehoram) అనువాని నెదుర్కొని, ఆ తిరుగుబాటు వృత్తాంతమును రాతిపై చెక్కించెను. ఇదియే ప్రఖ్యాతి గాంచిన 'మోబు' శాసనమని పేర్గాంచిన 'ఫొనీషియా శాసనము'[2]. అప్పటికే ఫొనీషియనులకు 'లిపి' గలదని స్పష్టపడుచున్నది.

ఫొనీషియా, సిరియాసముద్రపు ఒడ్డున గలదు. ఫొనీషియా దేశీయులకుం బూర్వమే ఐగుప్తీయులకు (ఈజిప్టు దేశీయులు) వ్రాత తెలియును. అది చిత్రలిపి. ఈ మిశ్రలిపి మహంజదారో సమకాలీనము, ఒక్కొక్క అక్షరము పెక్కుచిక్కులుగా నుండెను. ఈ గుర్తులనే ఫొనీషియనులు నేర్చుకొని, స్వయముగా 22 అక్షరముల వర్ణమాలను గనిపెట్టి, కుడినుండి ఎడమకు లేఖనము జేయుచుండిరి. వీరి నుండి బాబిలోనియనులే గాక, గ్రీకులుకూడ క్రీ॥ పూ॥ 8వ శతాబ్దమున నేర్చుకొనిరి. గ్రీకులనుండి రోమను లీ యక్షరమాలను నేర్చుకొనియుండిరి. బాబిలోనియనులనుండి, భారతీయ ద్రావిడవర్తకులు

---

stress upon this date. It seems indeed most probable that writing was introduced by traders and that it was only gradually adopted into its proper form for the expression of the Sanskrit langauge. At what date this took place is not really susceptible of proof; there is no certain reference to writing in the literature of a date earlier than the 4th century B. C. and the real development of writing belongs in all likelihood to the 5th century B. C.

Ibid P. 62 "Both of the alphabets now usually known as Brahmi and Kharosthi are of Semitic origin, that is to say, they are derived ultimately from the same source as the Europian alphabets. They were introduced into India at different periods and probably by different routes.

2 Frederick Harrison— A book about books P 2 "King of Moab was Mesha — Famous Moabite stone was set up to record his revolt against Jehoram, King of Israel."

నేర్చి, భారత దేశమునకుఁ దోడ్కొని వచ్చినట్లు కాన్పించుచున
ఫొనీషియనుల 22 అక్షరములు, 22 ధ్వనులుగా నుండెను. వీనినిజూ
యండఋషు తమ భాష కనుకూల మగునట్లు మార్చుకొనియుండిరి.
భారతీయ వర్ణమాల 'సెమిటిక్ వర్ణమాల(ఫొనీషియాలిపి)నుండి కల్గిన
దనియు, ద్రావిడవర్తకులీలిపిని బాబిలోనియానుండి తెచ్చినపిమ్మట,
భారతవర్షమున బ్రాహ్మణులు, విదేశీయాక్షరములని మెఱుఁగ
కుండ మార్చి తలక్రిందులుచేసిరనియు, మెసపటోమియానుండి క్రీ.
పూ.800 ప్రాంతమున భారతవర్షమున కీలిపి చేరినదనియు, క్రీ.పూ.500
నుండి ఎడమనుండి కుడికి వ్రాయుట మొదలిడిరనియు, 'బుహ్లరు'
పండితుఁడు వ్రాసెను. ఫొనీషియాలోని క్రీ.పూ. 2000-1000 మధ్య
పుట్టినదనియు, సిరియాలో సెమిటిక్ భాష మాటాడుజనులచే కల్పింపఁ
బడుటచేత, దానిని సెమిటిక్ లిపి యందురనియు విద్వాంసులు
వ్రాసిరి.

పై వ్రాఁతలఁబట్టి ద్రావిడవర్తకులు క్రీ. పూ. ఏడవ లేక ఎని
మిదవ శతాబ్దములో, బాబిలనునగరమునకు వర్తకమునకుఁబోవు
చుండిరనియు, వీరు ఆర్యులుగారనియు బాబిలనులోని లిపిని, తమ
తమ కార్యావసరములకు సెమిటిక్ జాతి వారి పూర్వులు తెచ్చిరనియు,
వారి శాసనములమీఁద, తూనికతాలపై అక్షరములు గలవనియు,
వానినీ దేశపు వర్తకులు నేర్చుకొని, భారతవర్షమునకుఁదెచ్చిరనియు,
ఈ దేశపు విద్వాంసులాలిపిని జూచి, సామాన్యజనుల కనుకూలముగా
సమర్చి, మార్చుకొనిరనియు, ఈ లిపియే బ్రాహ్మీలిపి యాయె
ననియు తెలియవచ్చుచున్నది.

హిందూ, బౌద్ధ, జైన సాంప్రదాయములు బ్రాహ్మీలిపి,
బ్రహ్మనుండియే కల్గినదను అభిప్రాయమును సూచించుచున్నవి 3

3 Prasanna Kumara Acharya M. A. Elements of Hindu culture and Sanskrit Civilization P. 109. " The Tradition of the Hindu Buddhist and Jain sects ascribe the invention of writing (i. e. the chief script Brahmi) to the creator Brahma and thereby claim it as a national invention of the remotest antiquity."

ఈ భావములు, నారదస్మృతి, బృహస్పతిస్మృతి, మనుస్మృతి, బౌద్ధుల లలితవిస్తారము, జైనులసమవయాంగ సూత్రము (క్రీ. పూ. 300) పన్నవన సూత్రము (క్రీ. పూ. 168) మున్నగువానినిబట్టి యెఱుంగ వచ్చును. చైనీయ లేఖకుఁడు 'హ్యుయాన్ సాంగు' (క్రీ. శ. 629-645) కూడ నీవిషయమునే పేర్కొని యుండెను. 'బాదామి' లో 'బ్రహ్మ' యొకచేతితోఁదాటియాకుల కట్ట పట్టుకొన్నట్లుఁ గాన్పించుచున్నది. గజనీముహమ్మదుతోవచ్చిన 'అల్బరూని (క్రీ. శ. 1030) వ్రాఁతలను బట్టి చూడఁగా, భారతీయుల కొకప్పుడు వర్ణమాలగలదనియు, దానిని భారతీయులు మఱచుటచేత నదిపోయినదనియు, నెవరును దానినిలక్ష్యపెట్టలేదనియు, నందుచేత జనులు నిరక్షరులై అజ్ఞానాంధకారములో మునిఁగి శాస్త్రవాసనయే లేకుండ పోయెననియు, నప్పుడు పరాశరుని కుమారుఁడగు వ్యాసుఁడు, భగవదుపదేశమునేత 50 అక్షరములుగల వారి వర్ణమాలను దిరిగికనిపెట్టెననియు, ప్రతిదానిని అక్షరమనుచుండి రనియు, గ్రీకులవలె భారతీయులు వ్రాయుదురనియు, గీఁతగీచి దాని క్రింద వ్రాయుదురనియు, తెలియుచున్నది.4 ఇట్లు బ్రాహ్మీలిపియొక్క పుట్టుక బ్రహ్మకారోపించుట, చూడఁగా, భారతీయులకీ లిపి, ఎప్పు డెట్లు వచ్చినదో తెలియకుండుటయే కారణముగాఁగాన్పించుచున్నది.

మాక్సుముల్లరు, కూడ వైదికార్యులు లిపి నెఱుంగరనియు, వారి వేదములు గ్రంథస్థములుగావనియు, ముఖస్థము లేయనియు, వేదములను గురుముఖమునుండివినినేర్చుటచేత వానికి శ్రుతులనుపేరువచ్చినదనియు

4 Dr. E. Sachua —Alberuni's India. P. 171 "As to the writing or alphabet of the Hindus we have already mentioned that it once had been lost and forgotten; that nobody cared for it and that in consequence people became illiterate, sunken into gross ignorance, and entirely estranged from Science. But then Vyasa, the son of Parasara rediscovered their alphabets of 50 letters by an inspiration of God. A letter is called AKSHARA............

Ibid p. 172 "The Hindus write from the left to the right like the Greeks. They do not write on the basis of a line, above which the bends of the letters rise, whilst their tails go down below as in Arabic writing. On the contrary, their ground line is above, a straight line above every character and from this line the letter hangs down and it is written under it."

నాకాలమున 'లిపి' యే యున్నచో, వ్రాతసామగ్రిపేర్లయిన వేదము లందుఁ గాన్పించెడివే యనియు వాస్తవముగా నూతకాలములో లిపి వచ్చినదనియు, నప్పుడైనవాడుకలో లేదనియు నభిప్రాయమును సూచించెను. 'మాక్సుడంకరు' అను పాశ్చాత్యుఁడు, క్రీ.పూ. 8వ శతాబ్దములో వేదసంహితలు వ్రాఁతలోనుండవచ్చునని సూచించెనుకాని, దీనికాధారములు లభింపవు. క్రీ. పూ. 6 శతాబ్దముల క్రిందట భారతీయులు లిపి నుపయోగించిరనుట కాధారములు లభింపకున్నవి.

భారతవర్షమునకు బాబిలోనియాకు వర్తక సంబంధము :— భారతదేశమునకు బాబిలోనియాకుఁ గల వర్తక సంబంధము డా. సాయసీ (Dr. Sayce) లెక్కప్రకారము క్రీ. పూ. 3000 నుండి కలదని తెలియుచున్నది. క్రీ. పూ 3000 క్రితము బాబిలోనియా మొదటి రాజు కాలమున 'ఉర్' ఛాల్డియా, శిధిల భాగములలో భారతీయుల టేకు కొయ్య గాన్పించుటచేత, అప్పటికే సంబంధముగలదని కొందరి యూహ. బైబులును బట్టి క్రీ. పూ 1000 క్రితము పాలస్టయినాలో రాజ్యమేలిన యూదుల రాజగు, సోలమన్ (Solomon) అతని నావికులనుండి బంగారము, వెండి, విలువగలరాలు సువాసన ద్రవ్యములు, చందనపుకొయ్య, తోకలేనికోతులు, నెమళ్లు, ప్రత్తిగుడ్డలు బహుమానముగా స్వీకరించుచుండెననియు తెలియవచ్చుచున్నది. ఇందులో వెండి తప్ప మిగతవన్ని, మలబారులో సమృద్ధిగాఁగలవు. 'బాబిలోనియాతోఁ' గలవర్తకసంబంధము క్రీ.పూ 7 శతాబ్దముల క్రితము కాన్పింపదని క్రీ. పూ 6వ శతాబ్దమునుండి, భారతీయులు వర్తకము చేయుచున్నట్లాధారములు గలవని, 'కెన్నడీ (Kennedy) యను విద్వాంసుడువ్రాసెను. 5 ఇది చారిత్రకసత్యము గానే యున్నది.

---

5 Baij Nath Puri M. A—India as described by early Greek writers, p. 1 "According to Mr. Kennedy, (Journal of the Royal Asiatic Society 1898 "Early commerce between India and Babylon ")" No archaeological literery evidence to a martime trade between India and Babylon prior to the 7th century B. C. can be found, but for the 6th century B. C. direct evidence is forthcoming."

ఈరెండు దేశములకు పర్షియను సింధుశాఖగుండ, అత్యంత ప్రాచీనకాలమునుండి, వ్యాపారము జరుగుచుండెను. భారత భూమినుండి, బియ్యము నెమళ్ళు, చందనపుకొయ్య పశ్చిమదేశముల కెగుమతియగుచుండెను. క్రీ. పూ. 700 నుండి క్రీ. పూ. 480 వరకు నీవ్యాపార ముచ్ఛస్థితిలోఁ గలదనుట కాధారములుగలవు. ఈవర్తక సంబంధము, క్రీ. పూ. 5వ శతాబ్దప్రాంతములోనిదగు బౌద్ధ జాతకకథ లలోని 'బావేరు' జాతకకథను బట్టి ధ్రువపడుచున్నది. ఈ వర్తక సంబంధముచేత, భారతీయ ద్రావిడ వర్తకులు, బాబిలోనియాలోని క్రొత్తలిపిని, నేర్చుకొన్నను తత్పూర్వము భారతవర్షమున 'లిపి' లేదాయనువిషయమును గూర్చి హెచ్చుగా విచారింప వలసియున్నది.

రాఖల్ దాసు బెనర్జీపరిశోధనలు—మహాంజదారో హారప్పల లిపి 1922వ సంవత్సరములో 'రాఖల్ దాసు బెనర్జీ'(R. D. B anerjee) యను వంగదేశపు భూగర్భ శాస్త్రవేత్త, క్రీ. పూ. 326 సెప్టెంబరు మాసములో 'అలెగ్జాండరు' అను యవన భూపతి భారతభూమినుండి స్వదేశమునకుఁ బోవుచు యవన భారతీయ భాషలలో శిలాలేఖ నముచేయించి పండ్రెండు దిగ్జయస్తంభములను నాటించి, 'బియాసు' నదినుండి వెనుకకు మరలిన వృత్తాంతము, ప్రాచీన చారిత్రక గ్రంథములలోఁ జదివి వాని నన్వేషింప మొదలిడెను 6 జయస్తంభ ములుగానిపింపలేదుకాని, ఆయన పరిశోధనలలో 'మహాంజదారో' యను శిథిల నగరము బయటపడినది. దానితో భారతవర్షచరిత్రము క్రీ. పూ. 3వ శతాబ్దమునుండి క్రీ పూ. 3000 వరకుఁ బోయినది. ఈనగరములోని ప్రజలకు వ్రాత తెలియునని, శిథిలనగరములో లభించిన సీళ్ళను బట్టి మన మెఱుంగవచ్చును.7 ఈ సీళ్ళనుబట్టి

---

6 J. W- macrindle M A.—The invasion of Alexander the great. p. 230 "On the third day, he emerged from his seclusion and ordered twelve altars of square stone to be erected as a monument of his expedition."

7 Sir John Marshall — Illustrated London News 20th Sept. 1924. "At a single bound we find that 5000 years ago, the people of Si nd and the Punjab were living in well-built cities, and were in possession of a relatively mature civilization with a high standard of art and craftmanship, and a developed sy stem of writing."



ప్రాచీన భారతీయ

యచట చిత్రమగు లిపి, వాడుకలోనున్నదని, ఆకాలపు ప్రజలు తమమనోభావములను, చిత్రపటములు వ్రాసిప్రకటించుకొనుచుండిరని తెలిసికొన వచ్చును[8] ఇట్టి చిత్రమగు వ్రాతనుండియే ప్రపంచములోని యన్ని లిపులు నుద్భవించినవి. క్రీ. పూ. 1000 ఏండ్ల క్రితము 'చైనా దేశము'లో నైత మొకవిధమగుచిత్రాక్షరలిపికాన్పించుచున్నది.

ఈసీళ్ళమీద వ్రాత కుడినుండి ఎడమకు వ్రాయఁబడినది. అట్టివి 247 సీళ్ళు లభించినవి. మిగతావానిలో మొదటి పంక్తి కుడినుండి యెడమకు, రెండవపంక్తి యెడమనుండి కుడివైపునకు వ్రాయఁబడియున్నవి. లాంగ్డన్ (Prof.Langdon) హంటర్ (Hunter) హెరాస్ (Heras) మున్నగు విద్వాంసులీ 'మహంజదారో' సీళ్ళ వ్రాతనుండియే, బ్రాహ్మీలిపి గల్గినదని యభిప్రాయ మొసంగిరి. హెరాస్ పండితుఁడింకను, ఈమహంజదారో వ్రాత స్పష్టముగా ద్రావిడుల వ్రాతయనికూడ నిరూపించియుండెను.[9] 'హెరాస్' మొత్తము 1800 సీళ్ళను బరిశోధించి యుండెను. 'హరప్ప'యను సింధునదియొడ్డునఁ గల మరియొక శిథిల నగరములోఁ గూడ, దొరకిన సీళ్లపైన నిట్టి చిత్రలిపియే కాన్పించినది. కాని యీవ్రాత లేవియు

8. C. L. Mariwalla B A., Ancient Sind p. 33 "Rev. Heras points out that it is picto - phono - graphic. All scholars agree with Rev. Heras in this, including Prof. Hunter, Prof. Langdon and Messrs. Gadd and Sidney Smith — . The script is certainly not alphabetic, since too many signs have been used. This opinion is corroborated by Messrs Gadd and Smith, the Assyrian scholars of the British Musuem."

9. C. L. Mariwalla B. A.— Ancient Sind p. 33 "Profs. Langdon and Hunter feel that from the system of modifying signs, it is amply clear that the whole of the Brahmi script is definitely derived from the Mohenjodaro script. Rev. Heras strengthens the surmise of professors Langdon and Hunter by being of the same opinion. He further points out that not only is the Brahmi script derived from the Mohenjodaro script, but that the Mohenjodaro script is definitely Dravidian in origin. And with this hypothesis, he has successfully deciphered nearly 1800 Mohenjodaro inscriptions."

భారతవర్షములోని యేలిపితోను సంబంధించినట్లుఁగానరావు. ఈసీళ్ళన్ని దంతము, రాయి, గోదుతోఁ దయారుకాఁబడి యున్నవి.

ఈ చిత్రలిపి, క్రీ. పూ. 3000 ఏండ్ల క్రితమున్నను, అంతకు పూర్వమెంత ఘోరకాలమునుండి వర్థిల్లుచున్నను, ఆర్యులు వచ్చు వఱకు నీ లిపి యేమైనదో తెలియకున్నది. ఆర్యులు భారతభూమికి వచ్చిన తర్వాత, లిపియందభిమానము గన్పఱచిన ట్లాధారములు లేవు. మహెంజదారో, హరప్పలలోని ప్రజల లిపిని, ఆర్యులు గ్రహించినట్లు కూడఁ దోఁచదు. మహెంజదారో, హరప్పలు, సింధునది వరదలవలననో అగ్నిప్రమాదముల వలననో, కలరా మున్నగు వ్యాధులచేతనో, ప్రజ లధికముగాఁ జనిపోయి పాడుబడి పోవుటచేతనో, శత్రువుల దండయాత్రల వలననో, యేదియో ఒక కారణముచేత, భూమి పాలాయెనని విద్వాంసుల యూహయైయున్నది. ఆనాగరికత ఆర్యుల రాకతోనో, తత్పూర్వమో యస్తమించి యుండవచ్చును, వారి నాగరికతను గొంత ఆర్యులు గ్రహించియుందురు. వారి చిత్రలిపి తరువాతనేమైనదో, తెలిసికొనుట కాధారములు లభింపవు.

ఈజిప్టుదేశములోఁ గూడ నాకాలమున చిత్రలిపి యున్న ట్లాధారములు గలవు. లిపులుదయించుటకుఁబూర్వమిట్లు ప్రతి దేశములోనేదోయొక విధముగు, చిత్రలిపులున్నట్లు గాన్పించుచున్నది.

ఆర్యుల దండయాత్ర - ప్రాచీన వాఙ్మయములో లిపిప్రశంస- భారతవర్షమున శిలాలేఖనము - లిపి భేదములు:— భారతవర్షముపై ఆర్యుల దండయాత్ర, క్రీ. పూ. 14వ శతాబ్దములో జరిగిన ట్లాధారములు కాన్పించుచున్నవి.[10] పశ్చిమోత్తర పరగణాలగుండ ఆర్యులీదేశమునఁ బ్రవేశించిరి. వారి నివాసభూములఁ గూర్చి వాదవివాదములు గలవుకాని. ఆధునికపరిశోధనలఁ బట్టి, డా॥ గైల్సు పండితుని

---

10. A. A. Macdonall - India's past p. 12. "The approximate date of this invasion remains conjectural but there are good grounds for regarding the 14th century B. C. as not improbable."

A. B. Keith—A history of Sanskrit literature p. XXIV Prof. Hertel. "Aryans lived for a time together under strong Mitanni influences and only turned definitely east to break up into Indians and Iranians after the Mitanni debacle in the middle of 14 century B.C

అభిప్రాయానుసారము 'డాన్యూబ్' నదీ పరిసరభూములనుండి ఆర్యులు వచ్చినట్లు గాన్పించుచున్నది. 'కప్పడోసియా'లోని 'బొఘాజ్ కాయ్' శిలాశాసనములఁబట్టి, ఆర్యులమార్గము కొంతవరకు తెలియుచున్నది. 1907 లో 'హూగోవింక్లరు' అను జర్మనువిద్వాంసుఁడు వీనిని గని పెట్టెను. ఇందులో ఇంద్ర, వరుణ, మిత్ర, నసత్యాదులపేర్లు, వేదములోని దేవతలపేర్లు గాన్పించుచున్నవి.[11] ఈ శాసనము రాతిపలకల మీఁద వ్రాయఁబడినది. హిట్టయిటు ఆర్యరాజులకు, మితన్ని ఆర్యరాజులకు జరిగిన సంధియేర్పాట్లు ఈ పలకలపై ఉదాహరింపఁబడి యున్నవి. ఈకాలమునాఁటివే యగు 'టెలెల్ అమర్నా' (Tel-el-Amarna) పలకలమీఁద వ్రాఁతలుకూడ గమనింపఁదగియున్నవి.[12] ఈశిలాశాసనములు 'మోబ్ రాతిశాసనముకంటె పూర్వపువి. అప్పటి కార్యులకేదో యొకలిపి గలదనుట స్పష్టము. లిపియే తెలియనిచో నీశాసనము లెట్లు వ్రాయఁబడి యుండును ? ఈ శాసనములు పారశీకార్యులు, హిందూఆర్యులు విడిపోకముందే వ్రాయఁబడినట్లుకాన్పించుచున్నది. వీనినిబట్టి క్రీ॥ పూ॥ 1380 నాఁటి కేదో యొక విధమైన లిపి నార్యులెఱింగిరని తెలియవచ్చుచున్నది.

'టెలెల్ అమర్న'లో లభించిన పలకలఁబట్టికూడ, 'యూఫ్రటీసు' యొక్క ఉపరి లోయలో, భారతవర్షములోని ఆర్యులఁ బోలిన జాతిమనుజులు, వీరు పూజించిన దేవతలనే పూజించిరని తెలియుచున్నది. 'హిట్టయిటు' శాఖకుఁజెందిన 'మితన్ని' ఆర్యులు వీరేనని ఆసియామైనరు, బాబిలోనియాల జయించి, వీరచట రాజ్యముల నేర్పఱచిరని బాబిలోనియాచరిత్రలో వీరిని 'మితన్ని'లందురని, వారిపేర్లు దుషరథ (దశరథ), సువర్దధ (సర్వదత్తు) మున్నగునవని. హిందూ ఆర్యుల

11 Herbert H. Gowen— A History of Indian literature p. 42 "Dr. Winckler in 1907, discovered the names of four Aryan deities, Indra, Varuna, Mitra Nasatya twins, among Hittite Mitannian treaties.," Ibid p. 43 "Aryan invasion may be as early as 1500 B.C. or as late as 1000 B. C."

12 P. Giles - Cambridge history of India Vol. I Chap III p 76 "To the same period as the Boghaz Khai inscriptions belong the famous letters from Tel-el-Amarna."

పేర్లను బోలినవని, భారతభూమిలో వేదములఁగూర్చినవారు వీరివంశ జులే నని చరిత్రకారులయభిప్రాయమై యున్నది. కాని భారతవర్షములో వేదరచన కెట్టి లిపి నుపయోగించి యుండ లేదు ; శిలాలేఖనముఁ జేసియుండలేదు. పారసీకులతో సంబంధముగల్గువరకు క్రీ॥పూ॥ 6వ శతాబ్దివరకు శిలాలేఖనము గాన్పింపదు. 'బొఘూజ్ కాయ్' శిలాలేఖన కర్తలగు ఆర్యులు వేరుశాఖయైనచో, భారతీయార్యులకు లిపి తెలియదేమోనని యూహ కల్గుచున్నది.

క్రీ॥ పూ॥ 975 సంవత్సరప్రాంతమునాఁటికి నాల్గు వేదములు పూర్తియాయెను. మహాభారతయుద్ధము క్రీ॥ పూ॥ 950వ సంవత్సర ప్రాంతమున జరిగిన ట్లనేకాధారములు గలవు తరువాత బ్రాహ్మణ గ్రంథములు క్రీ॥ పూ॥ 800 నుండి క్రీ॥పూ॥ 600 లోపుగా పూర్తియైనట్లు గాన్పించుచున్నది. వేదబ్రాహ్మణములకు 'శ్రుతు'లని పేరు. ఈ పవిత్రగ్రంథములు లిఖితరూపములోనికి రాకపోవుటచేత, గురువుల నుండి శిష్యులు విని ముఖస్థము చేయుటచేత వీనికి శ్రుతులని పేరు వచ్చినది.12(a) నియార్కసు (క్రీ॥పూ॥ 326) అను అలెగ్జాండరు లేఖకుని వ్రాఁతలనుబట్టికూడ చట్టములు గ్రంథములలో లేవని, నోటితోనే సాంప్రదాయముగా వచ్చుచుండె నని తెలుచున్నది.13(a) ఇది కొంతవరకు సత్యమే కావచ్చును

సూత్రగ్రంథములు లిఖితరూపములోనికి వచ్చుటచేత వానికి శ్రుతులని పేరు లేదు. వేదబ్రాహ్మణములకైనను శ్రుతులను పేరు, ఆయాగ్రంథములలోఁ గాన్పింపదు. తరువాత వ్రాసిన సూత్ర,స్మృతి, పురాణేతిహాసములందుఁ గాన్పించుచున్నది.

ఆర్యులు తమకవులు, గాయకులు చెప్పు కావ్యముల వినుచుండి

---

12 (a) A. A. Macdonall— India's past p 49 "Vedanta—They are after the close of the Vedic period thought to be revealed and were called by the name of Sruti or hearing, because the sacred Texts were not written, but recited and heard". A. Ragozin—Vedic India. "About 600 B. C. there was process of memorizing."

13 (a) Cambridge history of India Vol I. p. 413 "The laws (Nearchus said) were preserved by oral tradition not in books, a statement only relatively true."

రని, నాగరికతగల జాతులతోఁ గలియువరకు లేఖనము తెలియదని, జ్ఞప్తితో వాఙ్మయమును భద్రపరచుకొనుచుండిరని, హెచ్.జి. వెల్సు పండితుని యభిప్రాయము. వేదమంత్రములన్నియు జ్ఞప్తియందుంచుకొని గురువులు శిష్యులకుఁజెప్పుచు, వారిచే నధ్యయనముఁ జేయించుచుండిరి. లిఖితము చేసినట్లు కాన్పింపదు. సూత్రకాలము వచ్చువరకు వ్రాఁతప్రశంసయే కాన్పింపదు. క్రీ॥ పూ॥ 600 నుండి క్రీ॥ పూ॥ 200 వరకు సూత్రకాలమని పేర్కొనఁబడుచున్నది. క్రీ॥ పూ॥ 5 వ శతాబ్దినాఁటిదగు వశిష్ఠ ధర్మసూత్రము (XVI—10—14, 15) వ్రాఁత కాగితములను న్యాయమైన సాక్ష్యముగాఁ బేర్కొనుచున్నది. క్రీ॥ పూ॥ 350 నాఁటి వ్యాకరణశాస్త్రకర్త, పాణిని తన అష్టాధ్యాయిలో లిపి, లిబి, లిపికార, లిబికార, యవనాని యని పేర్కొనెను. అంతకుఁ బూర్వుఁడగు 'శాకటాయనుఁడు' (క్రీ. పూ, 5 వ శ.) సైతము 'యవనాని' శబ్దమును వాడెను. పాణిని వ్యాకరణముపై వార్తికములు వ్రాసిన, కాత్యాయనుఁడిది (క్రీ.పూ. 250) 'యవనలిపి'యే అనెను. ఉత్తర వేదకాలగ్రంథములలోఁ బెక్కుచోట్ల 'లిపికార, లిబికార. అక్షర, గ్రంథ, కాండ, పటల మున్నగుపదములు, ఇతిహాస, పురాణ. కావ్య రూపకాదులందుఁ గాన్పించుచున్నవి. కాని వైదిక వాఙ్మయములో నెచటను లిపి ప్రశంస గాన్పింపదు.

బౌద్ధగ్రంథములలో నిట్టిపదములు కాన్పించుచున్నవి. బౌద్ధుల త్రిపిటకములలోని, వినయపిటకము, నికాయములు 'అక్షరిక' యను ఆటను బేర్కొనెను. క్రీ, పూ. 450 నాఁటి కిది కాన్పించుచున్నది. బాలుర వీపులమీఁదనో, బయలులోనో అక్షరములు వ్రాసి, వానిని గుర్తింపుఁడని యడుగుచుండిరి.[14] వినయపిటకములో వ్రాఁతకళ శ్లాఘింపఁబడినది.

---

14 Rhys Davids—Buddhist India p 107 "Among the list of games, one of which is called Akkharika, (lettering) "Guessing at letters traced in the air, or in a play-fellow's back. This shows that knowledge of an alphabet was fairly prevalent at the time in question. Writing is praised at Vinaya pitaka IV—7 as a distinguished sort of art."

రాజుగారి ఖయిదీలపట్టీలో వ్రాయఁబడిన నేరస్థుఁడు, బౌ
సంఘములోఁ జేర వీలు లేదని వినయపిటకము తెల్పును.[15] 'లేఖ
ఛిందతి' మున్నగు వాక్యములు వ్రాఁతకలదని తెల్పుచున్నవి. 'రా
గృహ'లో 17గురు బాలురు గలరు. 'ఉపాలి' యను బాలుని జననీజ
కులు, ఉపాలి వ్రాఁతను నేర్చినచో, మన యనంతరము సౌఖ్యముతో
జీవించునుగాని, యతని వ్రేళ్లకు నొప్పికల్గును. కనుక 'గణితశాస్త్రము'
నేర్చినచో, మన మరణానంతరము సౌఖ్యజీవనము గడపఁగల్గును' అ
చెప్పుకొనుచుండిరి.[16] బౌద్ధుల జాతకకథలలో కొయ్యవ్రాఁతబల్ల
పేరు గలదు. మహావగ్గములో 'లేఖ, గణిత, రూప, మున్నగు పద
ములు గాన్పించుచున్నవి.

'లలితవిస్తార' మను బౌద్ధగ్రంథము క్రీ పూ. 3వ శతాబ్దము
నాఁటిది. బుద్ధుఁడు పాఠశాలకుఁ బోయెనని, విశ్వామిత్రుఁడను గురు
వా పాఠశాలలో నుండెనని బుద్ధునిచేతిలో 'ఉరగసర చందనపు
కొయ్యపలక' రత్నములుగల బంగారుకలము, మంచిసిరా కలవని,
ఆయన విశ్వామిత్రుని ట్లడిగినట్లు, లలితవిస్తారము చెప్పుచున్నది
"అయ్యా ! నాకు బోధింపఁదలఁచిన వర్ణమాల ఏదియో తెలుప
వలసినది. అది 'బ్రాహ్మీలిపియా, ఖరోష్ఠీలిపియా ? అని 64 లిపులఁ
బేర్కొనెను.[17] బడికి పోయిననాఁటికే యిన్ని లిపుల పేర్లు బుద్ధునికి

---

15 Rhys Davids—Buddhist India—p 107 "A criminal who had been written up in the King's porch, was not to be received into the order. (Vinayapitaka.).......................Vin. III—76—"Lekham chindati" scratches a writing.

16 T. W. Rhys Davids.—Vinaya texts, part I. Sacred books of the East Vol. XIII—Ed-by Max muller. p, 201 "In Rajagriha there were 17 boys. Upali's father and mother thought 'If upali would learn writing, he could after our death live a life of ease and without pain.' again 'If upali learns writing, his fingers will become sore;' but if he could learn arithmetic, he could after our death live a life of ease and without pain,"

17 Lalitha Vistara —Chap. V p 181 "Bodhisatwa taking up a tablet made of Uragasara sandal wood and excellent ink with a golden pen mounted with jewels, thus addressed the tutor Viswamitra "which is the writing, sir, which you wish to teach me? Is it the 1 Brahmi writing, 2 Kharosthi writing ...64 kinds,"



ప్రాచీన భారతీయ

తెలియునా ? యనునది సందేహాస్పదమే యైనను, అందువలన, లలిత విస్తరము వ్రాయుకాలమునఁ గల లిపుల పేర్లను మనము తెలిసికొనవచ్చును.

ఇట్లే జైనగ్రంథములలోఁగూడ క్రీ. పూ. 300 నాఁటి గ్రంథములలో 'లిపి' విషయము గాన్పించును గాని, పూర్వ గ్రంథములలోఁ గాన్పింపదు.

నాణెములు, భారతీయులిపి, విదేశీయులతో వ్యాపారము నివియన్నియు క్రీ. పూ. ఆరు లేక ఏడవ శతాబ్దప్రాంతమున నారంభింపఁబడినట్లు గాన్పించుచున్నది. గ్రీకు, రోము వాఙ్మయములకంటె గొప్పదైన సంస్కృత వాఙ్మయములో నెచటను, క్రీ. పూ. 5వశతాబ్దమునకుఁ బూర్వమునఁగల గ్రంథములలో లిపిప్రశంస లేదు. సంస్కృత వాఙ్మయము విశేషముగా నోటితోనే వచ్చుటచేతను, సాంప్రదాయానుగుణ్యముగా తగాదాలు తీర్పఁబడుచుండుటచేతను, భారతవర్షములో వ్రాఁతకళను, క్రీ. పూ, 6 వ శతాబ్దమునకుఁ బూర్వము విశేషముగా నభ్యసించినట్లు గాన్పింపదు, [18] ఏవిధముగాఁ జూచినను క్రీ. పూ. 700 పూర్వము భారత వర్షమున వర్ణమాల కలదన్నచో, దానికి బలవత్తరమైన ప్రమాణము లుండవలయును.

ప్రాచీన పరిషత్తులలోఁ గూడవర్ణమాల చెప్పినట్లు వ్రాయఁబడియుండ లేదు. ఒక్కొక్క పరిషత్తులో 21 మంది అధ్యాపకు లుందురని మాక్సుముల్లరు వ్రాసెను. ముగ్గురు, నలుగురున్న పరిషత్తగునని పరాశరుఁడు వ్రాసెను. వీనిలో నపస్వరాదులు లేకుండ, ధ్వనిభేదము లేకుండ వేదాదులఁ జెప్పుచుండిరి. కురు, పాంచాల, విదేహ, మత్స్య, ఉశీనర, తక్షశిల, నైమిశారణ్య, కాశి ఆదిప్రదేశముల విద్యా

---

18 H. G. Rawilson—Indian historical studies p 210—'The common legend that writing was not practised in India arose from the fact that most Sanskrit literature was transmitted orally, and legal disputes were settled by unwritten local custom.

Strabo XIV - 53, 67 etc.— 'writing was confined o t secular purposes. Even in the 5th century A. D. Pahiyan had the greatest difficulty in getting Mss. of Buddhist works.,

లయములుగలవు. క్రీ. పూ. 7వ శతాబ్దిలోఁ దక్షశిలా విద్యాలయ మారంభమైనది, మిగతవి పూర్వపువి. వానిలో గురువులు శిష్యులక వర్ణమాలఁ జెప్పినట్లు తోఁచదు. బ్రాహ్మణ గ్రంథములలో నెచ్చ నీవిషయము పేర్కొనఁబడి యుండలేదు.

భారతవర్షమున శిలాలేఖనము చాల నాలస్యముగా వచ్చినది. బౌద్ధచక్రవర్తి అశోకునికిఁ బూర్వము, రాతిశాసనములు గాన్పిం పవు.19 రైసుడేవిడ్సు అభిప్రాయప్రకార మింకను పూర్వమునుండియే శిలాలేఖనమీదేశమునఁ గాన్పించుచున్నది.20 క్రీ. పూ. 450నాఁటి భారతీయులు శిలాలేఖన మెఱింగియున్నను, ఆపద్ధతి పారసీకులనుండి భారతీయులు నేర్చినట్లు కానఁబడుచున్నది. 21 వాస్తవముగా లేఖనపద్ధతి భారతభూమిలో క్రీ.పూ. 5వ శతాబ్దమునుండి కలదనుటకు విస్పష్టమైన ఆధారములు గలవు 22 బుహ్లారు పండితుఁడు కూడ, క్రీ. పూ. 5వ శతాబ్దములో బ్రాహ్మణులకు వర్ణమాల గలదనెను. మాక్సుముల్లరు సూత్రకాలములో లిపివచ్చినదనెను. కాని 'బర్నెల్' క్రీ. పూ. 3వ శతాబ్దములోనే 'లిపి' వచ్చినదనెను. కాని యీయూహ సరియైనదికాదు, బుద్ధదేవుని మరణ సంవత్సరము (క్రీ. పూ. 477) లోఁ బుద్ధుని గోత్రజులు, నేపాళ సమీపమున, బుద్ధుని అస్థుల పాత్రలోనుంచి 'పిప్రవాస్థూపమును గట్టించిరి. దీనిపైన మసితో నక్షరములు వ్రాసిరి. అశోకుని కాలపు భాషకంటె భిన్నమైన భాషలో నిట్లువ్రాయఁబడినది.

---

19 V. A. Smith - Early history of India p. 16 "It is also significant that there is no really certain case of an incription of any sort in India before the 3rd century B. C. of older type."

20 Rhys Davids - Buddhist India p. 107—There was writing on silas. The tract on the silas may be dated, therefore approximately about 450 B. C.

21 H. G. Rawilson - Indian historical studies -p. 210 'Perhaps Asoka borrowed from Persia the idea of inscribing long records upon the surface of rocks where they would meet the eye of the passer by."

22 Cambridge history of India - Vol. I p. 141 'The real development of writing belongs in all likelihood to the 5th century B. C."

"ఇయం సలిల నిధానే బుధ స భగవతే సికియానాం
సుకితి భటినాం సభగిని కనంస పుత దలనం"॥

తా॥ భగవంతుఁడైన బుద్ధుని ఈశరీర నిధాన మాభగివంతుని యన్నదమ్ములును, సపుత్రభగినీకులునైన శాక్యులచే నిర్మింపఁబడినది. 22(a) బుద్ధునికాలమున మసితో నక్షరములు వ్రాయుపద్ధతి గలదని పైనఁదెల్పిన 'పిప్రవా' శాసనము తెల్పుచున్నది. అజఉదయుఁడు నందివర్ధనుఁడు అను శైశునాగవంశమునకుఁ జెందిన రాజుల ప్రతిమల మీఁద శాసనములు రెండు జయస్వాలునకు లభించినవి, క్రీ. పూ. 5వ శతాబ్దమునాఁటివే. అంతకుఁ బూర్వముశాసనములవ్రాయుపద్ధతి భారత వర్షమునఁ గాన్పింపదు. జయస్వాలు పండితుఁడు, బీహారు ఒరిస్సాలలో దొరకిన యొకశిలాలేఖనము క్రీ. పూ. 1500 నాఁటి దనెనుగాని దీని కాధారములు లభించనందున నాకాలపుదని యంగీకరింపఁజాలము.

భారతవర్షములో రెండు ముఖ్యమైన లిపులు 1 బ్రాహ్మీలిపి 2 ఖరోష్ఠీలిపి వాడుకలో నున్నవి. ఇవిగాక 'సమవయంగసూత్రము, పన్నవనసూత్రము' అను జైనసూత్రములలో 18 లిపులు గాన్పించును. బౌద్ధగ్రంథమగు 'లలితవిస్తారము'లో, బుద్ధుఁడు 64 లిపుల పేర్లను గురువగు విశ్వామిత్రునియొద్దఁ జెప్పెనని కలదు. ఇది అశోకుని కాలమున వ్రాయఁబడిన గ్రంథమగుటచేత, నాకాలమున 64 లిపులను భారతీయు లెఱింగియుండవచ్చును.

ముఖ్యమైన 'బ్రాహ్మీలిపి' క్రీ. పూ. 7వ శతాబ్దమునుండి మనదేశమున వాడుకలో నుండియుండవచ్చును. ఖరోష్టి యను మఱియొక లిపి ప్రాచీనకాలమునుండి, కాన్పించుచున్నది. ఇది 'పర్షియా, అరబ్బీ' లిపులవలెనుండును. కుడినుండి ఎడమకు దీనిని వ్రాయుదురు. గాడిద పెదవివలె నృత్తాక్షరములు గల్గియుండుటచేత, దీనిని 'ఖరోష్ఠీలిపి' యందురు. 'అకమీనియనురాజులు', డేరియస్ (Darius క్రీ. పూ. 522-486) క్సర్క్సస్ (Xerxes క్రీ. పూ. 416-398) మున్నగువారు సింధు పశ్చిమప్రాంతమును జయించినపుడు, ఈ లిపిని

22(a) "This shrine for relics of the Buddha, the August one, is the pious foundation (Sukiti) of the Sakyas, his brethern in association with their sisters, their children and their wives."

భారతవర్షములో నుపయోగించి యుండిరి. (23) పర్షియాదేశ ప్రభుత్వము 'అరమైక్' (Aramaic) భాష వాడుచున్న కాలములోను పశ్చిమోత్తర భారతవర్షము పారసీకుల యధీనములో నున్నపుడున్ను క్రీ. పూ. 6వ శతాబ్దిని 'ఖరోష్ఠి' ఈ దేశమునఁ ప్రవేశపెట్టఁబడె ననుటలో సందియము లేదు. (24) క్రీ. పూ. 330లో 'అలెగ్జాండ'రను యవనభూపతి, 'పర్షియా' పైకి దండెత్తి వచ్చుటచేత, వీరి రాజ్యమస్తమించినది. ఖరోష్ఠిలిపి క్రీ. పూ. 6వ శతాబ్దమునుండి, క్రీ. శ. 3వ శతాబ్దము వరకుండి ఈ దేశమునఁ దరువాత నస్తమించినది. మధ్యాసియాలోని యనేక ప్రదేశములలో లభించిన ప్రాచీన నాణెముల మీఁద, ఖరోష్ఠిలిపిలో భారతదేశపు ప్రాకృతభాషలో యక్షరములు, చైనీయభాషలోఁ జైనీయాక్షరములు చెక్కఁబడినవి. ప్రాచీన భారతభూమికి మధ్యఆసియాకు సంబంధము నివి తెలియ

---

23 V. A.Smith - Oxford history of India p. 46 "The Kharosthi alphabet derived from the Aramaic script, and written from right to left, which continued to the used on the North Western Frontier until about the 4th century of the Christian Era, appears to have been introduced by Persian officials and may be regarded as a memorial of the days when the Indus valley was part of the Achaemenian Empire',

H. G. Rawilson - Indian historical studies - p. 205 "This was the Kharoshti script, introduced by the officials of the Achaemeniads, which was not entirely replaced by the Brahmi writing till the 4th century A. D. The Kharoshti is undoubtedly Aramaic in origin, reading, like other kindred scripts from right to left."

24 E. J. Rapson - Cambridge history of India vol. I. chap. II p. 62 "Kharosthi is derived from the Aramaic script, which was introduced into India in the 6th century B. C. when the north west was under Persian rule, and when Aramaic was used as a common means of communication for the purpose of Government throughout the Persian Empire.

That originally the Aramaic language and alphabet pure and simple were thus imported into Gandhara as Buhler conjectured in 1895, has been proved recently by Sir John Marshall's discovery of an Aramaic inscription at Taxasila."



ప్రాచీన భారతీయ

పఱచుచున్నవి. అశోకుని శిలాశాసనములు (క్రీ. పూ. 3వ శ) కొన్ని బ్రాహ్మీ, ఖరోష్టి లిపులలోఁ గాన్పించును. మధ్యాసియాలోఁ గూడ కొన్ని శాసనములు, వ్రాతప్రతులు లభించినవి. అవి ఖరోష్టీలిపి, బ్రాహ్మీ లిపులలోఁగూడ వ్రాయఁబడినవి. అశోకుని కాలపు బ్రాహ్మీ లిపిలో వ్రాయఁబడిన ఆంధ్రశాసనములు భట్టిప్రోలులోఁ గాన్పించుచున్నవి.

# ద్వితీయాధ్యాయము

వ్రాతసామగ్రులు - విదేశములలోని వ్రాతసామగ్రి - భారతభూమిలో గుడ్డలు, త్వక్కులు, తాటిఆకులు, పాపిరసు, మొదలగునవి వాడుట - ఇతర లేఖకుల వ్రాతలు.

వైదిక కాలములో నార్యులకు లిపి తెలిసినట్లు గాన్పింపదు. యవనరాయబారియగు 'మెగస్థనీసు' (క్రీ. పూ. 302) కాలమువరకు నిట్లే కాన్పించుచున్నది.[25] భారతీయులకు వ్రాత తెలియదని, జ్ఞప్తి చేతనే పనులు జరుపుదురని కొన్నిచోట్ల మైలురాలు, దూరములు, బాటలమీఁద మకాములు తెలియుటకు గుర్తులుగా నుండెనని మెగస్థనీసు వ్రాసెను.[26] మఱియొకచోట వ్రాతలో లేని చట్టములద్వారా, వ్యాపార,, కచేరీ వ్యవహారములు జరుగుచుండె నని వ్రాసెను.[27] చంద్రగుప్తునివరకు రాజ్యమేలిన 153 గురు రాజులపేర్లు, వారి రాజ్యవర్షములు 6451 అని యున్న రాజులపట్టిక పాట్నాలోఁ గలదని వ్రాసెను గాని, యిది యంత సత్యముగాఁ గాన్పింపదు. మెగస్థనీసు

---

25 Strabo XV 53-66 — "As to the Hindus generally, they are ignorant of writing, have no written laws, and arrange everything from memory."

Frag. xxvii "The Indians are ignorant of writing and conduct all matters by memory work."

26. Rev. F. E. Keay — M. A. Ancient Indian Education p, 155.

"Megasthenese speaks of the use of mile stones to indicate distances and halting places on the high Roads."

27. Ibid p. 156 "At another place mentions unwritten laws con. fined to commercial and official classes."

తాను ప్రత్యక్షముగాఁ జూచినవి యథార్థముగానే వ్రాసెనుగాని, భారతీయబ్రాహ్మణులు చెప్పినవిషయములు కొన్ని యథార్థమని నమ్మి వ్రాసెను, అందులో నిది యొకటి కావచ్చును. కొన్నికట్టుకథలను గూడ నమ్మి వ్రాయుటచేత కాఁబోలు స్ట్రాబో అనువాఁడు (Strabo క్రీ. శ. 1వ శ) మెగస్థనీసు నసత్యవంతుఁ డని యాక్షేపించెను.[28] కౌటిలీయార్థశాస్త్రములో 'లేఖ్యారూఢశాసనములు, రాజకీయ పత్రములు, అనుజ్ఞాపత్రములు' మున్నగువాని వర్ణనము గలదుకాని, ఈగ్రంథమును చంద్రగుప్తుని మంత్రియగు 'చాణక్యుఁడు' వ్రాయనే లేదు. ఈగ్రంథరచనాకాలము కీత్, మెక్డనాల్, వింటర్నిట్జ్ వంటి తుల యభిప్రాయప్రకారము క్రీ.శ. 300 నాఁటి దగుచున్నదికాని కాశీ హిందూ విశ్వవిద్యాలయములో నధ్యాపకుఁడగు 'ప్రాణనాథు'గారి వాదనలప్రకారము క్రీ.శ. 480 - 510 మధ్యకాలము నాఁటి దగుచున్నది.[29] వీరివాదనలను నేను సర్వవిధముల నంగీకరించుచున్నాను. ఈకారణముచేత దీనిలోనివిషయములు క్రీ.పూ. 300 నాఁటివని యంగీకరింపఁజాలము. ఎట్లయినను భారతీయులు క్రీ. పూ. 700 ప్రాంతము నుండి వాణిజ్యమునకు, జమాఖర్చులకు, పత్రవ్యవహారములకు లిపిని వాడుచున్నట్లు గాన్పించుచున్నది. గ్రంథములుమాత్రము లిపి తెలిసిన తర్వాతకూడ వ్రాయుచున్నట్లు గాన్పింపదు. వ్రాఁతసామగ్రి తెలియకుండుటయే దీనికి ప్రధానకారణము గావచ్చును. విదేశములలో నెంతయో కాలమునుండి వ్రాఁతసామగ్రి నెఱింగిరనుట కాధారములు పెక్కులు గలవు.

'అసీరియా'కు ముఖ్యనగరమగు 'నినెవా (Ninevah)' లో క్రీ. పూ. 2500 క్రితము ఇటుకరాలు, పెంకులు పదివేలు గాన్పించి

28 Baij Nath Puri M. A. Ancient Greek writers p. 12 Strabo- "Generally speaking, the men who have written on the affairs of India were a set of liars. Deimachus holds the first place in the list, Megasthenes comes next. ——— No faith whatever can be placed in Deimachus and Megasthenes."

29. Pran Nath Bose—Indian antiquary LX—P 121 "The Artha sastra was compiled between 484—510 or 528 A. D. when the kings of Malwa were exposed to attack by the cruel Hunas."



ప్రాచీన భారతీయ

నవి. అవి యొక్కొక్కటి ఒకటిమొదలు పండ్రెండు అంగుళములవఱకు వైశాల్యము గలవిగాఁ గాన్పించుచున్నవి. వానిలోఁ గొన్నిటిమీఁద 'అస్సీరియా' సామ్రాజ్యము యొక్క చరిత్రలోఁ గొంతభాగము వ్రాయఁబడినది. ఆకాలపుపుస్తకములు గూడనిటుకరాలు, కాల్చినమట్టి పలకలతోఁదయారుకాఁబడినవి.30 ప్రశస్తముగు రేగడిమట్టిపై వ్రాయఁబడిన శాసనములు నేఁటికిని నిల్చినవి. క్రీటు, బాబిలోనియాలలో మొదట పెంకులపై యక్షరములు వ్రాసి, వానిని గాల్చిరి. ఇవియే పుస్తకము లాయెను. లిఖితనిదర్శనములుగల పురాతన సామ్రాజ్య మిదియే. 'మెసపటోమియా'లో నేల త్రవ్వుచుండఁగా, కాల్చిన రేగడి మట్టి పెంకులు దొరకినవి.31 ఇవి బాలుర పుస్తకములుగా నున్నవి. అప్పటికే పాఠశాలలు గలవని చరిత్రకారుల యూహ. తరువాత గ్రీకులవి మొదటి పాఠశాలలుగాఁ గాన్పించుచున్నవి. బాబిలోనియాలోను, ఉర్ లోనుగూడ రేగడిమట్టిబిళ్లలు క్రీ.పూ. 2000 యేండ్ల నాఁటివి కాన్పించినవి. ప్రాచీన 'మెసపటోమియా'లోఁ జాలకాలము జాబులు, శాసనములు, పత్రములు, జమాఖర్చుల లెక్కలు మొదలగునవి గట్టి యిటుకలపై, పెంకులపై వ్రాయఁబడుచుండెను. 'అస్సీరియా'రాజు 'అసుర బాణిపాలుని' కాలములోఁ గూడ మట్టిబిళ్లలపై వ్రాఁతలు వ్రాయుచుండిరి.

క్రీ. పూ. 20 లేక 25 శతాబ్దములకుఁబూర్వము ఈజిప్టు (మిశ్ర) లోని పత్రములు 'పాపిరి' (కాగితము చేయు రెల్లు) మీఁద వ్రాయుచుండిరి. నైలునదిప్రాంతములలో సమృద్ధిగా నీ 'పాపిరసు' లభించుచుండుటచేత, ఐగుప్తదేశీయులు దీనిని లెస్సగా వాడుచుండిరి.32 ఇది

---

30 Frederick Harrison—A book about books p 1 "In Assyria capital Ninevah, 2500 years old bricks were found- 10000 were found—. 1"—12" square were found- On some of them is written part of the story of the Assyrian empire. Yet books were made of bricks or tablets of burnt clay."

31 Ibid—p 141 "It is claimed for clay tablets that they existed in Babylonia, in Ur of the Chaldees and in other cities, as early as 2000 B. C.".

32 Frederick Harrison---A book about books. p. 6 "Egyptian records on papyri written about 20 or 25 centuries B. C. Egyptians

యొక చిన్న రెల్లుజాతిచెట్టు. జమ్మువలె పెరుగును. దీని వేరు వం
సరకునకును, ఆకులు పైకప్పులకు, దుస్తులకు, తెరచాపలకు, కాగిత
లకు, వ్రాతకు నుపయోగించుచుండిరి. దీనినుండియే పేపర్ (Pape
వచ్చినదని విద్వాంసులయూహ. 'పాపిరసు'ను జాపవలెనల్లి, దా
పైన వ్రాయుచుండిరి. రెల్లు కలముతోనో, బొంగు కలముతో
సిడకబొగ్గుతోఁ జేయఁబడిన సిరాతో నక్షరములు వ్రాయుచుం
ఒక్కొకవుడు, ఐగుప్తీయులు, రెల్లుగడ్డి కాడలలోని గుజ్జుతోఁ గా
తములుచేసి, వానిపై నక్షరముల లిఖించుచుండిరి. ఈ 'పాపిరస
చెమ్మ, వేడివలన, విశేషకాలము మనక శిథిలమైపోవుచుండెను.

గ్రీకులు. ఫొనీషియనులనుండి 'లిపి'ని క్రీ. పూ. 8వ శతాబ్ది
నేర్చి, తమ దేశములో వ్రాతపరివేశపెట్టుటకు, వ్రాత సామ
కన్వేషించుచుండిరి. గ్రీకులు, 'పాపిరసు'ను. 'ఈజిప్టు'నుండి, తమ
దేశమున రెగుమతి చేసికొనుచు, దానిపైన వ్రాసికొనుచుండిరి.
శిలాలేఖనము శాకపూర్వము క్రీ. పూ. 6 వ శతాబ్దములో రా
మేలిన 'సోలన్' (Solon) అను గ్రీకురాజు శాసనములను గొయ్య
లపై చెక్కించెను. క్రీ. పూ. 7, వ శతాబ్దమధ్య కాలములో, అ
బ్బులు 'ఈజిప్టు'ను జయించినప్పుడు, 'పాపిరసు' నెగుమతి చేయు
ఆగిపోయెను. ఈజిప్టులోఁగూడ 'పాపిరసు'ను వాడుటమాని వేసి
'యూమినస్' (Eumenus) అను పెర్గామస్ రాజు (King of Pergam
ఆసియామైనరులో క్రీ.పూ. 2వ శతాబ్దిలోఁ దానొక గ్రంథాలయ
మేర్పఱుపఁదలంచి యుండెను. ఈజిప్టురాజు తన గ్రంథాలయమును
భిన్నమగునేమోయని ఈజిప్టునుండి 'పాపిరసు' నెవరును గైకొనిపోరా
చట్టమును జేసెను. అంతట యూమినస్ (Eumenus)పరిశోధనలు సాగిం
పశువులచర్మములను వ్రాతకు వినియోగించెను. తరువాత వేలకొలది
పుస్తకములు, ఆవుదూడ్ల చర్మములపై వ్రాయఁబడినవి.34

---

used this as this papyrus plant grew in abundance on the bank
of the Nile............Ink was applied."

33 Ibid---"In course of time the Greeks began to import pa
pyrus from Egypt and to use it for their records."

34. Frederick Harrison - A book about books. p. 10 "In Egypt
itself a blow to the use of Papyrus was dealt by Arabs when the

'బైబిలునందుకూడ 'పాపిరస్' మీఁద వ్రాఁత వ్రాయుటను గూర్చి ఉల్లేఖింపఁబడియున్నది. నేఁటికి నిల్చిన అతి పురాతనములగు బైబిలు వ్రాతపతులు 'పాపిరసు' మీఁదనే యున్నవి.[35]

'ఏథెన్సు' (Athens) నగరములో, 'నగర చట్టముల' నతిక్రమించిన వారిపేర్లు కుండపెంకులపై వ్రాసి, వెడలఁ గొట్టుచుండిరి.[36] అంతకుపూర్వమే క్రీ. పూ. 2000 యేండ్ల క్రితమునుండి, ఐగుప్తదేశీయులు చర్మములను శుభ్రపఱచి, వానిపైన వ్రాయుచుండిరి.

'ఫానీషియనుల'నుండి గ్రీకులు, గ్రీకులనుండి రోమనులు నాగరికతను, లిపిని నేర్చుకొనియుండిరి. రోము దేశీయులు వర్ణమాలను నేర్చిరి కాని వ్రాఁతసామగ్రి కాన్పింపదు. అందుచేవారు పురాతన కాలములో జంతువుల ఎండిన చర్మములపైగాని, మైనముచేత కప్పఁబడిన చిన్నపలకలపైగాని వ్రాయుచుండిరి,

పారసీకుల వేదమగు 'జెండవిస్టా' క్రీ. పూ. 6వ శతాబ్దప్రాంతమున, జరతుష్టుఁడను, వేదకర్త చనిపోయిన తర్వాత 21 పుస్తకములుగా, 12000 ఆవుతోళ్ళపై వ్రాయఁబడినట్లు గాన్పించుచున్నది.[37]

---

conquered the country about the middle of the 7th century B. C. They stopped the export of Papyrus. Eumenus, king of Pergamos, in Asia minor, during second century B. C. anxious to provide a library for himself, found the source of Papyrus cut off by the king of Egypt, who jealous of the reputation of his own library, ordered that no more papyrus should be exported from Egypt. This led to experiments in the preparation of skins, which were successful during the reign of Eumenus— — Thousands of books were written on parchment. (skin of calf).

35. Ibid p. 5. "The bible contains references to writing on papyrus. Indeed the earliest biblical manuscripts that have survived are on paper."

36 Ibid p. 3 "At Athens the names of those who were to be banished for breaking the laws of the city were inscribed on potsherds while leather, made from skins, was used by the Egyptians as far back as 2000 years B. C."

37 Charles Seignobos—History of ancient civilization. p. 65 "Jend Avesta was reduced to writing long after his death. It was

పై విధముగా విదేశీయులు, కాల్చిన మట్టిపెంకులు, ఇటుక రాలు, 'పాపిరసు' పశువుల చర్మములు, కుండ పెంకులు, మున్నగు వానిపైన వాయుఆచారము పలుచోట్ల గాన్పించుచున్నది. భారత వర్షములో వ్రాతసామగ్రినిగూర్చి ప్రస్తుతము చర్చింపవలెను.

పాగ్దేశములలో మైనముకప్పిన దంతపు పలకలు, లోహము, కొయ్య మున్నగువానిపైన వ్రాసి, నోటు పుస్తకములుగా నుపయోగించుచుండిరని, గ్రీకు చారిత్రికజనకుడగు 'హిరోడోటసు(Herodotus B. C. 484-425.)' రోము చరిత్రకారుడగు 'సిసిరో (Cicero క్రీ. శ. 1 వ శ.) అనుజూలియస్ సీజరు, కాలమున జీవించియున్న లేఖకులందును వ్రాసిరి,38 అలెగ్జాండరుతో వచ్చిన లేఖకుడు 'నియార్కసు' (క్రీ. పూ. 326), భారతీయులు దట్టముగా నేయబడిన గుడ్డలపై లేఖలు వ్రాయుచుందురని వ్రాసెను.39 ఆకాలమునాటికి భారతీయుల చట్టములు లిపిరూపమున లేవు. గుడ్డలమీద కాక, కొండరావి పట్టల మీద, ఆకులపైనసిరాతో వ్రాయుచున్నట్లు తెలియవచ్చుచున్నది.40 నియార్కసు, (Nerchus( క్విన్టన్ కర్టియస్, (Quintin Curtius) ల యుక్తి వాక్యములబట్టి అక్షరములపై మసి పులుము ఆచారము

---

divided into 21 books, inscribed on 12000 cow-skins, bound by golden cords." Also Paul Massen Oursel - Ancient India p. 220 "Avesta written on calf skins, prepared for the purpose."

E. J. Rapson - Ancient India p. 30 "Indian Rigveda possibly as early as 1200 B: C. and the Persian Avesta dating from the time of Zoraster probably about 660 - 583 B. C.

38. Frederick Harrison - A book about books p. 3 "Tablets of ivory, metal or wood, covered with wax and used as note books, are mentioned by Herodotus, the father of history who lived in Greece in the 5th century B. C. and also by Cicero, who lived in Rome in the time of Julius Caesar,"

39. Strabo (XV—1—67) "Indians write letters upon cloth which had been very closely woven." (B. C. 27 B. C.—14 A. D. Augustus)

40. Quintin Curtius, Nearchus — "The tender side of the barks of trees receives written characters like paper." Maxmuller - History of Sanskrit literature p. 506. Curtius. "They wrote on the soft rind (bark) of trees. (There was no palm. It was birch bark.)



ప్రాచీన భారతీయ

కూడ నాకాలమునఁ గలదని తెలియవచ్చుచున్నది. బుద్ధదేవుని 'పిప్రవా' సమాధివద్ద నిట్టి మసి యక్షరములు కాన్పించినవి, ఇనుప గంటములతోఁ వ్రాయునక్షరములు కాన్పింపమి, వానిపైన మసి పూయుచుండిరని తోఁచుచున్నది. యవనరాయబారి 'మెగస్థనీసు' (Megasthenes) వ్రాఁతసామగ్రిని బేర్కొనకపోగా, హిందువులకు వ్రాఁతయే తెలియదనెను. కాని అంతకు పూర్వమువచ్చిన 'అలెగ్జాండరు' లేఖకుల వ్రాఁతలవలన, పిప్రవాశాసనము వలన (B. C. 477) భారతీయులకు వ్రాఁత గలదని తెలిసికొనవచ్చును. వ్రాతసామగ్రిని గూర్చి కూడ యవనలేఖకులు ప్రస్తావించియే యుండిరి.41. క్విన్టన్ కర్టియసు (క్రీ. శ, 1వ శ.) హైందవులు చెట్లయొక్క మెత్తని త్వక్కులపై వ్రాసెదరనెను. 'ప్లిని' (క్రీ. శ. 77) వ్రాఁతలనుబట్టి చూడఁగా, 'అలెగ్జాండరు' కాలమునకుఁ దర్వాతగాని 'పాపిరసు' 'ఈజిప్టు'నుండి బయటకు రాలేదని, యిచట తాటియాకులు, కొన్నిచోట్ల త్వక్కులు తర్వాత 'పాపిరసు, అను కాగితము వాడఁబడినవని తెలియుచున్నది.42 'అర్రియస్ (Arrian A. D. 2nd century) కూడ హిందువులు వృక్షముల త్వక్కులమీఁద వ్రాసెదరనెను. భారతవర్షములోఁ బశ్చిమోత్తరభా

---

41. J. w. Mccrindle M.A., Quintin Curtius p, 186 "Strabo on the authority of Nearchus that the Indians wrote letters upon cloth, which was well pressed to make it smooth, but adds that other writers affirmed that the Indians had no knowledge of writing. They were however acquainted with writing for some centuries before Alexander's time, but whence they got their alphabet is a question not yet quite settled, though the weight of opinion inclines to assign it a Himyaritic origin. We learn from Pliny, that paper made from the Papyrus plant did not come into common use out of Egypt till the time of Alexander the Great. He then goes on to say that for writing on the leaves of palm were first used and then the barks of certain trees."

42. Baij Nath Puri M. A.—India as described by Early Greek writers p, 36 "Pliny referred to paper being made from papyrus plant. (XIII - 21). He said that for writing, the leaves of palm trees were used first, and then the barks (libri) of certain trees (XIII - 21)

గములో భూర్జపత్రములపై వ్రాయునాచారముకలదు. కాశ్మీరములో
నీ చెట్లనేకములుండుటయే దీనికిఁ గారణము. ఈ పత్రములపై లేఖిని
కూడ వ్రాయవచ్చును. తాటియాకులు, తామరాకులపైన కూడ
వ్రాసిరి.

125 వ సంఖ్యగల జాతకకథ కొయ్య వ్రాఁతబల్లను బేర్కొ
నది. (ఫలకము). కొయ్య కలము పేరుకూడ (వర్ణకము) కాన్పించు
చున్నది. బోధిసత్త్వుఁడు, తన గ్రామములో విశ్వామిత్రుఁడను
గురువు చెంత కేగినప్పుడు, ఉరగసర చందనపు కొయ్యపలకను, రత్న
మయ భూషితంబగు కలము, శ్రేష్ఠమైన సిరాలతో, నేగెనని, లలిత
విస్తారమను బౌద్ధగ్రంథము తెల్పుచున్నది. వినయపిటకము (111-76)
లో 'లేఖమ్ ఛిందతి' యని వ్రాఁత ప్రశంసగలదు. దీనిని జాతి
బుహ్లరు (Buhler) కొయ్యమీఁద వ్రాఁతయని, రైసు డేవిడ్సు (Rhys
Davids) ఆకుమీఁదనని భిన్నాభిప్రాయములు సూచించిరి. కొన్నా
ళ్ళకు, కొయ్యలమీఁద, శిలలపైన లోహములపై వ్రాయసాగిరి.

స్ట్రాబో (Strabo A. D. 1 Century, వ్రాఁతలనుబట్టి చూడఁగా,
క్రీ. పూ, 1వ శతాబ్దప్రాంతమున, 'సీజరు సమకాలీనుఁడగు 'పోరసు,
అను భూపతి, 'సీజరు అగస్టసు'న కొక ఉత్తరము వ్రాసెను. ఆలేఖ
గ్రీకుభాషలో మేకచర్మముపై వ్రాయఁ బడినదని, స్నేహ
పూర్వకముగాఁ దనరాజ్యమునకు రావలసినదని, యాహ్వానించుచు
నిది వ్రాయఁబడినదని తెలిసికొననగును 42 చర్మములపై వ్రాయు
పద్ధతిని ప్రాచీన భారతీయులెఱుంగరు. యజ్ఞ కర్మముల కపవిత్రత
కల్గునని, భారతీయులు మృగచర్మములు వాడియుండరు.
వేదకాలమునాఁటికే ఆర్యులకు 'ఆవుతోళ్ళఉపయోగము' తెలిసి
యుండెను. ఆవుతోళ్ళ ననేక కార్యముల కుపయోగించుచుండిరికాని,
లేఖనమున కుపయోగించినట్లు గాన్పింపదు. ఆర్యులు నీళ్ళు
నిల్వాయుంచుటకు, మద్యము, తేనె, నూనె, వెన్న, సోమరసము,
మున్నగు వానిని బోయుటకుఁగూడ నావుతోళ్ళ నుపయోగించు

43. Strabo (XV - 1—13)

చుండిరని, పెక్కుపనిముట్లను వీనితోఁ దయారు చేయుచుండిరని తెలియుచున్నది.44

కాగితముయొక్క ఉపయోగము తెలిసిన తర్వాతకూడ కొండరాతి పట్టలమీఁద, తాటి ఆకుల మీఁద, కొయ్య పలకల మీఁద, లోహపు రేకుల మీఁద, తాల మీఁద వ్రాయు నాచారము భారతవర్షమునఁ జాలకాలమునకుఁగాని పోలేదు 45 కొన్ని నాటక భాగములుకూడ శిలలపై వ్రాయఁబడినవి. భారత వర్షమున వ్రాఁతకళ, యతి శీఘ్ర కాలములో శరవేగమున వ్యాప్తమైనది. నియార్కసు కాలమున గుడ్డలపై వ్రాయు పద్ధతిపోయి, క్రమముగా, రాగిరేకులు, తాటిఆకులు, భూర్జత్వక్కులు, పత్రములు, పాపిరసు కాగితములను, భారతీయులు వాడసాగిరి.

బౌద్ధులే ప్రప్రథమముగా భారతభూమిలో వ్రాఁతసామగ్రిని గనుఁగొని, గ్రంథములను వ్రాయసాగినట్లు గాన్పించుచున్నది. వ్రాఁత బ్రాహ్మణుల యొక్క పరిపూర్ణములగు హక్కులకుఁ బ్రమాదకర మైనదిగాఁ గాన్పించుటచేత, వారు దానిని తీవ్రముగా ప్రతిఘటింప సాగిరి. అయినను వీనిని సరకు చేయక బౌద్ధులు గ్రంథములు వ్రాయ సాగిరి. భారతభూమిలో త్వక్కులమీఁద, తాటియాకుల మీఁద, వ్రాయఁబడిన యత్యంత పురాతనమైన వ్రాఁతప్రతులు బౌద్ధులవే

44. A, C. Das, M. A., B, L.—Rigvedic India - p. 75,

"The cowhides were tanned and made into many articles of everyday use. There was no prejudice as is at the present day, against using receptacles made of cow-hides or storing water, wine, honey, oil, clarified butter and even articles of worship like the soma juice."

45. Paul Massan Oursel — Ancient India and Indian civilization p. 221. "writing was very late .... For a long time writing was done on birch bark and even after paper was known, palm leaves and wooden tablets were used. We have none earlier than 12th century. Most documents are written on paper, which the Mussalmans introduced into India, in the 13th century. Metal plates were used, in the 12th century and later, to carve whole dramas on rocks."

మైయున్నవి. శిలలపై, లోహపు రేకులపై ప్రథమముగా వ్రాయఁబడిన శాసనములుకూడ బౌద్ధులవే. బౌద్ధవేదములగు పిటకములను లిఖిత రూపములోనికిఁ దెచ్చినది బౌద్ధులే. వ్రాఁతప్రశంస చేసినది యన్నిటి కంటె సంస్కృత వాఙ్మయములో మొదటి గ్రంథము వశిష్ఠ ధర్మ సూత్రములుగాఁ గాన్పించుచున్నది.[46]

శ్రుత్యాదులు గ్రంథస్థ రూపమగుటకు ప్రాచీన బ్రాహ్మణులిష్ట పడరైరి. బౌద్ధులే తమ మతగ్రంథములను క్రీ, పూ. 88వ సంవత్సరమున, సింహళ ద్వీపములో 'వటగామాని, యను రాజు కాలమున లిఖిత రూపములోనికిఁ దీసికొనివచ్చిరి.[47] గ్రంథాదులు వ్రాయవలసి వచ్చుటచేత, బౌద్ధులు లిఖిత సామగ్రిని వెదక సాగిరి. బౌద్ధమతోదయమైన తర్వాతనే లిపి, విరివిగా వాడుకలోనికి వచ్చినది. వ్రాఁత సామగ్రి కన్వేషణము బౌద్ధులే చేయసాగిరి. అనేక స్థూపములలో దొరకిన బౌద్ధ గ్రంథములే దీనికి సాక్షి. కొండరావిచెట్టు పట్టల మీఁద వ్రాఁయబడిన వ్రాఁతప్రతులితర స్మరణ చిహ్నములతోఁ బాటు, కాబూలులోయలోని స్థూపములోఁగాన్పించెను. ఖరోష్టి లిపిలో వ్రాయఁబడిన 'ధర్మపదము' అను వ్రాఁతప్రతి యిచ్చోటనే లభించెను.

---

46- Rhys Davids—Buddhist India— p. 46 "Writing was strongly opposed to a method so dangerous to their exclusive previlages. And we ought not to be surprised to find that the oldest manuscript on bark or palm leaf known in India are Buddhist, that the earliest written records on stone and metal are Buddhist, that it is the Buddhists who first made use of writing to record their canonical books; and that the earliest mention of writing at all in the voluminous priestly literature, is in the Vasishta Dharma Sutras, one of the later law books, and long posterior to the numerous references quoted above from the Buddhist canon."

47. Prof. Vinaya Kumar Sarkar M. A. — Secular and social strata in Buddhist thought p. 17 "In the present form the three baskets are taken to have been finally closed in the last quarter of the first century B. C., when they were committed to writing in Ceylon during the reign of Vattagamani."

కొండరావిపట్టలు, ఆకులమీఁద గంటములతో వ్రాయుచుండిరి. కాని పట్టలు, ఆకులు, పెళుచుగానుండి శీఘ్రముగా నశించిపోవుచుండెను. అందుచేత చెట్లయొక్క పెద్ద పట్టలు, పొడవైన తాటిఆకులు క్రమముగా వాడసాగిరి. బౌద్ధ చక్రవర్తి 'అశోకుఁడు' సర్వజనోపయోగార్థమై, శిలలపైన ఆకాలపు వాడుకభాషలో ననేక ధర్మములు వ్రాయించెను. శిలాలేఖనము కూడ వాడుకలోనికి వచ్చినది.

ఆంగ్లేయభాషలో 'బుక్' (Book) అనుమాట ఆంగ్లోసాక్సనుపదమగు 'బాక్' (Boc) నుండికల్గినది. దీనికి మూలము చెట్లత్వక్కు (Bark of trees) గాఁ గాన్పించుచున్నది. బైబిలు (Bible) నందుకూడ వ్రాఁతసాధనములపేర్లు కాన్పించుచున్నవి. క్రొత్త నిబంధన ; వ్రాయునాఁటికి కలము, పాపిరసు మున్నగువానిని ఆసియా ఖండవాసులెఱింగి యుండిరి. 48

భూర్జ పత్రములమీఁద వ్రాయుపద్ధతి భారతవర్షమున ప్రక్కదేశములలోఁగూడ హెచ్చుగాఁగలదు. మధ్యాసియాలోని 'ఖోటాను' (Khotan)కు 13మైళ్ళ దూరములోనున్న, 'గోసింగవిహారము' యొక్క భగ్నావశేషములలో, భూర్జ పత్రములపై 'ఖరోష్ఠీలిపి' లో వ్రాయఁబడిన పాళీభాషలోని బౌద్ధగ్రంథము లభించినది. అది క్రీస్తుశకారంభ కాలమునాఁటిది. రెండవది వైద్యగ్రంథము. 'కుచార' సమీపమున 'మింగాయిలో' 'కెప్టెన్ బవర్' (Captain Bower) కు లభించినది. ఇది సంస్కృత భాషలో నున్నది. క్రీ. శ. 4వ శతాబ్దినాఁటి లిపితో

---

48. Bible John XIX 23—4 "Oh that my words were now written, oh that they were printed in a book, that they were printed in a book, that they were groven with an iron pen and lead in the rock for ever."

Jeremiah XVII-1 "The sin of Judah is written with a pen of iron and with the point of a diamond."

Frederick Harrison - A book about books p. 5 "The bible contains references to writing on papyrus. Indeed the earliest biblical manuscripts that have survived, are on papyrus- St. John verse 13 "I had many things to write, but I will not with ink and pen write unto thee."

వ్రాయఁబడినదని, అంగీకరింపఁబడుచున్నది.48 మొదటి నాటక
అశ్వఘోషుని (క్రీ. శ. 100) నాటకము 'సారిపుత్ర ప్రకరణ
9 అంకముల వ్రాతప్రతిలోని కొన్ని భాగములు మధ్యాసియా
'తుర్ఫన్' (Turfan) లో లభించినవి.

చైనీయ టర్కీస్థానములో రెండు బౌద్ధనాటక ఖండముల వ్రా
ప్రతుల దేకాలమునాఁటి వచట లభించినవి. తాటి ఆకులమీ
గంటముతో వ్రాసెడి ఆచారము క్రీస్తుశకారంభమునుండి కాన్పిం
చున్నది. కొండరావి పట్టలమీఁద వ్రాయఁబడిన మొదటి సంస్కృ
వ్రాతప్రతి, క్రీ.శ. 5వ శతాబ్దమునుండి కాన్పించుచున్నది.50 క్రీ.
11వ శతాబ్దములో 'గజనీమహమ్మదు'తో వచ్చిన 'అల్బరూని' (క్రీ
1030 లేఖలు వ్రాయుటకు, మధ్యకాలీన భారతవర్షములో కొండరా
పట్టలు వాడెడి వారని వ్రాసెను.51 క్రీ. శ. 7వ శతాబ్దములో వచ్చి
చైనీయ లేఖకుఁడు 'హ్యూయాన్‌సాంగు (క్రీ. శ. 629-645) భా
వర్షమున తాటియాకులు సర్వసామాన్యముగా వాడఁబడుచుండె
వ్రాసెను. క్రీ. శ. 6వ శతాబ్దములోని మా-ట్వాన్-లిన్ (Ma-twa
linA. D.-550-600) అను లేఖకుఁడు, వారికి వ్రాఁత, వాఙ్మయ
గలవని, అందరు పురుషులు ఉపదేశగ్రంథములు, సిద్ధాంతము
చదువుచురని, తాటియాకులపైన వ్రాయుచురని వ్రాసెను
మహమ్మదీయ రాజులు భారతవర్షమునఁ గాగితము ప్రవేశపెట్టిన

49. Ganga Prasad Mehtha—Chandragupta Vikramaditya p. 9 (Hindi).

50. A. A. Macdonall— History of Sanskrit literature p. 1 "Materials — Birch bark and palm leaves— Oldest know Sanskrit manuscript written on birch bark dates from 5th centu A. D."

51. Alberuni's India—"Leaves of birch bark were also regular used for letter writing in early mediaeval India."

52. K. A. Nilakantha sastry — Foreign notices of South Ind p. 95 "They have a written character and a literature......All th men study the instruction books denominated Siddhantas writte on the leaves of the Peitos intended to preserve a record of thing (on palm leaves).

తాటి ఆకులపై వ్రాయు నాచారము పోలేదని, 13వ శతాబ్దినాటి లేఖకుఁడు 'జాన్ ఆఫ్ మాంటికార్వినో' (John of Montecorvino 1292-3) వ్రాఁతలు తెల్పుచున్నవి. వారికి వర్ణమాల గలదని, జమా ఖర్చు లెక్కలు, వారి విగ్రహారాధనకు మంత్రములు, మున్నగునవి తాటియాకులపైన వ్రాయుదురని, వారికి గాగితములు లేవని, ఈ లేఖకుఁడు వ్రాసెను. 53 విశేషముగా కాగితముల వ్యాప్తి ఆకాలమున కాలేదేమోనని తోఁచుచున్నది.

15వ శతాబ్దమున 'హంపి' విజయనగరమునకు వచ్చిన 'అబ్దుల్ రజాక్' (1442-3) భారతీయుల వ్రాఁత సామగ్రిని గూర్చి పేర్కొనెను. భారతీయులకు రెండు విధములగు వ్రాఁతపద్ధతులు కలవని, మొదటి పద్ధతి రెండు గజముల పొడవు, రెండు వ్రేళ్ల వెడల్పుగల తాటియాకులపై, ఇనుపగంటములతో గీయుచుండురని, రెండవ పద్ధతిలోఁ దెల్లని ఉపరితలముగల భాగమును, నలుపు చేయుదురని, దానిపైన మెత్తని రాతిని కలము ఆకారముగాఁ జేసి వ్రాయుదురని, ఈ యక్షరములు చాలకాలముండునని, ఈ వ్రాఁతపద్ధతి అత్యంత శ్లాఘనీయమని, అబ్దుల్ రజాక్ వ్రాసెను, 'బార్బోసా' యను లేఖకుఁడుకూడ, 'కాళికట్టు' కేగినపుడు తానుకూడ నిదేమాదిరి పద్ధతిని దిలకించితినని వ్రాసెను. 54

---

53. Ibid p, 188—John of Montecorvino (1292 - 3). "They have indeed an alphabet which they use to keep their accounts and to write prayers or charms for their iodols. They have no paper but write upon leaves of trees like unto palm leaves,"

54. T. V. Mahalingam-Administration and social life under Vijaya-nagara empire—p 354 "Abdul Rajaak (1442—3). 'These people name two kinds of writings one upon the leaf of the Tadi palm which is two yards long, and two digits broad, on which they scratch with an iron style. These characters possess no colour and endure but for a little while. In the second kind they blacken a white surface on which they write with a soft stone cut with the shape of a pen, so that the characters are white on a black surface and are durable. This kind of writing is highly esteemed.

Elliot—History of India Vol IV—P 107, 108. 'Barbosa' described the same practice which he saw at the time of his visit to Calicut."

క్రీ. శ. 14 వ శతాబ్దములో నుత్తర భారతవర్షమున కేతెంచిన 'ఇబ్నాబటూటా' (1333-45 క్రీ.శ.) అను ముస్లిముయాత్రికుఁడుకూడ, తాటియాకులపై భారతీయులు, కత్తినిబోలియున్న, వ్రటువగు నినుప పనిముట్టుతో వ్రాయుదురని, కొన్ని ముఖ్యమైన ప్రతులను గాగితము మీఁద మాత్రమే వ్రాయుదురని వ్రాసెను.[55]

క్రీ. శ. ఒకటవ శతాబ్దమునుండి పందొమ్మిదవ శతాబ్దమువఱకు భారతభూమిలోఁ దాటియాకులపై వ్రాయునాచారము హెచ్చుగాఁ గాన్పించుచున్నది. మహమ్మదీయులు కాగితము ప్రవేశము పెట్టినను, 17వ శతాబ్దమువఱకు భూర్జత్వక్కులపై వ్రాయునాచారము భారత భూమిలో నమసిపోలేదు. క్రీస్తుశకమునకుఁ బూర్వము భారతవర్ష ములో వ్రాఁతప్రతులు కాన్పింపకున్నవి.[56]

మధ్యాసియాలో క్రీ. శ. 5 వ శతాబ్దినాఁటివి, జపానులో 6 వ శతాబ్దినాఁటివి, నేపాలులో 10 వ శతాబ్దినాఁటివి వ్రాఁతప్రతులు లభించినవి. సంస్కృత వ్రాఁతప్రతి (కుటిలలిపిలోనిది) తాటియాకుది 10 లేక 11 వ శతాబ్దమునాఁటిది, వజ్రదకతంత్రము, సద్ధర్మపుండ రీకము అను వ్రాఁతప్రతులు జపానుకుఁ జేరినవి. క్రీ శ. 11 వ శతా బ్దికిఁబూర్వపు వ్రాఁతప్రతులు భారతభూమిలోఁ గాన్పింపవు. బౌద్ధ కాలారంభమున కొయ్యపలకలమీఁద వ్రాయునాచారము గలదు. శిలలమీఁద, లోహపురేకులమీఁద, తాటియాకులమీఁద, భూర్జత్వ క్కులమీఁద వ్రాయునాచారము తరువాతది. క్రీ. శ. 4 వ శతాబ్ద ప్రాంతమునాటివి, 'ఖోటానుకు, సమీపముగా 'తక్లమకన్' ఎడారి భూములలో నిసుకనుండి, 1900 సంవత్సరములో 'స్టెయిన్' (Stein) అను భూగర్భశాస్త్రవేత్త, సంస్కృతములో వ్రాయఁబడిన 500 కొయ్య

---

55 Ibna Batuta "They write there on palm leaves with a curved iron tool resembling a knife. They write on paper only copies of the kuran of scientific treatises."

56 A.A. Macdonall—India's pa st p 53 " Hence it is probable that written books really did not exist in the centuries before our era."

పలకలను బయటకు లాగియుండెను. 57 దీనినిబట్టి వ్రాతసామగ్రికిఁ గొయ్యనుగూడ నుపయోగించినట్లు కాన్పించుచున్నది. కొయ్య, తాటియాకులే కాకుండ, దూదిగుడ్డ, చర్మము, లోహము, శిలలు మున్నగునవి ఉపయోగింపఁబడుచుండెను. 58

రాగిరేకులపై వ్రాయునాచారము కూడ నతిపురాతనమైనదే. 'హుయాన్‌సాంగు' వ్రాఁతలనుబట్టి చూడఁగా, క్రీ. శ. 125 మొదలు 153 వరకు రాజ్యమేలిన 'కనిష్కమహారాజు' కాలమున, బౌద్ధుల పవిత్ర గ్రంథములు, రాగిరేకులపైన వ్రాయఁబడినట్లు తెలియుచున్నది. 59 అనేక తామ్రశాసనములు కూడ లభించినవి.

శిలా లేఖనము 'అశోకుని కాలము' నుండి భారతదేశమున విరివిగా వ్యాప్తినొందినది. ఈపద్ధతిని భారతీయులు, పారసీకులనుండి నేర్చుకొనిరి. పరిశుద్ధమైన సంస్కృత భాషలో వ్రాయఁబడిన అతిపురాతనమైన శిలాశాసనము, 'కథియవాడు'లోని 'గిర్నారు '(Girnar) లోఁ గాన్పించిన 'రుద్రదమునుని' శాసనముగాఁ దోఁచుచున్నది. ఇది క్రీ. శ. 150 నాఁటిది. ఇది ఉత్కృష్ఠ రచనగల శిలా లేఖనము. ఈశాసనమును బట్టి, ఈయన తర్క, వ్యాకరణ, సంగీతాది శాస్త్రములలోఁ బ్రసిద్ధుఁడని, ఆలంకారిక గద్య, పద్య రచనాదులందు సమర్థుఁడని తెలియుచున్నది.

శిలాశాసనములన్నిటిలో భారతభూమిలో దొరకినవానిలోఁ బ్రధానమైనది, ప్రథమముగా లిఖింపఁబడినది, 'పిప్రవా'లో దొరకిన బౌద్ధ

57 M. Winternitz—History of Indian literature Vol I—P 35 "M. A. Stein in 1900, dug out of the sand in the desert of Taklamakan near khotan 500 small tablets of wood covered with writing which reach back to the 4th century and are perhaps older still.

58 Ibid p 39 "Wood as a writing material, was found in Buddhist writings. Palm leaves to the first century A. D. cotton stuff, leather, metal and stones are used as writing materials. Gold plates, silver plates and copper plates were also used."

59 Hiuen Tsiang—"King Kanishka had the sacred writings of the Buddhists engraved on copper plates."

స్తూపములోని, రాతిపాత్రపైన వ్రాయఁబడినదిగాఁగాన్పించుచున్నది.
సాంచిలోని యొకస్తూపములో రెండు రాతిబరణుల (Soapstone
caskets) మీఁద సిరాతో, "సారిపుత్ర, మొగ్గల్లన' యను బుద్ధ
యిరువురి శిష్యుల యెముకలుకలవని వ్రాయఁబడినది. బుద్ధుని ప్రథ
ధర్మబోధ సారనాథులో రాతిపైనున్నది. ధారానగరములోని యొ
రాతిపై, ఒక నాటకముయొక్క రెండంకములు వ్రాయఁబడినవి. కొ
రాలపై పద్యములుకూడఁ గలవు. శిలలపై నాటకములు వ్రాయఁబ
నిదర్శనములు కలవు. శాసన లేఖనమునకు రాలు శాశ్వతమైన
వానిపైన జెక్కసాగిరి. కొన్నిచోట్ల సిరాతో రేగడిమన్నుమీఁ
నిటుక రాలపైన వ్రాయఁబడినవి. మధ్య హిందూస్థానములోని కొ
శాసనములు, సిరాతో మట్టిపలకలమీఁద క్రీ. పూ. 2 లేక 3
శతాబ్ద ప్రాంతమునుండి వ్రాయఁబడినవి. రంగులు వేసిన శాసనము
అజంతాగుహలలోఁ గాన్పించినవి. ఇటుకరాలపైన శాసనములెన్న
నీదేశమున వ్రాయఁబడియుండ లేదు. కాని గుప్తరాజుల కాలమ
కొన్ని యిటుక పలకలు లభించినవి. బుద్ధుఁడు, శ్రావస్తిలో బోధిం
బోధ, యొకానొక యిటుకరాతిపైన గలదు. అనేక గుహలు, గో
మీఁద ననేకవిధములగు వ్రాఁతలు కాన్పించుచున్నవి. కొన్ని వ్రాఁత
రాతిపలకలమీఁద, బొమ్మలమీఁద, ఎముకలపాత్రలపైనఁ గాన్పిం
చున్నవి. శిలా లేఖనము క్రీ.పూ. 450 నాఁటికి భారతీయులెఱింగిన
తేలుచున్నది.

ఇల్లే ఇత్తడి, కంచు, రాగిరేకులపైన వ్రాయఁబడిన వ్రాఁతలు
శాసనములు బహుకాలమునుండి భారతవర్షమునఁగాన్పించుచున్న

60 A. A. Macdonall—India's past p 253 "Of the relic receptacles from the interior of Buddhist stupas, the soap-stone vase from Piprahwa bears the oldest known Indian inscription, which locates Kapilavastu, as the home of Buddha."

Ibid p 53 "Besides these, wood, leather, metal and stone were sometimes, though rarely, employed as writing material in early times. Copper plates were occassionally used for this purpose perhaps from about 100 A. D. Sanskrit dramas have been engraved even on rocks."

భారతీయు లేయే సామగ్రి నుపయోగించినది, లేఖనమెట్లుచేసినది తెలిసికొంటిమి. లేఖనమునకెక్కువగా చర్మములు వాడినట్లు నిదర్శనములు లేవు. క్రీ. శ. 1030లో మన దేశమునచ్చిన 'అల్బరూని' కూడ గ్రీకులవలె భారతీయులు చర్మములు వాడియుండ లేదని వ్రాసెను. 'సోక్రటీసు' అను యవన తత్త్వవేత్తకూడ, పుస్తకములనేల వ్రాయ లేదని యడుగఁగా, "నేను జ్ఞానమును జీవించియున్న మనుష్యుల హృదయకోశములనుండి, చనిపోయిన గొఱ్ఱె చర్మములమీఁదకు బదిలీ చేయఁజాలను" అని ఆయన చెప్పెను. ఇస్లాము మతస్థాపన జరిగిన యారంభకాలములో, మునల్మానులుకూడ చర్మములపైననే వ్రాసిరి. కురాను ప్రతులు 'హరిణముల' చర్మములపైననే వ్రాయఁబడెను. కురానులోఁ బాపిరసుమీఁద ఈజిప్టులో వ్రాసిన విధంబునుగూడ పేర్కొఁనబడెను. ఇంకను 'అల్బరూని' వ్రాఁతఁబట్టి, భరతవర్షములో దక్షిణభాగమున, ఈత, కొబ్బరివంటి సన్నని చెట్టుగలదని, దానికి భక్ష్యములగు పండ్లుగలవని, గజముపొడవుగల ఆకులుగలవని, అరచేయి యంత వెడల్పుగలవని, హిందువులు వీనిని 'తాళపత్రము'లందురని, వానిపైన వ్రాయుదురని, ఈ యాకు లన్ని కలిపి ఒక త్రాడు తోకుట్టి, పుస్తకముగాఁ జేయుదురని, ప్రతి యాకు మధ్యగాపోవు రంధ్రముగుండ త్రాడుపోవునని. ఉత్తర, మధ్య హిందూస్థానములలో మనుష్యులు భూర్జవృక్షము యొక్క త్వక్కునుపయోగించెదరని, ఒక గజము పొడవైనది, నేతివ్రేళ్ళన్ని కలిపినంత వెడల్పైనది, తీసికొని పలువిధంబుల తయారుచేయుదురని, దానికి నూనెరుద్ది, గట్టిగాను నున్నగానుండుటకు, మెఱుగు పెట్టుదురని, దానిపైన వ్రాయుదురని, ప్రతి పత్రమునకు సంఖ్యవేయుదురని. మొత్తము పుస్తకమంతయు నొక గుడ్డలోఁ గట్టియుంచెదరని, ఒకే ఆకృతిగల రెండు పలకలమధ్య కట్టఁబడుచుండెనని, దీనినే పుస్తకమనుచుండిరని. వారి లేఖలు కాక యింకనేమి వ్రాయవలసియున్నను, వారు భూర్జ త్వక్కులమీఁదనే వ్రాయుదురని, తెలియుచున్నది.[61]

---

61 Dr. Edward C. Sachau—Alberuni's India p 170 " The Hindus are not in the habit of writing on hides like the Greeks in ancient

పైవిషయములంబట్టి, 'అల్బరూని' కాలమున ఉత్తరమధ్య హిందూ స్థానములలో భూర్జ త్వక్కులపైన దక్షిణ హిందూస్థానములో తాళ పత్రములపైన భారతీయులు క్రీ. శ. 11వ శతాబ్దములో వ్రాయు చుండిరని, వ్రాఁతకు మృగ చర్మముల నెన్నడు వాడియుండ లేదని తెలియ వచ్చుచున్నది.

---

times. Socratese, on e ing asked why he did not compose books, gave this reply: 'I donot transfer knowledge from the living hearts of men to the dead hides of sheep. Muslims-too, used in the early times of Islam to write on hides, eg. the treaty between the prophet and the Jews of Khaibar and his letter to Kisra. The copies of the Koran were written on the hides of gazellas as are still now-a-days the copies of the Thora. There occurs this passage in the koran. (Sura VI—91) "They make it karatis, Ie—The kirtas (or charta) is made in Egypt, being cut out of the papyrus stalk. Written on this material, the orders of the khalifs went out into all the world until shortly before our time. Papyrus has this advantage over vellum that you can neither rub out nor change anything on it, because thereby it would be destroyed.

Ibid P 171 "The Hindus have in the south of their country a slender tree like the date and cocoanut palms, bearing edible fruits and leaves of the length of one yard, and as broad as these fingers one put beside the other. They call these leaves tari (Tala or tar --= Borassus flabelliformis) and write on them. They bend a book of these leaves together by a cord on which they are arranged, the cord going throgh all the leaves by a hole in the middle of each.

In central and northern India, people use the bark of the tuz tree, one kind of which is used as a cover for books. It is called Bhurja. They take a piece of one yard long and as broad as the outstretched fingers of the hand or somewhat less and prepare it in various Ways. They oil and polish it so as to make it hard and smooth and then they write on it. The proper order of the single leaves is marked by numbers, The whole book is wrapped up in a piece of cloth and fastened between two tablets of the same size. Such a book is called the Puthi (cf-Pusta-Pustaka) Their letters and whatever else they have to write, they write on the bark of the tuz tree."

కాగితము:—ముహమ్మదీయరాజులు భారతవర్షము నేలునపుడు, మన దేశములోఁ గాగితమును ప్రవేశపెట్టిరి. కాగితమును ప్రపంచములో మొట్టమొదట కనిపెట్టినవారు చైనీయులుగాఁ గాన్పించుచున్నారు. ముహమ్మదీయులతో యుద్ధముచేసి చైనీయు లోడినపుడు, అనేకమంది చైనీయులు ఖైదీలుగాఁ జిక్కిరి. వారు 'సామర్కంను' లోఁ గాగితమును జేయుపద్ధతిని ముస్లిములకు నేర్పియుండిరి. ఈ విధముగా నది చైనీయులమూలమున దేశదేశములలోఁ బ్రాకిపోయెను62.

క్రీ. శ. 2వ శతాబ్దారంభమున చైనీయులు కాగితములను, జనుపనార, అవిసెనార, గుడ్డపీలికలు మున్నగునవి నలుగఁగొట్టి కలిపి, తయారుచేయుచుండిరి. రోము సామ్రాజ్య పతనకాలమున, కాగిత పరిశ్రమ మిగుల నుచ్చస్థితిలో నుండెను. క్రీ. శ. 5వ శతాబ్ది ప్రాంతమునాఁటికి, 'బాగ్దాదు (Baghdad) కు కూడ నిది ప్రాకిపోయెను. క్రీ.శ. 12వ శతాబ్ద మధ్యకాలమునాఁటికి, స్పెయిన్ద్వారా, కాగితముయొక్క యుపయోగము యూరోపుఖండమునకుఁ బ్రాకిపోయెను. అప్పటి కైరోపాఖండములోఁ జర్మమును విశేషముగా నుపయోగించి, వ్రాఁతలు వ్రాయుచుండిరి. ఇటలీ దేశమునకు క్రీ. శ. 13వ శతాబ్దమునకు జర్మనీకి 1390 నాఁటికి, కాగితముయొక్క ఉపయోగము తెలిసియుండెను63.

ముహమ్మదీయరాజ్యకాలములోనే, అనఁగా క్రీ. శ. 1000 సంవత్సర ప్రాంతమున భారతవర్షములోఁ గాగితముమీఁద వ్రాఁతప్రతులు

62 Dr. E, Sachau—Alberuni's India p. 171 " It was in China that paper was first manufactured. Chinese prisoners introduced the fabrication of paper into Samarkand, and thereupon it was made in various places, so as to meet the existing want."

63 Frederick Harrison— A book about books p. 78. "It seems incredible that paper was first used by the Chinese as long ago as the beginning of the 2nd century A. D. They made it from hemp, flax and rags. When the Roman empire was tottering to its fall, the use of paper was in full vigour ......... After three centuries, Baghdad heard of paper.

Ibid p. p. 79 ',When the use of paper first reached Europe by way of Spain, in the middle of the 12th century, parchment was well established ......'Italy 13th century and Germany 1390.

వ్రాయునాచారము బహులు దేరినది. తెలిసినంతవరకుభారతభూమిలో ... గాన్పించిన మొదటి వ్రాతప్రతి, క్రీ.శ. 1200 నాఁటిదని 'మెక్డ లు'ను, 1223-24 నాఁటిదని 'వింటర్‌నిట్జ్' పండితుఁడును వ్రాసి న్నారు. ఎట్లయినను, మహమ్మదీయుల దండయాత్ర తర్వాత సంస్కృతగ్రంథములు కాగితముపై వ్రాయుట ఆరంభమైనదని చె వచ్చును[64].

18వ శతాబ్దములో భారతభూమికి వచ్చిన 'షోబరల్' అను ... కుఁడు దక్షిణ హిందూస్థానములోని ప్రైమరీ పాఠశాలలను గూ వ్రాయుచు, 'విద్యార్థులు బల్లమీఁదగాని, నేలమీఁదగాని, అడ్డము కాళ్లుమడిచి కూర్చుందురని, వారు కాగితముమీఁద రెల్లుకలము గాని, మఱియొకవిధమగు గొట్టములనుగాని, ఉపయోగించి వ్రా చుందురని, అధికముగా చైనానుండియే కాగితము వచ్చుచుండె ... అది యూరోపునుండివచ్చెడి కాగితమంత శ్రేష్ఠమైనది కాదని, ... నున్నగా చాల పల్చగా, సులువుగాచినిఁగిపోవునదిగా నుండె ... వ్రాసెను[65].

17వ శతాబ్దములో, ఔరంగజేబుకాలమున 'సియాల్కట్'విద్యా కేంద్రముగా నుండెను. ఇది 'అక్బరు'కాలమునుండి ప్రసిద్ధిఁ జెందిన ఇచట కాగితములు విశేషముగా వాడఁబడుచుండెను. ఈనగర ... సరకునకు ప్రసిద్ధి. ముఖ్యముగా 'మానసింఘు' (Mansinghi) సిల్కు కాగితము, పరిశుభ్రముగాను, చౌకగాను, చక్కగా తయారు చేయ...

64 A. A. Macdonall - India's past p. 53 "Although paper which is much more convenient, was introduced with the Muhammadan conquest from about, 1000 A. D manuscripts continued to be written on birch-bark till about 200 years ago.... The oldest known paper manuscript found in India dates from soon after 1200 A. D."

65 N. N. Law—Promotion of learning in India p. 96 Shoeber "The pupils sit cross-legged on a bench or on the floor. They write on paper with reed pens, or with tubes of some other kind. The paper mostly imported from China is not so good as that of Europe. It is smooth, very thin and easily tears."

బడుచుండెను. ఆనగరముయొక్క మూడుపల్లెలలో నివితయారుకాఁబడి, దేశములో నితరభాగముల కెగుమతి చేయఁబడి, ఢిల్లీరాజుల ఆస్థానములో విశేషముగా వాడఁబడుచుండెను. 'సియాల్ కోట్' కాగిత పరిశ్రమకుఁ, గాశ్మీరదేశము సిరాకు ప్రసిద్ధి కాంచియుండెను.66 రెల్లు కలములనే కాక బాతుకలములనుగూడ మన దేశీయులు ప్రాచీనకాలమున వాడియుండిరి.

# తృతీయాధ్యాయము

(గ్రంథములు - లిఖితరూపము - మొదట గ్రంథములు వ్రాయకుండుటకు కారణములు - గ్రంథములు లిఖించుటకు కారణములు - వేదములు, త్రిపిటకములు, జైన గ్రంథములు లిఖించిన కాలము - వ్రాత ప్రతు లితరదేశములకుఁ బోవుట - చైనీయ పరివ్రాజకుల రాక - అమూల్య గ్రంథరాజములు గైకొనిపోవుట.)

భారతవర్షమున వర్ణమాల లేకుండుటచేత కొన్నాళ్ళు, వ్రాత సాధనములు లేక కొన్నిదినములు, హెచ్చుగా గ్రంథములు వ్రాయ నవసరము లేకుండుట, ఇత్యాది కారణములచేత గ్రంథములు లిఖితములు గాకుండెను. ద్రావిడవర్తకులు లిపి తెచ్చినతర్వాత క్రీ. పూ. 5వ శతాబ్దప్రాంతమున భారతీయులు, రాజకీయప్రకటనలకు, లేఖలు వ్రాయుటకు, వర్తకవ్యవహారములకు, జమాఖర్చులెక్కలకు వ్రాత నుపయోగించుచున్నట్లు బౌద్ధగ్రంథాదులనుబట్టి యెఱుంగవచ్చును. గ్రంథములు వ్రాయకుండుటకు రెండు ముఖ్యకారణములు కలవని చరిత్రకారు లూహించుచున్నారు. (1) దేనినైన వల్లించి, జ్ఞాపకశక్తి వృద్ధిచేసికొని, పారంపర్యముగ దానిని నిల్పుకొను ఆచారము భారతీయులకు లేఖనశక్తి రాకపూర్వమే ఈదేశమం దుండెను. గ్రంథములు వ్రాయ సమర్థతగల బ్రాహ్మణ విద్వాంసులు, గ్రంథములు ముఖస్థము చేయుటయే చాలునని, అది యుత్తమపద్ధతియని యింకొక పద్ధతి యవసరములేదని తలంపసాగిరి. (2) విశేషముగా వ్రాత

66 Ibid - p. 190 "As Siyalkot was famous for paper manufacture, so was Kasmere for its ink."

సామగ్రి లేకుండుట[67]. ఈ రెండు ముఖ్యకారణములచేత భారతవర్షమున బహుకాలమువరకు గ్రంథములు వ్రాసినట్లు గాన్పింపదు. క్రీస్తుపూర్వము 88 కి పూర్వము భారతవర్షమున గ్రంథములు వ్రాసినట్లు కాన్పింపదు. ఉన్నను కొద్దియే.

ప్రాచీనవాఙ్మయములో వ్రాఁతప్రతు లున్నచో వానిని జూచి వ్రాయు పరిశ్రమ కాన్పించెడిదే. వినయపిటకము (1-267)లో 'పాతిమోక్షసూత్రములు' 227 వర్ణింపఁబడియున్నవి. ప్రతి బౌద్ధవిహారములోను వీనిని ముఖస్థము చేయుచుండిరి, పవిత్రగ్రంథసూత్రముల నప్పగించుట కిది ఉత్తమపద్ధతిగా ప్రాచీనభారతీయులు భావించుచుండిరి. లిపి వ్యాప్తియైన తర్వాతకూడ దీర్ఘమైన పత్రములు వ్రాయుట కవసరమగు సామగ్రి, కాగితము, కలము, సిరా మున్నగు వ్రాఁతసామగ్రి గాన్పింపదు. ఇందుచే గ్రంథములు బహువర్షములకుఁగాని లిఖితరూపమునకు రాలేదు.

ద్రావిడవర్తకులు క్రీ. పూ. 7 లేక 8 వ శతాబ్దములలో లిపి తెచ్చినపుడు, వేదవాఙ్మయమంతయు బ్రాహ్మణ విద్వాంసులు ముఖస్థము చేయుచు, గురుశిష్యపరంపరగ నొసంగుచు, ప్రాఁతపద్ధతినే యనుసరించుచుండిరి[68]. వ్రాఁతసామగ్రి పేర్లు అనఁగా కాగితము, త్వక్కు,

---

67 M. Winternitz - History of Indian literature. Vol. I p. 35 (1) "For want of suitable writing materials. (2) No strong need for it."

Rhys Davids—Buddhist India. p. 107 "There were for a long time no writing materials ie., none could be used for the production and reproduction of books. And the Indians not only did not feel the want of them, but even continued, for centuries after materials have become available to prefer, so far as books are concerned, to do without them."

68 Rhys Davids - Buddhist India p. 46 "When this script was first brought to India, in the 8th or 7th century B. C. the Indians had already possessed an extensive Vedic literature handed down in the priestly schools by memory and by memory alone. The alphabet soon became known to the priests. Bnt they continued as before to hand down their books by the old method only. It is probable however that they began to make use of written notes to aid the memory on which they still, in the main depended-"





ప్రాచీన భారతీయ

చర్మములు గాన్పింపవని, బ్రాహ్మణకాల మంతయు వ్రాఁతయే లేదని, యావత్తు వాఙ్మయము నోటితోనే వ్యాప్తి జరుగుచుండెనని 'మాక్సుముల్లరు' పండితుఁడు వ్రాసెను69. బ్రాహ్మణములలో నుల్లేఖింపఁబడిన నాగరికతాకాలము క్రీ. పూ. 800 - 600 అని యనేక ప్రమాణములవలన నెఱుఁగవచ్చును70. కనుక నీ మధ్యకాలములో వ్రాఁతకళ యున్నను గ్రంథములు లిఖితరూపములోనికి వచ్చినట్లు గాన్పింపదు, వ్రాఁతప్రతుల ప్రశంసగాని, గ్రంథములఁ జదువుటగాని, వానిని జూచి వ్రాయుటగాని కాన్పింపదు. గురుముఖమున నోటితో నాఁటి విద్యార్థులు నేర్చుటయే కారణము. పవిత్రగ్రంథములు తమ స్వాధీనములోఁగల పురోహిత వర్గమువారు ఇతరులు చదివి నేర్చుకొందురనిగాని, గురుముఖతః వచ్చినచో నపశబ్దములు లేకుండ, మూలసంహితలు భద్రముగానుండుననిగాని, మాటిమాటికి ప్రతులు వ్రాసిన దానికంటె ముఖస్థపద్ధతియే శ్రేష్ఠతమ మనికాని తలంచి, వేదాదులను గ్రంథరూపములో లిఖింపరైరి.71 గురువులయొద్ద శిష్యులు

69 Max Muller—A history of ancient Sanskrit literature. p 500—501. "There was no mention of writing materials whether paper, bark or skins. During the whole Brahmana period there was no writing. The whole was preserved by oral only.

70 A. B. Keith—Cambridge history of India Vol I P. 49. "The most that can be said is that they tend to support the period 800—600 B. C. as a reasonable date for the Period of the civilization of the Brahmanas."

71 A. A. Macdonall—India's past p 52 "But though we here find a good deal to prove a knowledge of writing and of its extensive use at that time, there is no mention of manuscripts nor of the reading or copying of sacred texts. The explanation of this is that all the early literature was produced orally and handed down orally.......It was in fact in the interest of the priests who were the custodians of the sacred texts to withhold them from unauthorized persons by not writing them down.

Indeed oral tradition offered a better guarantee for the preservation of the original text than the repeated copying of manuscripts."

వేదమంత్రము లధ్యయనముచేసి, చిరకాలము జ్ఞప్తియందుంచుకొను చుండిరి. కఠోర బ్రహ్మచర్య పాలనచే నిదివారికి సాధ్యమగుచుండెను వ్రాయకుండ, చదువకుండ, గురువులయొద్ద విని వల్లించుటచేత కాఁబోలు. వేదములకు, బ్రాహ్మణములకు శ్రుతులని పేరువచ్చెను (Hearing) ఈపదము వేదబ్రాహ్మణములలోఁ గాన్పింపదు కా సూత్ర వాఙ్మయములోఁ బ్రథమముగాఁ గాన్పించుచున్నది కనుక సూత్రకాలమునాఁటికి లిపి లేని కాలమున వల్లింపఁబడిన వే మంత్రములను, శ్రుతులని చెప్పసాగిరని తెలిసికొనవచ్చును. గొప్ప విద్యాధికుఁడైనచో, నాకాలమున 'బహుశ్రుత' యనుచుండి అనఁగా నధికముగా విన్నవాఁడని, యర్థమగునుగాని, అధికముగాఁ జదివిన వాఁడనికాదు.

పై విధముగాఁ జాలకాలమువరకు, వేదమంత్రములు' అనేక శతా బ్దములకాలము, ఋత్విక్కుల కుటుంబములలో వాగ్రూపముగ నచ్చుచుండెను, కాని లిఖితరూపములోనికి రాలేదు. వైదిక కాల నంతరమునకుగాని, వ్రాఁత బాగుగా భారతవర్షమున నెఱుఁగఁబ లేదని చెప్పవచ్చును.. బౌద్ధచక్రవర్తి 'అశోకుని' కాలమునాఁటికి (క్రీ. పూ. 274-237) స్తంభములు, శిలలమీఁద వ్రాయించిన ధర్మ ములనుబట్టి ప్రజలు చదువను, వ్రాయను నేర్చిరని యెఱుంగవచ్చును క్రీ.పూ. 3వ శతాబ్దమునకుఁబూర్వము వ్రాఁతకళ హెచ్చుగా వ్యాప్తి నొందినట్టి యాధారములు లభించవు.[72]

---

M. M. Williams—Indian wisdom p 4 "It is very true that this inspired knowledge, though its very essence was held to be mystically bound up with Sabda or articulate sound (thought to be eternal) was ultimately written down, but the writing and reading of it were not encouraged. It was even prohibited by the Brahmins to whom alone all property in it belonged. ... ... Even after it had been committed to writing it became absolutely a sealed book to the masses of Hindus."

72 A A. Macdonall—India's past p 50. "The hymns of the Vedas composed in the earliest form of Sanskrit were handed down orally for many centuries by families of priestly singers. It was not till towards the end of the Vedic period that writing

సూత్రకాలమునాఁటికి (క్రీ. పూ. 600-200) భారతీయులు వ్రాఁత నెఱింగిరని చెప్పితిమి. వ్రాఁత సామగ్రి నెఱింగినను గూడ, బ్రాహ్మణపురోహితులు చిరకాలానుగతములైన తమ వేదమంత్రములు బయల్పడకుండఁ దమ చేతులలో నుంచుకోఁదలఁచి యితరులు విన కుండుటకుఁ దగిన కట్టుదిట్టములు చేసికొన్నట్లు సైతము గౌతమ ధర్మసూత్రాదులను బట్టి యెఱుంగవచ్చును.73

ప్రాచీన పరిషత్తులలో ననేకులు విద్యార్థులు చదువుకొనుచుండిరి. శ్వేతకేతువు 12వ యేట చదువారంభించి 12 యేండ్లు చదువు కొనెనని 'ఛాందోగ్యోపనిషత్తు' (VI-1-2) తెల్పుచున్నది. 'ఉపకోసల' యను విద్యార్థి 'సత్యకామ జాబాలి' యొద్ద 12 ఏండ్లు చదువుకొనెను. 'ప్రవాహణ జైవాలి' నిత్యము పరిషత్తుల కేగుచుండెను.74 'బృహదారణ్యకోపనిషత్తు'లో 'శ్వేతకేతువు' పాంచాలరాజు పరిషత్తున కేగినట్లుఁగలదు. ఇట్లనేక స్థలములఁ 'బరిషత్తుల ప్రశంస కాన్పించు చున్నదికాని యెచట లిపి ప్రశంసగాని, గ్రంథములు, వ్రాఁత ప్రశంస కాన్పింపదు. అందుచే వైదికకాలములో ప్రాచీన బ్రాహ్మణులు, పవిత్ర గ్రంథములను లిఖింపకుండ ముఖస్థము చేయుచుండిరని చెప్పవచ్చును.

క్రీ. శ. 150 నాఁటివాఁడగు 'పాతంజలి' కూడ వ్రాఁతను గూర్చి ప్రశంసించి యుండలేదు. ఆయన వ్రాఁతలో లిఖిత గ్రంథముల ప్రస్తావనయు లేదు. ఆకాలమునాఁటికి లిఖిత గ్రంథములు కలవనుట

---

became known in India. There is no poof of its existence there till the 3rd century B. C. in the reiqn of the Buddhist king Asoka, who caused religious edicts to be inscribed on rocks and pillars all over the country."

73 Rhys Davids—Buddhist India—p 116 "The ears of a Sudra who listens intentionally when the Veda is being recited, are to be filled with molten lead. His tongue *is* to be cut off if he recites it. His body is to be split in twain if he preserves it in his memory." (Gautama Sutras 12-4-6)

74 R. K. Mukherjee—Hindu civilization—p 85 "Swetaketu Commenced study at 12 and continued it for 12 years (cha. up-VI—1—2) Upakosala also studied for 12 years under his teacher Satya kama Jabali. Pravahana Jaivali daily attended parishads."

కాధారములు లభింపకున్నవని చాలమంది యభిప్రాయము. నా
నికాయములు ప్రస్తుత రూపములోఁ గలుపఁబడిన నాఁటికి శా
సంఘములో, జ్ఞప్తియందుంచుకొని ఒకరికొకరందించు కొనుచుం
ప్రస్తుతము వీనిపేర్లు సుత్తములు, సుత్తాంతము లనఁబడుచున్న
ఈ బౌద్ధ గ్రంథములుకూడ లిఖిత రూపములోనికిఁ జాలకాలము
గానిరాలేదు. ప్రాచీన బ్రాహ్మణులకు పవిత్ర గ్రంథములు వ్రా
గూడదను నియమముకూడ నున్నట్లుఁగాన్పించును. కాని బౌద్ధు
నియమము లేకపోవుటచేత నే వారి గ్రంథములు మున్ముందుగా లి
రూపములోనికి వచ్చినవి వేదములను గూడ ముందుగా లి
రూపములోనికిఁ దెచ్చినది. బౌద్ధులుగానే కాన్పించుచున్నారు
బౌద్ధుల కెట్టిభయము లేకపోయినను, ప్రాచీన బ్రాహ్మణు
మాత్రము మహాభారతములోని వచన మడ్డంకిగానున్నది. ఆ
వేదముల విక్రయించువారు, లిఖించువారు, వాని నపవిత్రము చే
వారు, నరకమునకుఁ బోవుదురని కలదు.77 కాన పవిత్రమ
శ్రుతులను లిఖితరూపములోనికిఁ దెచ్చిన నరకమునకుఁ బోవుదు
భయముకూడ నున్నట్లుఁ గాన్పించుచున్నది. కనుక వ్రాతసా
తెలిసిన యనంతరము కూడ, వేదాదులను ప్రాచీనులు లిఖితరూ
లోనికి రానీయరైరి. ప్రాచీనమగు ఒక వచనములో నిట్లుగ
"ఒకవిద్యార్థి గురువుమాటలను బలునూర్లుచ్చరించినట్లుగానే, ద

---

75 Cambridge history of India Vol I p 194 "It follows th the time when the 4 Nikayas were put together in their pre form, Suttas and Suttantas known by their present titles already current and handed down by memory, in the commu

76 A. Weber—The history of Indian literature. P 22 (1 "Haug thinks those Brahmins who were converted to Budd were the first who consigned the veda to writing—for pole purposes—and that they were followed by the rest of Brahmins."

77 R. L. Mitra—Indo Aryans. Vol. I p. 5o2 "Maha Bh tells, that, "those who sell the Vedas, and even those who them, those also who defile them (pollute) they shall go to he



ప్రాచీన

కప్ప. రెండవకప్పయొక్క పల్కులనే యుచ్చరించుచున్నది.''78 ఈవిషయముకూడ వ్రాఁతలేదని, లిఖితగ్రంథములు లేవని, కప్పలవలె నోటితోనే మంత్రము లుచ్చరింపఁబడుచుండెనని తెలిసికొనవచ్చును. ఫాహియాను (405-411) కాలమునఁగూడ ముఖస్థపద్ధతి హెచ్చుగా నున్నట్లుతని వ్రాఁతలు తెల్పుచున్నవి.

క్రీ. శ. 1030లో వచ్చిన 'అల్బరూని' వ్రాఁతలను బట్టికూడ బ్రాహ్మణులు వేదముల నర్థము తెలియకుండ వల్లించెదరని, ఒకరినుండి యొకరు నేర్చుకొందురని, బ్రాహ్మణులు క్షత్రియులకుఁ జెప్పెదరని, వారు నేర్చుకొందురేకాని బ్రాహ్మణులకుఁగూడ బోధింప వీలు లేదని వైశ్యశూద్రులను వేదమును విననియ్యరని, దానిని వారు ఉచ్చరించుటకు వల్లించుటకుఁగూడ వీలు లేదని, యెవరైన నట్లొనర్చినచో బ్రాహ్మణులు దండవిధాయి యెదుటకులాగి. యతనినాలుకను గోసి వేయించుచుండిరని, వేదమును, లిఖితరూపములోనికి వచ్చుటకు బ్రాహ్మణు లంగీకరింపరని అది కొన్ని స్వరభేదములచేఁ గూర్పఁబడుటయే దీనికిఁ గారణమని, వ్రాఁతప్రతిలో నేదైన పొరపాటుగాని, లోటుగాని యపభ్రంశముగాని జరుగునని, లిఖితరూపమునకు రానిచ్చుట లేదని కొలఁదికాలము క్రిందట 'వసుక్ర' అను 'కాశ్మీర'వాసి, ప్రసిద్ధ బ్రాహ్మణోత్తముఁడు స్వయముగా వేదార్థమును బోధించుటకు, లిఖితరూపములోనికిఁ దెచ్చుటకుఁ బూనుకొనెనని, వేదములు మఱచిపోయినచో స్మృతిపథమునుండి తప్పిపోవునని, ఆయన భయపడుచుండెనని,జనుల ప్రవర్తన నానాఁటికి క్షీణించుచుండెనని, వారు నీతి ధర్మములఁ దప్పుచుండిరని అందుచే లిఖితరూపములోనికిఁ దెచ్చుటకు కారణముగల్గినదని తెలియవచ్చుచున్నది 79 ఇంత జాగ్రత్తగైకొన్నను వేదశాఖలు 1000కి పైగా నశించిపోయినవి.

---

78 Max Mullar— A History of ancient Sanskrit literature p. 506 (1859) "One frog repeats the words of another like a pupil who repeats the words of a teacher." VII - 103-5

79 Dr. Edward C. Sachau -- Alberuni's India Vol. I p. 125 "The Brahmins recite the Veda without understanding its meaning and in the same way they learn it by heart the one receiving it

'అల్బరూని' వ్రాతలనుబట్టి క్రీ. శ. 1000 సంవత్సర ప్రాంతమ ప్రథమముగా 'వసుక్రుఁడు' లిఖితరూపమునకు వేదములఁ దెచ్చె తెలియుచున్నది. కాని ఇతరులు చదువుకొనకుండ బ్రాహ్మణు తగిన కట్టుదిట్టములఁ జేసికొనిరి. కొందఱు విద్వాంసులు 18వ శ బ్దమువఱకు, ననఁగా వేదములఁగూర్చిన 3000 ఏండ్లకుఁగాని, ఇతరులు తెలిసికొనుట కవకాశము జిక్క లేదని వ్రాసిరి. అప్పుడైన కొందఱు బ్రాహ్మణుల ద్రోహబుద్ధిచేతను, పాశ్చాత్యుల పల్కు చేత నివి బయటపడినట్లు తెలియవచ్చుచున్నది.[80]

'ఫాహియాను' అను చైనీయపరివ్రాజకుఁడు (క్రీ.శ. 405-411) మ దేశములోని బౌద్ధగ్రంథములఁ గైకొనిపోవుటకు వచ్చెను. ఆయనకా

---

from the other. The brahmins teach the Veda to the Kshatriy The latter learn it, but are not allowed to teach it, not even to Brahmin, The Vaisya and Sudra are not allowed to hear it, mu less to pronounce and recite it, If such a thing can be pro against one of them, the Brahmins drag him before t magistrate and he is punished by having his tongue cut off.

They do not allow the Veda to be committed to writing, be cause it is recited, according to certain modulations, and th therefore avoid the use of the pen, since it is liable to cause so error and may occasion an addition or a defect in the written te

Ibid p. 126 'This is the reason why, not long before our tim Vasukra, a native ot Kasmere, a famous Brahmin, has of his own a count undertaken the task of explaining the Veda, and committi it to writing. He has taken on himself a task from which everybo else would have recoiled, but he carried it out because he w afraid that the Veda might be forgotten and entirely vanish out the memories of men, since he observed that the characters men grew more worse and worse and that they did not care mu for virtue, nor even for duty."

80, Paul Mausen Oursel— Ancient India and Indian civili tion. "Avesta was written on calf skins prepared for the purpos The vedas were written only at the end of 18th and 19th centuri under the influence of the Europians and by the treason of cert Brahmins—Uponishads also say, texts were learned by rote."

ములలోఁగూడ గ్రంథముల వ్యాప్తి, భారతభూమిలో విశేషముగాఁ గాన్పింపదు. 'నోటితోనే గురువు భారతవర్షములోఁ జెప్పుచుండును81' అని పాహియాను వ్రాసెను. చైనాదేశములోఁ బరిశుద్ధప్రతులు లేకుండుటఁ గాంచి, 'పాహియాను' భారతవర్షములోని ధర్మగ్రంథముల ప్రతులను దీసికొనిపోఁ దలంచెను. కాని, మధ్యభారతములో 'పాటలీపుత్రము'వరకు వచ్చినను గోరిన పుస్తకమే కాన్పింపదు. పాటలీపుత్రములోఁ దిరిగి ప్రతులను వెదుక నారంభించెను. అన్నిచోట్ల నాచార్యులు గురుపరంపరగా నోటితోఁ జెప్పుట పాహియాను స్వయముగాఁ గాంచెను. ఆయన మిగుల చింతాక్రాంతస్వాంతుఁడై ఇట్లు వ్రాసెను. "ఇంతదూరము వచ్చి మధ్యహిందూస్థానము జొచ్చినాను; ఇచట మహాయానసంఘారామములో నొక నికాయముయొక్క వినయము మాత్రము లభించినది; అనఁగా మహాసాంఘిక నికాయముయొక్క వినయము." (నికాయము = శాఖ)

గౌతమస్మృతికాలము (క్రీ. పూ. 5వ శతాబ్దము) న బ్రహ్మాండమైన వాఙ్మయము నోటితోనే వల్లింపఁబడుచుండెను. క్రీ. పూ. 5వ శతాద్దినాఁటికిఁ గూడ వేదాదులను లిఖింపవలె ననెడి భావముకూడ భారతీయులకుఁ గల్గినట్లు తోఁచదు. చిరకాల మిట్లే గ్రంథస్థము గాకుండనే గురుశిష్యరూపముగా వచ్చుచుండెను. ప్రాచీన బ్రాహ్మణవిద్వాంసులు తీవ్రమైన బ్రహ్మచర్యపాలనచేత, 36 ఏండ్లవఱకు గురుకులమందే యుండి, నాలుగువేదములను కంఠతః అప్పగించు పద్ధతులు, భారతభూమిలోఁ గలవని యవన లేఖకుల వ్రాఁతలవలన నెఱుంగనగును. 'మహాభారతము'కూడ నిట్లే వాక్పేటికలలో వచ్చుట

---

81 James Legge M. A.—Travels of Pahiyan— P 98 "In India one master transmits orally.

H. G. Rawilson—Indian historical studies P. 67. (1913) "Returning to Pataliputra, Pahiyan was at last fortunate enough to acquire the manuscripts he sought; the task had been a difficult one, for much of the teaching of Gautama was, in accordance with Indian practice preserved orally, and not entrusted to writing."

చేతనే శాఁబోలు 'పంచమవేద' మను పేరు గాంచినది.[82]

'నాగార్జునయతి' క్రీ. శ, 2వ శతాబ్దములోనివాఁడు, నాలుగువే ములను, సమస్త శాస్త్రములను కూలంకషముగా నత్యల్పకాలములో నేర్చిన ప్రజ్ఞాధురీణుఁడు. తొంబది దినములలో బౌద్ధుల త్రిపిటకము జదివి, వానియర్థమును గ్రహించెను. హిమాలయ పర్వతములలో నొక వృద్ధునియొద్దనుండి 'మహాయాన సూత్రములు' గ్రహించె. ఆయన 'ఏకసంథాగ్రాహి'యనుటలో సందియము లేదు.[83]

'ఇత్సింగు'అను చైనీయలేఖకుఁడు (క్రీ.శ. 672-688) భారతభూ వచ్చి, భారతీయబ్రాహ్మణులు జంబూద్వీపముయొక్క ఐదు ఖండ లలో నత్యంతగౌరవనీయులని, మిగత జాతులలో వారు కలియరు వారు గౌరవించు శాస్త్రములు, లక్షమంత్రములుగల వేదము లేయ వేదములు వాక్పేటికలలోఁ దరతరములనుండి వచ్చుచుండెనని, కా తముపైఁ గాని, యాకులపైఁ గాని వానిని వ్రాయురని, ప్రతితరములో గొందఱు తెలివితేటలు, బుద్ధిసూక్ష్మత కల బ్రాహ్మణు లుందురు వారు లక్షమంత్రములు వల్లింపఁగలరని, యే విషయమైన జ్ఞప్తి య దుంచుకొందురని, యేకసంథాగ్రాహిగా నుండుట కభ్యసించెదరు ఇది యసత్యము గాదని, తా నిట్టివారిని జూచితినని, పూర్వహింద స్థానములో మహాసత్వుఁ డగు 'కంద్ర' యనువాఁ డిట్టివాఁడే య ఆయన జీవించియున్నాఁడని ఆయనశక్తు లసామాన్యములని వ్రా ను. క్రీ. శ. 660 లోఁ జనిపోయిన 'కాశికావృత్తికర్త' 'గాయ త్ర్యుఁడు' యేకసంథాగ్రాహి యని, గొప్పవిద్వాంసుఁడని 'ఇత్సిం

82 A. A. Macdonall—History of Sanskrit literature P 2 "Hence the historic germ of the great epic is to be traced to a ve early period, which cannot well be later than 10th century B.C Old songs about the ancient fued and the heroes who played part in it, must have been handed down by word of mouth a recited it in popular assemblies or at great public sacrifices."

83 M. Winternitz—History of Indian literature Vol II. P 3 "Nagarjuna, born in South India, studied 4 vedas and learned sciences. He studied the 3 pitakas in 90 days and grasped meaning. He had a Mahayana sutra from a old monk Himalayas."

వ్రాఁతలవలనఁ దెలియవచ్చుచున్నది. 82(a) 'ఘోషెరబౌ శాసనములఁబట్టి (Ghosherabau inscription) క్రీ.శ. 9వ శతాబ్దిలో 'వీరదేవుఁడు' సమస్తవేదములను ముగించి, పెషావూరునకు సమీపములో నున్న 'కనిష్క మహావిహారము'న కేగి మిగత శాస్త్రములు ముగించు కొనెనుశిష్ణ అద్వైతమతస్థాపకుఁడగు 'శంకరుఁడు' నిట్టివాఁడే. ఇత్సింగు వ్రాఁతలనుబట్టి క్రీ.శ. 7వ శతాబ్దమునాఁటికి వేదములు గ్రంథరూపమున లేవని, వాక్పేటికలలో గురుశిష్య సంప్రదాయరూపముగా వచ్చుచుండెనని 'కంద్ర' మున్నగు ఏకసంథాగ్రాహులు భారతభూమిలోఁ గలరని తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 11 వ శతాబ్దములోఁ గూడ, బ్రాహ్మణవిద్వాంసులు వేదాదులను వల్లించుచుండిరని, అల్బరూని వ్రాఁతలు దెల్పుచున్నవి. ఈనాఁటికికూడ ఋగ్వేదప్రతులన్ని పోయినను, భారతవర్షములోని శ్రోత్రియబ్రాహ్మణుల జ్ఞప్తిచేత, నవలీలగా ఋగ్వేదమంతయు మనకు లభించునని, ఈ భారతీయ విద్యా

---

82 (a) Itsing. A record of the Buddhist religion — (J.Takakasu) p. 182 'The Brahmins are regarded through out the five parts of India as the most honourable (caste). They do not, when they meet in a place, associate with the other 3 castes and the mixed classes of the people have still less intercourse with them. The scriptures they reverie are the 4 Vedas containing about 100,000 verses...... The Vedas have been handed down from mouth to mouth not transcribed on paper or leaves. In every generation there exists some intelligent Brahmins who can recite 100,000 verses. In India there are two traditional ways by which one can attain to great intellectual power. First by repeatedly committing to memory, the intellect is developed, secondly the alphabet fixes one's ideas. By this way after a practice of 10 days or a month a student feels his thoughts rise like a fountain and can commit to memory whatever he has heard (not twice). This is far from being a myth, for I myself have met such men. In East India, a great man lived Mahasatwa named Kandra. He was alive. The basis of learning was what a man carried in his head, in his memory and that constant repetetion was required to prevent his losing it.'

83(a) "N. N.Mazumdar M. A. — A History of education in Ancient India. p. 16 "See Gauralekhamala.

ర్థులు వేదమును ముఖతః వల్లించెదరని, వా రెన్నడు వ్రాత
నుండి కాక, అచ్చుగ్రంథమునుండి కాక, గురువునోటినుండియే
నేర్చెదరని, తిరిగి కొన్నాళ్ళకు శిష్యులకు నేర్పెదరని ప్రఖ్యాతి
చిన 'మాక్సుముల్లరు' (Maxmuller) వ్రాసెను.[84] భారతవర్ష
నీనాఁటికిఁ గూడ వేదమంత్రముల వల్లింపఁగల పండితులు
లేకపోలేదు.

ఇంక బౌద్ధవాఙ్మయముద్వారా వ్రాఁతప్రతులనుగూర్చి తెలి
దను. క్రీ.పూ. 240 లోఁ బూర్తిగావింపఁబడిన బౌద్ధ ధర్మగ్రం
లలో వ్రాఁతప్రతుల ప్రశంస లేదు, కాని వ్రాఁతకళనుగూర్చి
బడినది. వ్రాఁత విరివిగా వాడఁబడుచున్నట్లు బౌద్ధభిక్షుణులు వ్రా
కళ నభ్యసించుచున్నట్లుఁ గాన్పించుచున్నది.[85] వినయపిటకాదు
దన్నివస్తువులు పేర్కొనఁబడినను, వ్రాఁతప్రతులు, సిరా, క
ఆకులు లేక లేఖనసామగ్రిపేర్లు కాన్పింపవు. ప్రాచీనకాలపు
భిక్షువు లెల్లరు నోటితోనే బౌద్ధధర్మముల నందించుచుండిరి.
యప్పటిభిక్షువులు సమస్త జీవరాసులు నశించిపోవుటఁ గాంచి
చోట సమావేశమై వాని నన్నిటిని, ధర్మములు చిరకాల ము
టకుగాను గ్రంథరూపములో లిఖించియుండిరి.[86] 'వినయపిట

---

84 Max Muller---India, what can it teach us? P 181 "Ent
by memory."---

"At the present moment, if every manuscript of the Rig V
were lost, we should be able to recover the whole of it from
memory of the Srotriyas in India. These native students lear
Veda by heart, and they learn it from the mouth of their G
never from a M.S., still less from any printed edition,---and
a time they teach it again to their pupils."

85 M. Winternitz---History of Indian literature Vol II. P
"In the Buddhist cannon completed in 240 B. C. there is
mention of manuscripts, but art of writing. There was exte
use at that time, Art of writing was practised by Buddhist nu
Books copied or read appear."

86 RhysDavids and Oldenburg---Vinaya texts part I Sa
books of the east vol. XIII---p 3 " All things were mentioned-



ప్రాచీన భా

లిఖితరూపములోనికి రాక పూర్వము 300 సం॥ల కాలమువఱకు 'వినయధార' యొక్క- స్మృతి శక్తిచేత మనసులలోమాత్రమే యుండి, యున్నట్లు గాన్పించుచున్నది. 'వినయధార' యనఁగా వినయపిటక మప్పగింపఁగల బౌద్ధభిక్షువులని భావము.87

క్రీ. పూ. 6వ శతాబ్దమునాఁటికి సిరా, కాగితము మున్నగునవి కాన్పింపవు, బ్రాహ్మణులకుఁ బురోహితులకు దాన ధర్మములు రాగి రేకులపై వ్రాయఁబడినవి, కాని అవి క్రీ. శ. 2 లేక 3వ శతాబ్దములోని విగాఁగాన్పట్టును. ఈదాన ధర్మములు విష్ణు, నారద, యాజ్ఞవల్క్య స్మృతులందుఁ బేర్కొ-నఁబడినవి. అంతకుఁ బూర్వగ్రంథములందుఁ గాన్పింపవు.88

బౌద్ధులకైనను లిఖిత గ్రంథములున్నచో, వ్రాఁతప్రతులు, వాని పరిశీలనమునుగూర్చి, బౌద్ధభిక్షువుల నిత్యజీవనములోఁ బేర్కొ-నఁబడి యుండెడివే. చిన్నవస్తువులు, గృహసంబంధమగు వ్రాఁతసామగ్రి, చరాస్తి, మున్నగునవనేకములు వానిఉపయోగములు పేర్కొ-నఁబడినవి. కాని పుస్తకముల వ్రాఁతప్రతుల ప్రశంస మెందును గాన్పింపదు. శాస్త్రములున్నట్లు ప్రమాణములు గలవు కాని యవి

---

where do we find manuscripts, inks, pens, stems or leaves, or writing materials.

"The wise Bhikkus of former times had, handed down by word of mouth" The then Bhikkus perceiving how all things do decay, meeting, together, wrote them in books that the Dhamma might last long."

87 Ibid p 36 "Vinaya before it was reduced to writing was handed down for almost 300 years solely by memory and it lived in the minds of Vinaya dhara, the Bhikshus who were versed in Vinaya"

88 T. L. Shaw---History of India--P 25 "In the 6th century B.C. no ink, no paper etc. were mentioned. Gifts to Brahmins and priests were safeguarded by such grants in the 2nd and 3rd century A. D. and they are mentioned in the law books of Vishnu, Narada and yagnavalkya, but not before."

గ్రంథరూపములోఁగాక ముఖస్థమై వాక్పేటికలలో భద్రపఱుపఁబడినట్లు తెలిసికొనవచ్చును.89

వ్రాయుట, చదువుట లేదని, వినుట వల్లించుట యధికముగాఁగలదని, క్రీ.పూ. 5వ శతాబ్దికిముందు లేఖనపద్ధతి లేదని, ప్రాచీన వాఙ్మయములో గ్రంథములు వ్రాయుభావమే లేదని తెలియవచ్చుచున్నది. గ్రంథములు వ్రాయుటకుఁ దగిన లేఖన సామగ్రి లేకుండుటయే కాదు, ప్రతివారు ముఖస్థమున కలవాటు పడియుండుటచేత, వ్రాఁతప్రతుల యవసరము లేకుండెను. ప్రతివారువిని వల్లించి, బహువర్షముల కాలము జ్ఞప్తియందుంచుకొనుచుండిరి. ప్రతివారునొక 'సజీవగ్రంథాలయము'గానుండిరనుటలో నతిశయోక్తి లేదు. విద్యాధికులను బహుశ్రుతులనుచుండిరి. బౌద్ధధర్మములలో నిట్లున్నది. "సోదరా! వెళ్ళుము తప్పుచేసితి నని యంగీకరించు ధర్మసూత్రమును సంపూర్ణముగాఁగాని, క్లుప్తముగాఁగాని ముఖస్థముచేసి మాయొద్దకుఁదిరిగిరమ్ము" బౌద్ధభిక్షువు లిట్లు కాలమున వల్లించుచుండిరనుట స్పష్టము.90 వ్రాయుట, చదువుట,

---

89 Rhys Davids---Buddhist India.

"For if books had been known and used in India, at the period in question, then the manuscripts themselves and the whole industry connected with them must have played an important part in the daily life of the members of the Buddhistic order, Personal property, every movable thing, domestic utensil, is referred to and its use pointed out and articles in ordinary use among laymen, but not allowed to members of the order, are] mentioned also in order to be disallowed - but no where do we find the least trace of any reference to books or manuscripts, ... There is pretty constant reference to the texts as existing, but existing only in the memory of those who had learnt them by heart."

90. Winternitz— History of Indian literature Vol. I p. 33 "The memory of the brethern rich in hearing what we now call well read, was at that time called rich in hearing took the place of monastic libraries- "Go brother and when you have memorized the confession formula, the full one or the abridged one, then return to us."

బదులు, వినుట, వల్లించుట కలదనుటలోనందియము లేదు. 'ఓల్డెన్‌బర్గు (Oldenberg) మున్నగువిద్వాంసులిట్లే వ్రాసిరి.

బౌద్ధుల పిటకములు సూక్త, వినయ, అభిధర్మ పిటకములు చాల కాలమునకుఁగాని వ్రాతలోనికి రాలేదు. క్రీ. పూ. 477లో బుద్ధుని 'మహాపరినిర్వాణమైన కొన్నివారములలో, రాజగృహలో బౌద్ధ భిక్షువులు చేరి బౌద్ధసూక్తములు వల్లించుటకుఁగాను, బింబిసారుని కుమారుఁడగు 'అజాతశత్రుని' నొకచక్కని పందిలి నిర్మింపుఁడని కోరిరి. సుందరమైన సభామందిరమును, 'బైభరకొండ'లో (Baibh-ara hill) 'సత్తపన్నిగుహ'లో(Sattapanni cave) రాజు నిర్మించెను. ఇచట 500 మంది భిక్షువులుచేరి, గౌతముని బోధలను జ్ఞప్తియం దుంచుకొనుటకు, గానముచేసిరి. ముఖ్యముగా 'ఆనందుఁడు' సూక్త పిటకమును, ఉపాలి వినయపిటకమును గానము చేసిరి. ఇవి రెండును, నేటికిని ప్రమాణములుగానున్నవి. వ్రాత లేని దినములలో, గ్రంథములు వ్రాయని రోజులలో నిట్లు భారతీయులు ముఖస్థముచేసిన ధర్మవచనములను గానముచేయుచుండిరి.91

క్రీ. పూ. 377లో బౌద్ధభిక్షువుల పరిషత్తు మఱియొకటి జరిగెను గాని ఇందు పదివిషయములలోఁ దీవ్రమైన భేదాభిప్రాయములు జనించెను. క్రీ. పూ. 253 ప్రాంతమున జరిగిన తృతీయ పరిషత్తు సమయమున 1000 మంది బౌద్ధభిక్షువులు పాల్గొని బౌద్ధ ధర్మములు గానముచేసిరి. ఇది అశోకుని కాలమున జరిగెను. ఈతృతీయ పరిషత్తు వఱకు బౌద్ధ ధర్మములు ఆచార్య పరంపరగా ముఖస్థముగానే వచ్చు చుండెను. తర్వాత అశోకుని కుమారుఁడు 'మహేంద్రుడు' బౌద్ధధర్మ వ్యాప్తికి 'జంబూద్వీపము' నుండి 'సింహళమున' కేగి అచట గానము చేసెను. అచట శిష్యాను శిష్య పరంపరగా, వాక్పేటికలలోనేయుండి 'వటగామని' యను సింహళరాజుకాలములో, 'మాతులజనపదము'

---

91. R. C. Dutt - Ancient India p, 103 "It is said in the year of Gautama's death 500 of his followers assembled at Rajagriha, then the capital of Magatha, and chanted together the teachings of Gauthama to fix them on their memory. This was the way in which sacred texts were preserved before printing or published works were known.

యొక్క 'ఆలోకవిహారము'లో బౌద్ధుల పంచమ పరిషత్తుసమయములో, క్రీ. పూ. 88లో గ్రంథారూఢము చేయఁబడెను. ఈ విధముగా 'తథాగతుఁడు మృతినొందిన 400 యేండ్లకుఁగాని బౌద్ధుల వేదములు లిఖితరూపమునకు రావాయెను. ఈపిటకములే నేఁటికిఁ బ్రమాణములు గానున్నవి.[92] 'వింటర్ నిట్జ్'కూడ దీని నంగీకరించెను.

బుద్ధుని ప్రథమధర్మబోధను భిక్షువులు జ్ఞప్తిలో నుంచుకొని, కొన్నాళ్ళకుఁదర్వాత 'సారనాథు'లోని యొకశిలపై లిఖించినట్లు, బుద్ధ వచనములకు శిలాలేఖనమునకు భేదము రవంతయేనిలేదని (Ipsessima Verba) విద్వాంసులు వ్రాసియుండిరి.

బౌద్ధయుగములోఁ బురుషులేకాదు, స్త్రీలుసైతము విద్యావంతులైనట్లు నిదర్శనములు గలవు, 'సంయుక్తనికాయమును బట్టి, రాజగృహ'లో 'సుక్క' యను విదుషీమణి ప్రజలకు ధార్మికబోధ చేసినట్లు, నొక యక్షుఁడది విని, యానందించి,'సుక్క మధువును బంచుచున్నదని. తెలివిగల వారేగి దానిని త్రాగవచ్చునని, చెప్పెనని

---

92. R. C. Cutt— Ancient India p. 103. "About 242 B. C. the sacred texts were once more chanted together by a 1000 monks. A son or nephew of Asoka then went to Ceylon and introduced Buddhism in that island and the sacred texts carried there by word of mouth were reduced to writing in 88 B. C. in the form in which we have the three pitakas of Ceylon to this day." ... ... Those who are aware how faithfully the Hindus have preserved their ancient learning and sacred texts by memory from century to century, how every word, every syllable, every accent of such ancient works as the Vedas have thus been preserved unaltered by generations of men who passed their lifetime in this duty of transmitting ancient texts, and how to the present day, when printing is known and published books are cheap, the Hindus still learn their sacred texts from generation to generation by word of mouth,—will have small reason for wonder that the teaching of Goutama Buddha were chanted together and fixed on the memory and faithfully preserved for a few centuries after his death, until they were formally settled at the great council of 242 B. C. and Committed to writing in the pali language in in Ceylon 88 B. C."

తెలియుచున్నది. 'క్షేమ' వినయపిటకమును ముఖస్థముచేసెను. మజ్జిమనికాయమునుబట్టి 'ధమ్మదిన్న' యనుకాంత బౌద్ధ వేదాంతమును నేర్చెనని తెలియును. 'విమానవస్తు' అను పుస్తకమునుబట్టి, 'లాట' యను బాలిక, శ్రావస్తి ఉపాసకుని కూంతురు లెస్సగా నేర్చిన యువతియని, 'సంఘమిత్ర' వినయపిటకమును సుత్తపిటకములోని 5 భాగములను, అభిధర్మలోని 2 భాగములను సింహళములోని అనూరాధపురములో గానముచేసెనని దీపవంశాదులంబట్టి తెలియు చున్నది. అంజలికూడ నిట్టిదే.93 వీరందఱు కాలమున వ్రాంత ప్రతులున్నట్లు గాన్పింపదు. వీరుకూడ పురుషులవలె బౌద్ధధర్మములు ముఖస్థము చేయుచుండిరి.

బుద్ధుడుంకూడ, 'నేను మరణించిన తర్వాత నేనుబోధించిన బౌద్ధ సంఘముయొక్క ధర్మములు, చట్టములు మీకు బోధకులై వెలయు గాత!' అని చెప్పెను. 94 లిఖిత గ్రంథముల ప్రశంసలేదు. ధర్మము లన్ని ముఖతః వల్లించుచుండిరి.

బౌద్ధుల జాతక కథలుకూడ బహువర్షముల కాలము వాక్పేటికల లోనే వచ్చినట్లుంగాన్పించుచున్నది. ఇవి క్రీ. పూ. 3 లేక 4 వ శతాబ్దమునాంటివని ''హాప్‌కిన్సు, మెక్డనాల్'' మున్నగాంగల విద్వాంసుల యభిప్రాయము. 95 కాని ఇవి లిఖితరూపములోనికి, 'ఫౌస్‌బాల్' మున్నగు పండితుల అభిప్రాయ ప్రకారము, క్రీ.శ.5వశతాబ్దమునాంటికి

---

93 See B. C. Law's, women in Buddhist literature, chap V, for further details.

94 Rhys davids—Buddhism P 82 "After I am dead, let the law and rules of the order, which I have taught, be a teacher to you."

95 E. W. Hopkins—The great epic of India P 391 "Jatakas only go back to the 3rd or 4th century B. C."

A. A. Macdonall—History of Sanskrit literature p 369. "Jatakamala, a collection of stories under that name existed as early as the council of Vesali, about 380 B. C. and in the 5th century they assumed this shape." Buhler "They do not describe the condition of India, in the 3rd or 4th century B. C., but an older one."

సింహళద్వీపములో వచ్చినట్లు, గాన్పించుచున్నది. ఇంతకాలము ముఖ స్థముఁ జేయుచు, నక్షరము పొరపాటులేకుండ బౌద్ధ పండితులు జాతకమాలనెట్లు కాపాడిరో తెలిసికొన్న మనకాశ్చర్యముగల్గకపోదు.

జాతక కథలలో, 'లేఖమ్, ఫలకమ్' (పలక) మున్నగుపదములు కాన్పించును. 'వచనం, లేఖనం' అని ఉండుటచేత, చదువుట, వ్రాయుట, కలవని చెప్పవచ్చును. 'కశాహతుఁడను' బానిస, సెట్టి కుమారునితోఁబాటు వ్రాతనేర్చెను. కనుక వ్రాఁతగలదనుటస్పష్టమే. కాని పుస్తకములు కలవా? యను విషయములో. 'శిప్పమ్‌వాచెసి' అనఁగా శిల్పములు చదువుట, అనుటఁ బట్టి పుస్తకములు కలవని, ముఖ్యముగా 'పొత్తకమ్' యని కూడఁ గలదని జాతకకథలను ప్రత్యేకముగా విమర్శించి వ్రాసిన, 'మెహతా' యభిప్రాయపడెను. 96 ఈ విషయముఁ నింకను బరిశోధించి కాని చెప్పఁజాలము,

హిందువులు, బౌద్ధులవలెనే జైనులలోఁగూడ వారి పవిత్రగ్రంథములను వాక్పేటికలలోనే భద్రపఱచుకొనుచు వచ్చిరి. వారి గ్రంథములు సిద్ధాంతములు లేక ఆగమములు అనఁబడును. వానిలో మొదటిభాగము 'ద్వాదశాంగములు' అందురు. మొత్తము 'జైనధర్మ శాస్త్రమంతయు, 'దేవర్థిగణి' చేత క్రీ, శ. 454లో లిఖింపఁబడెను. 'గుజరాతు'లోని' వల్లభినగరము'లో జైనసాధువులందఱుఁగలసి, ధర్మములనన్ని ఏరికూర్చి వ్రాయించిరి. వర్ధమానమహావీరుని కాలము నుండి, అంతవరకు ముఖస్థమై గురుశిష్య రూపముగా, జైనధర్మబోధలు వచ్చుచుండెను. 97 క్రీ. పూ. 310 లో మొదటి జైనప

96 R. N. Mehatha—Prebuddhist India P 303 "we have also direct references to the existence of books (pottakam) 'preserved with briliant, coloured rappings, and read laying them upon a beautiful standish' (J. III—P 235) 292. IV p 299., V P 483.

97 A.A. Macdonall—India's past p. 68 "The whole canon was edited by Devarddhigani in 454 A. D. having till then been handed down by oral tradition"

  

షత్తు, పాట్నాలో జైన ధర్మశాస్త్రముల నిర్మించినట్లు, అవిముఖతః ఉన్నట్లు తెలియుచున్నది. 97(a)

ఇట్లే తమిళులకుఁగూడ, టిబెటీయులవలె చాలకాలమువరకు లిపి కాన్పింపదు. వారి లిపి, క్రీ. పూ. 2 లేక 3 వ శతాబ్ద ప్రాంతమున 'శిలా లేఖనము'ఁ జేయు విదేశీయులచేతఁ బ్రవేశపెట్టఁబడెను, 98 లిపి తెలిసిన తర్వాత కొన్నాళ్లకుఁగాని గ్రంథములు లిఖితరూపములోనికి రాలేదు.

భారతవర్షపు వ్రాఁతప్రతులు విదేశములకుఁబోవుట:—క్రీస్తుశకమునకుఁ బూర్వము భారతవర్షమున నధికముగా వ్రాఁత ప్రతులున్నట్లు చెప్పఁజాలము. సూత్రగ్రంథములు క్రీ. పూ. 600 కు పూర్వపువి కావు. 'యాస్కుని' నిరుక్తము క్రీ. పూ. 500 నాఁటిది. శాకటాయన వ్యాకరణము ఆకాలమునాఁటిదే. 'పాణిని' వ్యాకరణశాస్త్రము క్రీ. పూ. 350 నాఁటిది. 'లలితవిస్తారమను' బౌద్ధగ్రంథము మూఁడవ బౌద్ధ పరిషత్తు కాలమునాఁటిదని (క్రీ. పూ. 253) 'మాక్సుముల్లరు' పండితుని అభిప్రాయము. 'మీనాండరుకు, నాగసేనునికి జరిగిన సంవాదము 'మిలిందపన్హా' యను గ్రంథమున వర్ణింపఁబడినది. వీరు క్రీ. పూ. 150 నాఁటివారు. కాని గ్రంథము తరువాత నొక శతాబ్దమువఱకు లిఖితరూపమునకురాలేదు. పతంజలిభాష్యము క్రీ. పూ. 150 నాఁటిది. మిలిందపన్హా క్రైస్తవశకారంభమున వ్రాయఁబడినదని మెక్డనాలు (Macdonall) పండితుని అభిప్రాయము. 99 ప్రస్తుతరూపములోనున్న 'రామాయణ మహాభారతములు' క్రైస్తవ శకమునకుఁ

---

97 (a) The Imperial Gazetteer of India— The Indian Empire Vol I.(1907). "The first Jain council, held at Pataliputra, the modern Patna, about 310 B. C. is said to have framed the Jain canon."

98 P. T. Srinivasayyangar—History of the Tamils p 215. "Tamil was first committed to writing late in the 3rd century or early in second century B. C. by foreign emigrants who were inverterate makers of stone inscriptions."

99 A. A. Macdonall—India's past P. 62 "The original part of thiswork was probably written about the beginning of the Christian Era.)

  

పూర్వము తర్వాతివికూడ నైయున్నవి. 'మహావస్తు' వను బౌద్ధ గ్రంథము క్రీ. శ. 2వ శతాబ్దము నాఁటిది. సంస్కృతములో వ్రాయఁ బడిన 'అశ్వఘోషు'ని బుద్ధచరిత్రము' 140 నాఁటిది. అప్పటివాఁడగు 'కనిష్కమహారాజు' బౌద్ధసభ చేయించి త్రిపిటకమునకు సంస్కృత సంస్కరణము చేయించెను. అది యిపుడు 'మహాయానమను పేరఁ బరగుచున్నది. కనిష్కునికి ముందు క్రీ. పూ. 88 లో వ్రాయఁబడిన హీనయాన త్రిపిటకములు 'పాళీభాషలో వ్రాయఁబడెను. కనిష్కుని సభకు 500 మంది బౌద్ధ భిక్షువులు వచ్చిరి. వసుమిత్రుఁడీసభ కగ్రాసనాధిపతి. ఈసభలో 'సూత్రపిటకము' మీఁద ఉపదేశ శాస్త్రము వ్రాయఁబడెను. వినయ,అభిధర్మ పిటకములకు భాష్యములు, వ్రాసిరి. రాజు ఆజ్ఞచేత అన్నియు రాగి రేకులపై వ్రాయఁబడెను. బర్మాలో 'ప్రోము'లో నొక స్తూపములో 20 పల్చని బంగారు ఆకులు గల వ్రాఁత ప్రతిని, దక్షిణ హిందూస్థాన లిపిలో, పాళీ భాషలో వ్రాయఁబడిన ధర్మ గ్రంథమును విద్వాంసులు కనుగొనిరి. ఈ ప్రకారము బంగారు, రాగి రేకులపైనకూడ గ్రంథములు వాయఁబడినవి.

ఈప్రకారమాలోచించి చూడఁగా క్రైస్తవ శకారంభమునకుఁ బూర్వము, తరువాత కొద్దికాలమువఱకు కొలఁది వ్రాఁత ప్రతులు మాత్రమీ దేశమున నుండియుండ వచ్చును. ప్రధానకారణము విపులమైన లేఖన సామగ్రి లభింపకుండుటయే కావచ్చును, పైవానిలో సూత్రాది గ్రంథములుకొన్ని లిఖితరూపమునఁగాక, వాక్పేటికలలోనే యుండెను. చీనా దేశములో 'మింగ్టి' (క్రీ. శ. 38-76) కాలములో భారతవర్షమునుండి చీనాకొక బౌద్ధ భిక్షువువచ్చి, బౌద్ధమత ధర్మములబోధించెను. ఈరాజు ఒక రాయబారవర్గమును, మధ్యాసియా గుండ, 'ఖోటాను'కు బౌద్ధ ధర్మ వ్యాప్తికిఁ గావలసిన సామగ్రిని దెండని పంపెను. వారు భారతభూమికేగి 'కశ్యపమాతంగుని,' 'ధర్మరక్షకుని' (గోభరణుఁడు కాఁబోలు) దోడ్కొని, కొన్ని బౌద్ధ విగ్రహములు, బౌద్ధ ధర్మశాస్త్రములు గైకొని చైనాకుఁ దిరిగివచ్చిరి. బౌద్ధమత వ్యాప్తికిఁ గట్టించిన యొక యాలయమునవారు కూర్చుండి గ్రంథములను చైనీయభాషలోనికి మార్పసాగిరి. వీరుకాక, తర్వాత

క్రీ. శ. 4 వ శతాబ్ద ప్రాంతమున బౌద్ధాచార్యులగు 'కుమారజీవుఁడు' (క్రీ. శ. 383-412) 'బుద్ధభద్రుఁడు' చైనాకేగి, అచట చైనీయ భాష నేర్చి, అనేక ధర్మగ్రంథములను చైనీయ భాషలోనికి మార్చిరి. పైనలు గురు మార్చిన బౌద్ధ గ్రంథములు చైనీయదేశమున, భిక్షు సంఘము లలోఁగలవు. వీనినిబట్టి క్రైస్తవ శకారంభకాలమునుండి భారతవర్ష మున వ్రాఁత ప్రతులు కలవని, అవి విదేశములకుఁ దీసికొనిపోఁబడు చుండెనని తెలిసికొనవచ్చును.

క్రీ.శ. 381లో వెళ్ళిన 'కాబూలు'నివాసి బౌద్ధశ్రమణుఁడు 'సంఘ భూతి' చీనా భాషలో మూఁడు బౌద్ధ గ్రంథముల ననువదించెను. ప్రసిద్ధ శ్రమణుఁడు 'కుమారజీవుఁడు' క్రీ. శ. 383 లోఁ జీనాదేశమేగి, అచట క్రీ. శ. 412 వఱకుండి, ఆయన, సుఖావతివ్యూహ, వజ్రచ్ఛే దికా, మున్నగు అనేక బౌద్ధగ్రంథములను చీనాభాషలోని కనువాద ముచేసెను, 'బుద్ధయశస్సు', 'పుణ్యతర' 'విమలాక్ష,' నామక బౌద్ధ భిక్షువులు 'కపిల' నుంచి చీనాకేగి, ధర్మప్రచారము చేసిరి. (క్రీ. శ. 403-406) వీరి తర్వాత చీనారాజు కోర్కెపై శ్రమణుఁడు 'ధర్మరత్న' యనువాఁడు (క్రీ. శ. 414) మధ్య భారతమునుండి చీనాకేగెను. 'బుద్ధజీవ,' 'ధర్మమిత్ర,' 'కాలయశస్సు' 'బుద్ధభద్రుఁడు,' 'గుణవర్మ' 'సంఘువర్మ,' గుణభద్రుఁడు' ఇత్యాది.బౌద్ధ విద్వాంసులు, ఇటనుండి గుప్తయుగములో బౌద్ధ ధర్మ ప్రచారార్థమై, చీనాదేశమేగిరి. 100 వీరు తమతోఁబాటు బౌద్ధ గ్రంథములఁ దోడ్కొనిపోయి యుండ వచ్చును. కాని యవి ఏవియో, తెలియకున్నవి. భిక్షువగు 'కుమార జీవుఁడు' దాదాపు' 100 సంస్కృత గ్రంథములు చైనీయ భాషలో నికి మార్చెనని, అనేక శిష్యులఁజేర్చెనని, అందు 'పాహియాను' ఒకఁ డని తెలియుచున్నది. అప్పటికి వేదములు బ్రాహ్మణములుకాక మిగత గ్రంథములు వ్రాయఁబడుచుండెను.

చైనాలో బౌద్ధధర్మగ్రంథములప్రతులు భ్రష్టములై, శిథిలములై యుండెను, ముఖ్యముగా 'పాహియాను' వినయపిటకమును గాంచి

100 (Hindi)—Ganga prasad Mehtha— Chandragupta Vikramaditya—P 100.

చింతాక్రాంతుం డాయెను. దీనిని దెచ్చుటకు, ఇతర బౌద్ధగ్రంథములు గైకొనుటకు భారతవర్షమునకు వచ్చెను. (క్రీ. శ. 405-411) వీనిని గైకొని భిక్షుసంఘములోఁ బ్రచారము చేయఁదలంచెను. ఆ కాలమున 'దీర్ఘగామ, సంయుక్తగామ, సంయుక్తసంచయ పిటకము' 'హాన్' లో లేవు. పాహియాను, భారతవర్షములోని 18 శాఖలను బేర్కొనెను. వీనిలో కర్మకాండములో భేదము కలదు. కాని, దర్శనభేదము లేదు. అప్పటికి నాల్గు ముఖ్యనికాయములు కలవు.

| | | |
|---|---|---|
| 1. ఆర్యసంఘిక నికాయము | — | లక్ష శ్లోకములు |
| 2. ఆర్యస్థవిర నికాయము | — | ,, |
| 3. ఆర్యసమ్మతి నికాయము | — | ,, |
| 4. ఆర్యసర్వాస్తివాదనికాయము | — | తెలియదు. |

పాహియానుకు మధ్యహిందూస్థానములో నెచట వ్రాంతప్రతులు లభింపలేదు. అనేకప్రయత్నములు చేసినమీఁదట, చాల కష్టముతో, పాటలీపుత్రములో నీక్రిందివ్రాంతప్రతులను సంపాదించెను. 1. మహాసంఘికనికాయముయొక్క వినయపిటకము. 2. ఇంకొక నికాయముయొక్క వినయపిటకము. 3. సర్వాస్తివాదనికాయముయొక్క వినయపిటకము. 4. సంయుక్త ధర్మహృదయము. 5. ఇంకొక అజ్ఞాత నికాయముయొక్క సూత్రపిటకము. 6. పరినిర్వాణ వైపుల్యసూత్రము. 7. మహాసంఘికనికాయముయొక్క 'అభిధర్మపిటకము':

'పాహియాను' మూఁడేండ్లుండి, పాటలీపుత్రములో గ్రంథసంగ్రహము చేసికొనుచు, సంస్కృతగ్రంథముల నభ్యాసము చేయుచు, వినయపిటకముయొక్క ప్రతి లిపిని వ్రాసెను. తామ్రలిప్తి సంఘారామములో రెండేండ్లుండి, సూత్రముల ప్రతిలిపులు లేదా అనువాదములు చేసికొనుచుండెను. సింహళములో రెండేండ్లుండి, వెదకి 1. మహీశాసక నికాయము యొక్క వినయపిటకము. 2. దీర్ఘాగమ. 3. సంయుక్తాగమ. 4. సంయుక్తసంచయ పిటకము (బహుశః క్షుద్రక పాఠము), ఈవ్రాంతప్రతులఁ గైకొని, చీనాకుఁ బోవు వ్యాపారినావపై నెక్కి పోయెను. పోవునపుడతని నావకు రంధ్రముపడి, యపాయము కల్గెను. యాత్రికులందరు వస్తువులఁ బాఱ వేయుచుండిరి. 'పాహియాను

కూడ తనపల్లెము, ముంత, మఱికొంతసామానును దీసి సముద్రములోఁ బాఱవైచెను. ఎంతయోకష్టపడి సంపాదించిన బౌద్ధ ధర్మ గ్రంథములు, పోవునేమోయని భయవిహ్వల చిత్తుఁడాయెను. మనసులోనిట్లు తలపోయసాగెను. "హృదయములో నవలోకితేశ్వర ధ్యానము చేసితిని. 'హాన్ దేశమునుండివచ్చిన భిక్షుసంఘమువారి ప్రాణముల నర్పించి వైచితిని. ధర్మగ్రంథములు వెదకుకొనుటకు, దూరయాత్ర చేసితిని. నీ తేజఃప్రతాపముల నొసంగి, త్రిప్పించి నీస్థానములోఁ జేర్పింపుము. పదమూఁడురోజులు భయంకరమైన తుపానువీచుటచేత 'పాహియాను' ప్రాణముకంటె కష్టంగడు ప్రియంబైన ధర్మగ్రంథములఁ గాపాడుకొనుచు స్వదేశముఁ జేరెను.[101] పాహియాను గృహమునకుఁ జేరినపిమ్మట, బుద్ధభద్రుఁడను బౌద్ధభిక్షువును పాహియానును, భారతభూమినుండి తెచ్చిన అనేక గ్రంథముల ననువాదముఁ జేసి యుండిరి. భారతవర్షీయ యాత్రావృత్తాంతమును పాహియాను, వెదురుబద్దలపైనవ్రాసి భారతీయులకు మహోపకారం బొనర్చెను.

'పాహియాను' పోయిన యొకశతాబ్దమునకుఁదర్వాత 'సుంగయాన్' 'హుయిసాంగు' లను నిరువురు చైనీయ లేఖకులు, మహారాణి ఆజ్ఞచేత క్రీ, శ, 517-518 లో భారతభూమికి, మహాయానగ్రంథముల వెదకి కొనుటకు వచ్చిరి. క్రీ. శ. 521వ సంవత్సరములోఁదిరిగిపోయిరి. 'సుంగయాను'కు మహాయాన సంబంధములగు 170 గ్రంథములు లభించెను. అప్పటికి బౌద్ధులలో వ్రాఁతప్రతులు వ్రాసెడి ఆచారము ప్రబలి పోయినది. 'హుయిని'యను 'కొరియావాసి' క్రీ. శ, 638 లో 'చాంగగాన'నుండి భారతవర్షమునకు వచ్చెను. నాలందా విద్యాలయములో నధ్యయనము చేసెను. ఈయన తన 70వఏట నాలందాలోనేమరణించెను. కాని ఈయన స్వహస్తముతో వ్రాయఁబడిన వ్రాఁతప్రతు లనేకములు, స్తూత్రములు 'ఇత్సింగు'కు లభించెను. ఇట్లే 'లోయాంగు' వాసియగు 'ఈహుయీ' అను యాత్రికుఁడు భారతభూమికి బౌద్ధ ధర్మ గ్రంథములకొరకు వచ్చి, అనేక గ్రంథముల ప్రతులఁ గైకొని తిరిగి వెళ్లిపోయెను. 'సుయేనతా' యను మఱియొక

101—Jagan Mohan Varma—Pahiyan. (Hindi) P 49.

చైనీయుఁడు, నాలందాలో 10 సంవత్సరములుండి, తనతోఁబాటు అనేక గ్రంథములఁ గైకొని 'చీనాకు తామ్రలిప్తినుండి పోయెను.[102]

చైనీయ యాత్రికులలో ముఖ్యుఁడు 'హుయాన్‌సాంగు'. ఈయన వచ్చునాఁటికి భారతభూమిలోఁ దాటియాకులపైన, భూర్జత్వక్కుల మీఁద వ్రాయఁబడిన గ్రంథములు లెక్కకు మిక్కుటముగా నుండెను. 3000 మైళ్ళదూరమీయన పయనముసల్పి 657 లిఖితంబులౌ సంస్కృత గ్రంథములఁ గైకొని పోయెను.[103] ఆయన గైకొనిపోయిన గ్రంథంబు లియ్యవి.

| | | | |
|---|---|---|---|
| మహాయాన సూత్రములు. | 224 | మహీశాసక శాఖ సం. | 22 |
| శాస్త్రములు | 192 | సర్వాస్తివాదిని | 67 |
| స్థావిర శాఖసూత్రములు, శాస్త్రములు, వినయము | 14 | కాశ్యపశాఖ | 17 |
| మహాసంఘిక. | 15 | ధర్మగుప్తశాస్త్ర సం. | 42 |
| వినయశాస్త్రములు అదే సంఖ్యసమ్మతీయ శాఖసంబంధములు | 15 | హేతువిద్యాశాస్త్రసం, | 36 |
| | | శబ్దవిద్య సం, | 13 |
| | | మొత్తము | 657 |

సింధునదిలో 'హుయాన్‌సాంగు' ఏనుఁగుమీఁద నెక్కి ఆవలి ఒడ్డునకుఁ జేరెను. ఆయన గ్రంథములు మాత్రము 20 గుఱ్ఱముల మీఁద నెక్కించి ఏటియొద్దకుఁ జేర్చిరి. నదిలోనున్న ఒక నావలో గ్రంథములఁ బెట్టించి 'హుయాన్‌సాంగు' పుస్తకములతోఁబాటొక మనుష్యుని రమ్మని తాను ముందుపోయెను, పడవ నదీగర్భము లోనికిఁ జేరిన పిమ్మట నొక వైపున కొరుగుటచేత, పుస్తకముల రక్షణకున్న మనుష్యుఁడు హఠాత్తుగా నదిలోఁ బడిపోయెను; కాని ఇతర ప్రయాణికు లాతని ప్రాణముల రక్షించిరి. దురదృష్టవశాత్తు 'హుయాన్‌సాంగు' శ్రమపడి సంపాదించుకొన్న గ్రంథములలో 50

102—Jagan Mohan Varma—(Hindi) Sungayun—P 3,4,9, 12 etc'

103—T. Watters---On yuanchwang's travels. Vol I. P 21.
"657 books---Made of trimmed leaves of palm and birch bark, strung together in layers, They are all in Sanskrit."

వ్రాఁత ప్రతులు, సూత్రములు, సింధునదీజలముల పాలాయెను.[104] 'కపిశ' రాజీవృత్తాంతంబంతయు నడిగి తెలిసికొనెను.[105] హుయాన్‌సాంగు మఱి 50 దినములుండి, కొండఱు లేఖకులను ఉదయనుని రాజ్యమునకు 'కాశ్యపీయశాఖాసంబంధమగు త్రిపిటకములు' వ్రాయించుకొనుటకుఁ బంపివైచెను, దీనినిబట్టి పెక్కు వ్రాఁతప్రతులు భారతవర్షములోఁ గలవని యెఱుంగవచ్చును. మొత్తముమీఁద భారతభూమినుండి పోయిన వ్రాఁత ప్రతులలో 6000 నుండి 8000 వఱకు చైనీయభాషలోని కనువాదమైనట్లు తెలియుచున్నది. జపానులోఁగూడ క్రీ. శ. 6వ శతాబ్దినాఁటి తాటియాకుల సంస్కృతవ్రాఁతప్రతికాన్పించుటచూడ, భారతీయ వ్రాఁతప్రతులు చైనాకేకాక జపానుకుఁగూడ నేగెనని యెఱుంగవచ్చును. 10వ శతాబ్దినాఁటి వ్రాఁతప్రతి యొకటి నేపాలులో లభ్యమైనది.

హుయాన్‌సాంగు జాగ్రత్తగా గ్రంథముల నన్నిటిని జేర్చుకొని, ఒక మఠములోఁ గూర్చుండి అనువాద మారంభించెను. 2 లక్షలశ్లోక ముల 'ప్రజ్ఞాపరిమిత సూత్రములు' ఆయన చైనీయభాషలోనికి 74 పుస్తకములలో 1335 అధ్యాయములలో, 16 సంవత్సరములకాలము మార్చెను. ఇంక ననేక సూత్రములనుసైత మనువాదముచేసి మరణించెను. హుయాన్‌సాంగు ఆంధ్రులనుగూర్చికూడ వ్రాయుచు'ఆంధ్రుల వాక్కు మధ్యహిందూస్థానములోని వారివలె లేదు, కాని వారి వ్రాఁత పద్ధతి వారినుండియే గైకొనఁబడినదని' వ్రాసెను.[106]

ఆయన కాలమునఁ బరిషియాలో రెండు మూడు బౌద్ధసంఘారామములు కలవు. అందులో ననేక భిక్షువులు 'సర్వాస్తివాదిను'కుఁ జెందిన 'హీనయాన' బోధలను జదువుకొనుచుండిరని తెలియుచున్నది. వీనిలోఁ బెక్కు తాటియాకుల ప్రతు లుండవచ్చును. హుయాన్‌సాంగు భారతవర్షములో నున్నపుడు (క్రీ. శ. 7వ శతా.)

104---Samuel Beal---Life of Hiuen---Tsiang-by Hwiu Li."P 180.
105 Ibid---P 180, 191 and 192.
106 T. W. Watters-On Yaun Chwang's-travels in India---Vol. II p 209 "Their mode of speech differed from that of mid India, but they borrowed the same system of writing."

'థాన్మి' (Thon-mi) అనే టిబెటీయ రాయబారి టిబెటురాజు ఆజ్ఞ చేత మన దేశమునకు వచ్చి, కొలఁది వర్షముల కాలముండి 'లిపిదత్తు' డను బ్రాహ్మణునియొద్ద 'దేవవిదసింహుఁ' డను పండితునియొద్ద సంస్కృతము నేర్చుకొని టిబెటు వెళ్లుచు ననేక బౌద్ధమతసంబంధ మగు వ్రాఁతప్రతులను గైకొనిపోయెను ఈయనయేటిబెటులో లిపిని ప్రవేశపెట్టెనని యెఱుఁగవచ్చును. ఆయనయే స్వయముగా ననేక బౌద్ధ గ్రంథములను 'టిబెటీయభాష'లోనికి మార్చెను. పిమ్మట భారతీయ బౌద్ధ విద్వాంసులు పలువురు త్రిపిష్టపమేగి, బౌద్ధ గ్రంథములను సంస్కృతమునుండి టిబెటీయభాషలోనికి మార్చిరి. ఇట్లే 'బుద్ధఘోషుఁడను బౌద్ధ విద్వాంసుఁడు కూడ ననేక బౌద్ధ గ్రంథములను బర్మాకుఁ బంపెను. ఈవిషయములఁ జూడఁగా ఫాహియానుకాలమునాఁటికి వ్రాఁతప్రతులు తక్కువగా నున్నను హుయాన్‌సాంగు, ఇత్సింగుల కాలమునాఁటికి (క్రీ.శ. 7వ శతాబ్దము), భారతభూమిలో విస్తారముగా వ్రాఁతప్రతులు తాటియాకులపైన, భూర్జత్వక్కులపైన వ్రాయుచుండిరని చెప్పవచ్చును.

ఇత్సింగు అను చైనీయ లేఖకుఁడు భారతవర్షమునకువచ్చి, నాలందావిశ్వవిద్యాలయములో ననేకవర్షములు చదువుకొనెను. ఈయన హోనానురాష్ట్రమునుండివచ్చి ఈదేశములోఁ గొన్నాళ్ళుండి తిరిగి పోవుచు 5లక్షల శ్లోకములుగల 400 సంపుటములను సూత్ర, వినయ,అభిధర్మశాస్త్రసంబంధమగు మూలగ్రంథములనుగైకొనిపోయి 56 సంపుటములను, 250 అధ్యాయములుగల, 230 సంపుటములుగా ననువాదముచేసి శాశ్వతయశఃకాముఁ డాయెను. ఆయన తోడ్కొని పోయిన అన్నిగ్రంథముల ననువాదము చేసినచో, 300 శ్లోకములుగల 1000 సంపుటములయ్యెడివని తెలియుచున్నది. ఆయనకుఁ గావలసిన గ్రంథములఁ దోడ్కొని, ఇత్సింగు వెనుకకుమరలెను.107 ఆయన చిరకాలమనోరథము సిద్ధించెను. భారతభూమిలోఁ గావలసిన వ్రాఁత

107 J. Takakusu---A record of Buddhist kingdoms (Itsing) 33. "After having collected the scriptures, I began to retrace my steps to come back."

ప్రతులన్ని లభించుటచేత, సంఘారామములలో విశేషముగా గ్రంథములు వ్రాయుచుండిరని తేలుచున్నది.

ఇత్సింగు కాలమున, భారతీయ విద్యార్థులు లేతరికములోనే మిగతపాఠములతోఁబాటు, జాతకమాలను నేర్చుకొనుచుండిరి. జాతకమాలయొక్క వ్రాఁతప్రతులు భారతభూమిలో విశేషముగానున్నవని ఇత్సింగు వ్రాసెను. ఒకమారు శిలాదిత్యుఁడు వాఙ్మయమునందభిలాష గలవాఁడై, ఇట్లు సభలో సంబోధించెను. 'పద్యమునందభిమానముగల మీలోనివారు, రేపుఉదయము, మీస్వకీయమగు పద్యములఁ గొన్నిటిని గైకొనిరండు.' వానినన్నిటిని ప్రోఁగుచేసి చూడఁగా నవి 500 కట్టలాయెను, వానిని బరీక్షించిచూడఁగా, వానిలో ననేకములు జాతకమాలలుగాఁ గాన్పించినవి.108(a) దీనినిబట్టి ఆకాలపు వ్రాఁత ప్రతులలో బౌద్ధుల జాతకమాల లధికముగా నున్నవని వ్రాఁత ప్రతులు అసంఖ్యాకములని తెలియ వచ్చుచున్నది.

1907లో డాక్టరు స్టెయిన్ ఇట్లు వ్రాసెను 'ప్రాచీనఖోటాను అను మధ్యాసియా దేశములో భూగర్భశాస్త్ర పరిశోధనలనుబట్టి జాగ్రత్తగా దాఁచఁబడిన పత్రములనేకములు లభించినవి.' క్రీ. శ. 8వ శతాబ్దము నాఁటి చైనీయ రాజాస్థానమునకుఁ జెందిన కాగితములు, ఖోటానుకు ఈశాన్యముగా, 'దండన్ నిలిక్‌లో' నాకాలమునాఁటి గొఱ్ఱెలకాపరి ఫిర్యాదుసంబంధమగు పత్రము, మహాయాన బౌద్ధ ప్రతులు క్రీ. శ. 7, 8 శతాబ్దములనాఁటివి, గుప్తరాజుల లేఖన పద్ధతిలో వ్రాయఁబడిన పత్రములు కొన్ని లభించినవి. చైనీయ టర్కీస్థానములోని 'కుచ' యనుచోట బౌద్ధస్తూపములో దాఁచఁబడిన యొక పురాతన వైద్యగ్రంథపు వ్రాఁతప్రతి 7 పుస్తకములు గలది 1890లో లభించినది, అది క్రీ. శ. 350 నాఁటిది. పై యేడింటిలో 3 వైద్య

108 (a) J. Takakusu—Itsing P. 163—In India students learn this epistle in verse early in the course of instruction——Once king Siladitya who was exceedingly fond of literature commanded saying, "ye, who are fond of poetry bring and show me some pieces of your own, tomorrow morning. "When he had collected them, they amounted to 500 bundles and on being examined, it was found most of them were Jatakamalas."

గ్రంథములు, సంస్కృతములో గలిసిన ప్రాకృతములోనివి వ్రాయఁ బడినవి. భూగర్భశాస్త్ర పరిశోధనలు, చైనీయ లేఖకుల వ్రాతలవలన భారతభూమిలోను, బరిసర దేశములలోను మధ్యకాలములో వ్రాత ప్రతులువిశేషముగా నున్నట్లు గాన్పించుచున్నది.

## చతుర్థాధ్యాయము

ఈజిప్టు, అస్సీరియా, గ్రీసు, రోము దేశములలో గ్రంథాలయములు—భారత దేశ గ్రంథాలయములు— ప్రతి విద్వాంసుఁడొక సజీవ గ్రంథాలయము— గ్రంథాలయ ముల చరిత్రము— నాలందా, ఉదంతపురి మున్నగు గ్రంథాలయముల నాశనము— ముఖ్యమగు గ్రంథాలయములు—తంజావూరు ఆంధ్రనాయకరాజుల గ్రంథాలయము— దీని ఉచ్ఛస్థితి.

భారత భూమిలో లిపి, లేఖనసామగ్రి, గ్రంథములు, గ్రంథాలయ ములు చాల నాలస్యముగా వచ్చినట్లు గాన్పించుచున్నది. విదేశము లలో నట్లుగాకుండ, చాల ప్రాచీనకాలమునుండి గ్రంథములు, గ్రంథా లయములు కాన్పించును. బంకమట్టిబిళ్ళలు, పాపిరసు, తోళ్ళు మున్నగుఁగల సామగ్రిని విదేశీయులు వ్రాత కుపయోగించుచుండిరి. ఈజిప్టు సమాధులలో లభించిన గ్రంథములన్ని 'పాపిరి'పైన వ్రాయఁ బడియున్నవి. ఆకాలపు గ్రంథాలయములలోని గ్రంథములు 'పాపిరి' మీఁదనే లిఖింపఁబడినవి. ఈజిప్టురాజగు 19వ రాజవంశమువాఁడగు 'రామేశస్' (Ramesus క్రీ.పూ. 14వ శతా.)ను గొప్ప గ్రంథాలయ మున్నట్లుఁ గాన్పించుచున్నది. ఈయన 67 ఏండ్లు పాలించి, ఈజిప్టు నుచ్ఛస్థితికిఁ దెచ్చెను.108 క్రీ,పూ. 5వ శతాబ్దిమధ్యములో 'ఎథీనియ

---

108 F. Harrison--A book about books. p. 142 "It i recorded that Rameses who reigned over Egypt in the 14th century B.C. had a large library. When the Athenians overran Egypt in the middle of the 5th century B. C., they found in temples and royal tombs more than 36000 such books. In spite of disasters due to invaders the libraries of Egypt, continued to be famous. It was with their help that in the third century B, C., 72 Egyptian Jews compiled a translation of the Old Testament from Hebrew into Greek, known as the Septuagint (70 approximate number.)

నలు' ఈజిప్టును జయించినపుడు, దేవాలయములలోను, రాజులసమా
ధులలోను 36000 కు పైఁగా గ్రంథములు లభించెను. శత్రువులవలన
ననేక విపత్తులు గల్గినను, ఇగు ప్త గ్రంథాలయములు ప్రఖ్యాతిచెందు
చునేయుండెను. క్రీ.పూ. 3వ శతాబ్దములో వారి సహాయముచేతనే
72మంది 'ఈజిప్టుదేశ యూదులు ప్రాఁతనిబంధనను, హీబ్రూ నుండి
గ్రీకుభాషలోనికి తర్జుమాచేయసాగిరి. దీనిని దాదాపు 70 మంది
రచించుటచేత 'సెప్తుయగింట్' (Septuagint) అని పేరువచ్చినది.

క్రీ. పూ. 2500 - 2000 కాలమున మట్టిబిళ్లలపైన వ్రాయఁబడిన
గ్రంథములు బాబిలోనియా, ఖాల్డీయులయొక్క 'ఊర్' లోను నింక
నితర నగరములలోఁ గాన్పించెను. 'అస్సీరియా'కు ముఖ్యనగరమగు
'నినెవా' (Ninevah) లో 10000 బంకమట్టి బిళ్ళలు, ఇటుకరాలు
కాల్చినవి కాన్పించినవి. ఈబిళ్ళలు ఒకటి మొదలు పండ్రెండు అంగు
ళములవఱకు, ప్రక్కలు గలిగి, చతురస్రాకారమున నున్నవి. వీనిపైన
'అస్సీరియా దేశచరిత్రము' లభించినది. ఇవి యన్నియుఁగలసి గొప్ప
గ్రంథాలయముగా నేర్పడినది.

'అస్సీరియా' రాజు 'అసురవాణిపాలుఁడు' (క్రీ. పూ. 668-626)
బంకమట్టిబిళ్ళలపైననే వ్రాయుచుండెను. ఈయనకు 'సర్దనపాలసు'
అను పేరుకూడఁగలదు. ఈయన గ్రంథాలయములో వాడఁబడిన
'సింధు' అను శబ్దము భారతీయుల ప్రత్తి'కి వాడఁబడినట్లు తెలియు
చున్నది. ఈయన గొప్ప కృషీవలుఁడు; భారతదేశములోని చాల
రకముల మొక్కలఁ దెప్పించుట కీయన ప్రయత్నము సల్పెను.
అందులో ప్రత్తిమొక్కలుకూడఁ గలవు.[109]

---

109 H.G. Rawilson—Intercourse between India and the western world. p 2 "The word Sindhu found in the library of Assurbanipal (668—626 B. C.) is used in the sense of Indian cotton—— Assurbanipal is known to have been a great cultivator and to have sent for Indian plants including the wool bearing trees of India."

P. Giles—Cambridge history of India—chap. III—"which was found in the library of Assurbanipal (about 700 B.C.) in which occurs the name 'Assara—Mazas.')

ఈయన కాలములో బాబిలనులోఁ జాల జ్ఞానాభివృద్ధి కల్గెను. ఈయన 'అస్సీరియా'వాఁడు; అయినను 'బాబిలనునందు హెచ్చుగా జాతీయత గలవాఁడాయెను. మెసపటోమియాలోఁ జాలకాలమునుండి వ్రాఁతకు మట్టిబిళ్లలు వాడుచుండిరి. ఈ మట్టిబిళ్లల గ్రంథములనే పుస్తకాలయముగా నేర్పఱచెను. దాని నిపుడు త్రవ్వితీయఁగా, ననేక చారిత్రిక విషయములు బయల్పడినవి, ప్రపంచములోని చారిత్రికవస్తుజాలములో నిది విలువగలది, అని వెల్సుపండితుఁడు వ్రాసెను. ఈరాజు గొప్ప పరాక్రమశాలిగాఁ గాన్పించుచున్నాఁడు. క్రీ. పూ. 660 వ సంవత్సర ప్రాంతమున నీరాజు ఈజిప్టునుకూడ జయించి యుండెను. ప్రాచీన జనుల జీవిత సంస్కృతుల నెఱుఁగవలెనన్న నిట్టి యమూల్య గ్రంథసామగ్రి మన కెంతయో తోడ్పడుచుండును.

గ్రీసు దేశములో క్రీ. పూ. 6వ శతాబ్దిలో యవనభూపతి 'పెరిస్ట్రాటస్' (Peristratus) ధనవంతులపై పన్నులు విధించి, బీదల కుద్యోగములఁ గల్పించెను. క్రీ. పూ. 1000 ప్రాంతమున 'హోమరు' అను అంధకవి రచించెనని చెప్పఁబడు పద్యజాలముల నేరికూర్చి, వాఙ్మయమునం దభిలాషఁ గన్పఱచెను. క్రీ.పూ. 7 లేక 8 వశతాబ్దములోఁ దమ పరిసర వాస్తవ్యులనుండి అక్షరమాలను నేర్చి చాలకాలము నుండి ముఖస్థమైయున్న ఇతిహాసకావ్యము లగు 'ఇలియడ్, ఒడెస్సా'లను గ్రీకులు లిఖితరూపమునకుఁ దెచ్చిరి.

క్రీ. పూ. 3 వ శతాబ్దమునుండి ఈజిప్టులోని అలెగ్జాండ్రియా గ్రంథాలయము చాల ప్రఖ్యాతిగాంచినది. యవనభూపతి అలెగ్జాండరు ఈజిప్టును జయించి మిశ్రజనుల తిరుగుబాటు లేకుండ నుండుటకు క్రీ. పూ. 332లో నీ నగరమును గట్టించెను. ఈ గ్రంథాలయమునకు 'ఎరటోస్థినస్' (Eratosthenes B. C. 240—196) 24 వర్షముల కాల మధ్యక్షుఁడుగా నుండెను. ఈయన యవనులతో భారతీయులను గూర్చి హెచ్చుగా ప్రస్తావించుచుండెను.110 ఈ యవనులు జ్ఞానాధి

110 H. G. Rawilson—Intercourse between India and the western world. P 92 "The knowledge possessed about India by the Alexandrian Greeks, was chiefly due to Eratosthenes, the learned president of the library from 240---196 B. C.

కులు, తత్వజ్ఞు లగుటకు కారణము భారతీయులే యని చెప్పుటకుఁ బ్రమాణములు గలవు. అలెగ్జాండరు భూపతి క్రీ.పూ. 323 లో జ్వర పీడితుఁడై చనిపోయెను. సామ్రాజ్యము విచ్ఛిన్నమై పోయెను. 'సెల్యూకస్ ప్రాచ్య సామ్రాజ్యము నేలుచుండెను; 'టాలమీ' అను సేనాని ఈజిప్టును వశపఱచుకొనెను. 'టాలమీ' రాజు ఈ గ్రంథాలయమును స్థాపించియుండెను. 'ఎరటోస్థినస్' గణిత శాస్త్రమును తన తోడ్పాటునకుఁ గైకొనివచ్చెను, మొదటి శాస్త్రీయ భూగోళ శాస్త్ర మునకుఁ బ్రారంభకుఁ డీయనయే. ఈయన బహుగ్రంథావలోకనము చేసినవాఁడు. 'ప్లిని' యను లేఖకుఁడు (క్రీ.శ. 23-79) కూడ 2000 గ్రంథములకు పైగా గ్రంథాలయములలోఁ జదివి 'జీవకోటి వర్ణనము' (Natural History) అను గ్రంథమును క్రీ.శ. 77లో వ్రాసెను. ఒక టవ 'టాలమీ' క్రీ. శ. 306 లోఁ కళలు, విజ్ఞానము వృద్ధిచేసి, చిత్రవస్తు ప్రదర్శనశాల నేర్పఱచి, అందు రాజభవనముల, గ్రంథాలయముల నిర్మించి, విద్వాంసుల, తత్వవేత్తల, కవులఁబోషించెను. వారి బసలు గ్రంథాలయముల చెంతనే కాన్పించుచున్నవి. ఈ అలెగ్జాండ్రియా గ్రంథాలయము శాస్త్రీయవిద్యల కాలవాలమైనది. ఇచట గ్రంథములకు ప్రతులుకూడ వ్రాసి, యమ్ముకొనుచుండిరని, అనేక లేఖకులకుఁ బనిగల్గుచుండెనని, ఇచట జ్ఞానాంకురము కల్గినట్లు చటంగల్ల లేదనిపించుచున్నది. క్రొత్త గ్రంథములను సరిగా తయారు చేయఁజాలకుండిరి. పీలికలతోఁ గాగితములు చేయువిధము వారికి తెలియదు. కాగితపరిశ్రమ కారంభకులు చైనీయులు. క్రీ. శ.9వశ.కుగాని ఈపరిశ్రమ యూరోపుఖండమునకుఁ బ్రాకలేదు. ఆకాలపువారు తోళ్లు పెరసు, చెట్లబెరళ్లు, చెక్కలు మున్నగు వ్రాతసామగ్రిని వాడుచుండిరి. వానిని పుస్తకముగాఁ గూర్చుటకు, తెరచి చదువుటకుఁ గష్టముగానుండెను. కాగితములు లేనందున, అచ్చుపద్ధతి తెలిసిన లాభము లేకుండెను. అలెగ్జాండ్రియాలోని గ్రంథములు చాల

---

Surendranath Mazundar M.A. Cunningham's ancient Geography of India. (1924) " About 240 B. C. Eratosthenes who was placed in charge of the great library established by the Ptolemies at Alexandria brought mathematics to his aid and laid the first foundation of a really scientific geography."

ప్రియములుగానుండెను. శ్రీమంతులు, విశేషము పల్కుబడిగలవారే గ్రంథములుకొని వాడుచుండిరి. మామూలుజనుల కందుబాటులో లేనట్లు కాన్పించుచున్నది. 1000ఏండ్లువర్ధిల్లిన ఇట్టి గ్రంథాలయమును దర్వాత, అరబ్బులు క్రీ. శ. 7వ శతాబ్దమున దగ్ధముచేసిరి, గ్రీకు విద్వాంసులగు, యూక్లిడు ఎరటస్థనిసు, అర్కిమిడీసు, ప్లేటో, అరిస్టాటలు మున్నగువారు క్రీస్తునకుఁ బూర్వమెన్నియోశతాబ్దములనుండి గ్రీకుగ్రంథాలయములు, కళాశాలలు లెస్సగా నుపయోగించుకొనుచుండిరి. 'అలెగ్జాండ్రియా'లోఁ గాకుండ 'ఆసియామైనరు'లో 'పెర్గామస్'లోఁగూడ పెద్ద గ్రంథాలయములు కాన్పించుచున్నవి,

'రోమ్ (Rome) దేశము'లో 'జూలియస్ సీజరు' క్రీ. శ. 1వ శతాబ్దములోఁ బ్రథమ గ్రంథాలయమేర్పఱుపఁదలంచెనుగాని, ఆయన హత్యతో నా ప్రయత్నమాగిపోయెను, అందుచేత 'రోములో' ప్రథమ గ్రంథాలయమేర్పఱచిన గౌరవము 'లాటిన్' లేఖకుఁడగు 'వారో' (Varro)కు దక్కినది, 'సీజరు' హత్యజరిగిన కడుకొద్దికాలములోనే 'ఈగ్రంథాలయ మేర్పఱుపఁబడెను. 'వారో'కు 'సిసిరో' లేఖలిఖించుచు "మనుజుని గ్రంథాలయమతని ఆరామమైనచో నాయనకుఁ గావలసినది లేదు' అనివ్రాసెను. 'అగస్టసు చక్రవర్తి' రెండు గ్రంథాలయముల నేర్పఱచెనని, అందొకటి తనసోదరి. 'అక్టేవియా'పేర స్థాపింపఁబడినట్లు తెలియుచున్నది. 'నీరో' (Nero) కాలమున గ్రంథాలయములు అగ్నిలో దగ్ధమైపోయెను. మొత్తముమీఁద క్రీ. శ. 4వ శతాబ్దము నాఁటికి 'రోము' దేశములో 28 గ్రంథాలయములున్నట్లు గాన్పించుచున్నది.111

---

111 Frederick Harrison—A book about books. p 143 "The honour of erecting and arranging the first library in Rome, fell to the Latin writer, Varro, not long after the assassination of Caesar—It was to Varro, that Cicero addressed the well known saying 'If a man's library is his garden, he lacks nothing' The emperor Augustus founded two libraries, one in memory of his sister 'Octavia'---At the time of Nero, libraries perished in fire. There are said to have been 28 libraries at Rome in the 4th century."

బహుకాలమునకుఁగాని భారతవర్షమున గ్రంథాలయము లారంభ మైనట్లు గాన్పింపదు. క్రీ.పూ. 7వ శతాబ్దమున నేర్పడిన 'తక్షశిలా విద్యాలయమున' గ్రంథాలయము కాన్పింపదు. గ్రంథములతోఁగాని, గ్రంథాలయములతోఁగాని, యవసరమే లేదని ప్రాచీన బ్రాహ్మణ విద్వాంసులు తలంచుచుండిరి. ప్రతిభాశాలి యగు బ్రాహ్మణుఁడే, యొక సజీవగ్రంథాలయము (Living Library) గా నుండెను. మూలగ్రంథములు వాక్పేటికలలో నుంచుటయే శ్రేష్ఠమని, నకలు ప్రతులు వ్రాయుట లాభము లేదని, వల్లింపు పద్ధతితో మఱియొక పద్ధతి సాటిరాదని, దాని కలవాటుపడిన వారగుటఁ జేసి, ఇంకొకపద్ధతి వారి కవసరము లేకుండెను.112 ఈకారణముచేత గ్రంథములు, గ్రంథాలయము లేర్పడుచుండుట లేదు. 'ఇత్సింగు' కాలమునాఁటికి కూడ నెట్లు వేదాదులు వల్లించుచుండిరో మన మెఱింగియుంటిమి. క్రీ. శ. 7వ శతాబ్దములోని క్షత్రియజయసేనుఁ డను 'సజీవగ్రంథాలయము' సంగతి తెలిసికొనుఁడు. ఈయన 'భద్రరుచి' యను విద్వాంసునియొద్ద 'హేతువిద్య,' స్థితమతి బోధిసత్వుని'చెంత 'శబ్దవిద్యాశాస్త్రము' శీలభద్రుని'యొద్ద యోగశాస్త్రముఁ జదివెను. నాల్గువేదములు, జ్యోతిష గ్రంథములు, భూగోళము, చికిత్సాశాస్త్రము, తంత్రశాస్త్రము, గణితము మున్నగునవి మొదటినుండి చివరవఱకుఁ జదివెను. ఈయన అప్పగింపని గ్రంథమే లేదు; చూడనిపుస్తకమే లేదు. సమస్త శాస్త్ర పారంగతుఁడగు నీరాజును, మగధరాజు 'పూర్ణవర్మ'మెచ్చి '20 పట్టణముల యాదాయ మిచ్చెదను. నారాజ్యమునకు రమ్ము, అని కోరినను ఆయన నిరాకరించెను. 'శిలాదిత్యుఁడు'కూడ 'ఒరిస్సా'లోని 80 పట్టణముల యాదాయ మాతని కొసంగెదనని పల్కెనుకాని, ధీరుఁడౌ యాతనిమనసు నీయాశ లేమియు మార్చలేకపోయినవి, ఆయన ఇల్లు

112 A. A. Macdonall---India's past p, 52 "Indeed oral tradition offered a better guarantee for the preservation of the original text than the repeated copying of manuscripts. The oral tradition of sacred texts was, however, so well established a habit, that the substitution of any other method would not suggest itself as necessary."

చెప్పెను. 'జననమరణములను శృంఖలముల, స్వభావమును గూర్చి బోధించుటయే నాయుద్దేశము. అట్టిసమయములో, రాజుగారికి సంబంధించినవానినిగూర్చి పరిచయము గల్గించుకొనుటకు నాకు విశ్రాంతి ఎట్లు సాధ్యపడును ?' 113

పైవిధముగా భారతీయవిద్వాంసులు, సంసారము అసారమని, భోగములు తుచ్ఛములని, ధనకనకాదులు నశ్వరంబులని, యెఱింగి వానిని సరకుచేయక, రాజాధిరాజులను గూడ ధిక్కరించుచుండిరి. జ్ఞానమే వారి ధనము. ఒక్కొక్కరొక సజీవగ్రంథాలయము. ఇందుచేత గ్రంథాలయస్థాపనకు వారు పూనుకొన్నట్లు గాన్పింపదు. అందుచేతనే క్రీస్తుపూర్వము గ్రంథాలయములు భారతవర్షమునఁ గాన్పింపవు. క్రైస్తవశకారంభమునకుఁ దర్వాత కొన్నాళ్లకుఁగాని గ్రంథాలయములేర్పడినట్లు గాన్పింపదు. ప్రాచీనకాలపు విద్యాలయములగు కురు, పాంచాల, విదేహ, మత్స్య, ఉశీనర, తక్షశిలాది ప్రదేశములలో నెచటను గ్రంథములు, గ్రంథాలయములు గాన్పింపవు.

క్రీ. పూ. 5వ శతాబ్దమునుండి భారతవర్షమునుగూర్చి వ్రాయు యవన లేఖకులు గ్రంథముల, గ్రంథాలయములఁ గూర్చి ఏమియు వ్రాసియుండలేదు. మౌర్య, శుంగ, కణ్వ, ఆంధ్ర, కుషానురాజుల యాస్థానములలో నెచటను గ్రంథాలయములు గాన్పింపవు. క్రైస్తవ శకారంభమునకుఁ జాలతర్వాత సంస్కృత వ్రాతప్రతులతోఁ గూడిన గ్రంథాలయములు దేవాలయములలో, బౌద్ధవిహారములలో, రాజభవనములలో, సంపన్నుల గృహంబులలోఁ గాన్పించుచున్నవి. క్రీ.శ. 7వ శతాబ్దారంభమునఁగల సంస్కృతకవి, హర్షుని ఆస్థాన విద్వాంసుఁడు నగు 'బాణుని'కి ఒక గొప్ప గ్రంథాలయ మున్నట్లు గాన్పించుచున్నది. పశ్చిమ భారతవర్షములో 'ధారానగరరాజు' ఒకటవ భోజ

113 Samuel Beal-Life of Hiuen Tsiang. (Hwiu Li). P 153 "My object is to teach the urgent character of the fetters of birth and death., how is it possible then to find leisure to acquaint myself with the concerns of the King?'



ప్రాచీన భారతీయ

మహారాజున (క్రీ.శ. 1018-1060) కొక గ్రంథాలయ మున్నట్లు దెలియుచున్నది.114

భోజుఁడు పద్యములలో, నాటకములలో, కళలలో నూతన పంథాను ద్రొక్కెను. ఈరాజు 'కవిరాజ మాళవచక్రవర్తి' బిరుదాంకితుఁడు. సంస్కృతము నేర్పించుటకు ధారానగరములో సంస్కృత కళాశాల నేర్పఱచెను, దీనిలోని శిలలపై గ్రంథములు, పద్యములు, అలంకారశాస్త్రము, జ్యోతిషశాస్త్రములను సంబంధించిన విషయములు, అనేకనీతివాక్యములు సంస్కృతములో వ్రాయించెను. 'ధారానగరము'లోఁ 'ప్రఖ్యాతవిశ్వవిద్యాలయము లేక సరస్వతీఆలయము' (Temple of Saraswati) నీరాజు స్థాపించి, అందు గ్రంథాలయ మేర్పఱచెను. మహమ్మదీయరాజులు 'మాళ్వా'ను జయించినపుడు దీనిని మసీదుగా మార్చివైచిరి. నాటకభాగాదులుగల శిలాలేఖన మీనాఁటికిని, ధారానగరమునఁ గాన్పించుచున్నది, భోజుని జూచిన మాత్రమున కవన మల్లుచుండిరని చెప్పిన దీరాజునుగూర్చియే యని యెఱుఁగుఁడు.

బ్రాహ్మణులగు శాతవాహన రాజులలోఁ బదునేడవవాఁడు 'హాలుఁడు' క్రీ.శ. 1వ శతాబ్దములోనివాఁడు, 'గాథాసప్తశతి' అను గ్రంథమును 700 పద్యములలో 7 అధ్యాయములలో మహారాష్ట్ర ప్రాకృతిలో వ్రాసెను. అప్పటి రాజభాష 'ప్రాకృతము.' గౌతమీపుత్రుని యొక్కయు, అతనిసూనుఁడు రెండవ పులమావియొక్క

---

114 A.A. Macdonall---India's past p 54 "Some centuries after the beginning of our era, libraries as the depositories of Sanskrit manuscripts came into existence in temples, monasteries, the palaces of kings, and the houses of the wealthy. The evidence of his works shows that a Sanskrit poet who lived at the beginning of the 7th century must have possessed a large library. In the 11th century a famous library was owned by a king named 'Bhoja' of Dhar in the west of India."

See also history of Sanskrit literature by the same author P 20. See also winternitz---History of Indian literature - Vol I. p 39 and 40 See also Buhler's, Indian paleography. P 99.

నాసిక, కార్లేశిలాశాసనములు ప్రాకృతభాషలో నుండుటచేత, ఆంధ్ర రాజులు ప్రాకృతము నాదరించిరని తేలుచున్నది. అప్పటికి ప్రాకృత గ్రంథములతోఁగాని, సంస్కృతగ్రంథములతోఁగాని కూడిన గ్రంథాలయములు గాన్పింపవు. క్రీ. శ. 5వ శతాబ్దప్రాంతమున తెలుఁగు ఏర్పడుచుండుటచేత, తెలుఁగు గ్రంథాలయములు లేవు. క్రీ.శ. 2వ శతాబ్దములో 'నాగార్జునుఁ' డను బౌద్ధయతి, ఆంధ్రదేశములోఁ బల్నాటిసీమలోనున్న 'నాగార్జునకొండ' పైన బహువర్షములకాలమునివసించియుండెను. ఈయనతో 'దేవపూస' యనుశిష్యుఁ డుండెను. ఈయన నాగార్జునునితో వాదనలు సల్పుటను వచ్చి, ఇచటనే నిల్చిపోయెను. 'నాగార్జునుఁడు' నాగద్వీపమేగి' సంపూర్ణమైన ప్రజ్ఞాపరిమిత సూత్రములఁగైకొని వచ్చెను. అచట నాగార్జునుఁడు' కొన్నాళ్ళుండి, 'వైపుల్య'యు నింక నితరసూత్రములు నేర్చెను.115 అప్పటికి 'లంక'లో బౌద్ధసంఘారామములలో గ్రంథాలయము లున్నట్లు గాన్పించుచున్నది. ఈద్వీపములో ననేక పవిత్రగ్రంథము లుండుటచేత, యాత్రికులు, విద్వాంసులు లంకకు విశేషముగాఁ బోవుచువచ్చుచుండిరి. నాగార్జునుఁడు, ఆర్యదేవుఁడు అను బౌద్ధభిక్షువు లిరువురికి సింహాళీయులతో సంబంధము కలదు. తరువాతకాలములోని బుద్ధఘోష, బుద్ధదత్తలను బౌద్ధభిక్షువు లిరువురు, సింహళములోని గ్రంథాలయములను హెచ్చుగా నుపయోగించుకొనినట్లు గాన్పించును.116

'హుయాన్‌సాంగు' భారతవర్షములోఁ దాను చూచిన వానిని వర్ణించుచు, 'దక్షిణకోసల'కు 300 లీల దూరములో నైఋతిమూలను 'పో - లో - మో - లో - ఖిలి' గలదని, యిచట బౌద్ధుల

---

115 K. R. Subrahmanian. M. A. Buddhist remains in Andhra and Andhra history. P 54 "Nagarjuna learnt the Vaipulya and other sutras there."

116 Ibid P 141 "Pilgrims and scholars used to go to and from Ceylon as that island had a good collection of the scriptures. Nagarjuna and Aryadeva are associated with the island, while Buddhaghosha and Buddhadatta, of a later day laboured hard in her libraries."



ప్రాచీన భారతీయ

సంఘారామము గలదని దీనిలో బౌద్ధ జపమందిరములు గలవని, 5 శ్రేణులలో విశాలమగు చతుశ్శాలలు గలవని, ఒక్కొక్క దానిలో నాల్గు ఆవరణములు గలవని, వానిలో బుద్ధదేవుని ఆలయములు, వానిలో బంగారు బుద్ధవిగ్రహములు నుండెనని వ్రాసెను. దానిలోనికి ప్రవహించు నీరు సమృద్ధిగా నుండెను. జాతితో, దొలిచిన గవాక్షములతో గదులు, వెల్తురు, గాలి గలిగియుండెను. ఈ కొండను దొలిచి ఈ సంఘారామమును తయారుచేయుటలో, రాజుగారి ఖజానాలోని ద్రవ్యమంతయు వ్యయమాయెను. అప్పుడు 'నాగార్జునుడు' పరుసవేది నెఱింగిన యతికాబోలు, జాలను బంగారుగా మార్చి యిచ్చెనట. ఇది చారిత్రకసత్యమని నేను చెప్పజాలను. దీనితో సంఘారామము పూర్తియాయెను. పై చతుశ్శాలలో నాగార్జునుడు శాక్యముని బుద్ధుని ధర్మవచనగ్రంథములను, పూసల యొక్క వ్రాతప్రతుల నుంచెను. క్రింద చతుశ్శాలలో బౌద్ధసంఘారామమునకు సంబంధించిన, ఆరంభకు లుండిరి. మధ్యనున్న మిగత చతుశ్శాలలలో బౌద్ధభిక్షుసోదరుల బస లుండెను.116a ఈ వ్రాతలను బట్టి పై చతుశ్శాల 'నాగార్జునుని' గ్రంథాలయముగా గాన్పించుచున్నది. కొండ తొల్చుటకు, విహారము, చైత్యాదులనిర్మాణమునకు రాజునకు తొమ్మిదికోట్లు బంగారు నాణెములు ఖర్చాయెను. నాగార్జునుడున్న ఈతావును 'విజయపురి'యందురు. దీనిలో 1500 గదులు గలవు. నాగార్జునుని 'సరస్వతీభాండారము'లో 84000 సంభాషణలు

116 (a) Watters---On Yuan Chwang. Vol 2---P 209 "The monastery had cloisters and lofty halls: these halls were in five tiers, each with 4 courts with temples containing gold life size images of the Buddha of perfect artistic beauty. It was well supplied with running water and the chambers were lighted by windows cut in the rock. In the formation of this establishment, the king's treasury soon became exhausted and Nagarjuna, then provided an abundant supply of transmuting the rocks into gold. In the top most hall, Nagarjuna, deposited the scriptures of Sakyamuni-Buddha and the writings of the Pusas. In the lowest hall, were the laymen attached to the monastery and the stores and the 3 intermediate halls were the lodgings of the brethern." --

గల త్రిపిటకములు, తంత్రగ్రంథములు, ఆరోగ్యశాస్త్రములు, వైద్య గ్రంథములు, విషవైద్యశాస్త్రములు, కాయకల్ప చికిత్సా సంబంధ గ్రంథములు, రస, రసాయనశాస్త్రములు, వృక్షశాస్త్రము, లోహ శోధనశాస్త్రము, రసవాదశాస్త్రము మున్నుగాఁగల పెక్కింటికి సంబంధించిన గ్రంథము లుండవచ్చును. పై యన్నిశాస్త్రములలో నీ యతి గొప్ప పండితుఁడు. నాగార్జునుఁడే స్వయముగా నొక సజీవగ్రంథాలయ మనుటలో సందియము లేదు. బౌద్ధలోకమును వెలిఁగించిన భాను చతుష్టయములో నీయన యొకఁడని కొనియాడఁబడుచున్నాఁడు. లంకలోని గ్రంథాలయములఁ జూచి, ఆపద్ధతిలోనే ఇచట గ్రంథాలయ మేర్పరచియుండవచ్చును. లంకనుండి తిరిగి వచ్చినతర్వాతనే నాగార్జునయతి, రాజును, 10000 మంది బ్రాహ్మణులను బౌద్ధభిక్షువులుగా మార్చి, గొప్పవిద్యాలయమును, ప్రయోగశాలలను, గ్రంథాలయాదుల నేర్పఱచెను.

రాగిరేకులపై బౌద్ధగ్రంథములు వ్రాయించిన కనిష్కమహారాజునకుఁగాని (క్రీ. శ. 125-153) ఆయన ఆస్థానకవియు, బుద్ధచరిత్ర కర్తయగు అశ్వఘోషునికిఁగాని గ్రంథాలయము లున్నట్లు ఆధారములు లభింపలేదు. ప్రథమ లిఖిత గ్రంథకర్తలు బౌద్ధులే. లంకలో బౌద్ధ త్రిపిటకములు మొదట లిఖింపఁబడెను. అచటనే ప్రథమగ్రంథాలయము బౌద్ధులచే నేర్పడియుండవచ్చును. ఆంధ్రదేశములో ప్రథమ గ్రంథాలయము నాగార్జుననిదై యున్నది. గుప్తరాజులు నవరత్నాదుల పోషించిరి; గ్రంథములు వ్రాయించిరి; వాఙ్మయ వికాసమును గల్గించిరి; కాని వారి యాస్థానములలో గ్రంథాలయము లున్నట్లు, శిలాశాసనములందుఁగాని, సమకాలీన గ్రంథములందుఁగాని గాన్పింపదు. రెండవ చంద్రగుప్తుని కాలమునఁగూడ, గ్రంథములు కంఠస్థము చేసెడిపద్ధతి విరివిగా వ్యాప్తిలోనున్నదని, 'ఫాహియాను' (క్రీ. శ. 405-411) వ్రాఁతలు తెల్పును. పాటలీపుత్రము వచ్చువరకు నాయనకు బౌద్ధగ్రంథములు లభింపకపోవుటచేత బౌద్ధ సంఘారామములలోఁగూడ గొప్ప గ్రంథాలయము లున్నట్లు గాన్పింపదు; కాని మఱి రెండువందల సంవత్సరములకుఁ దర్వాత వచ్చిన 'హుయాన్

సాంగు' వ్రాతలనుబట్టి, శ్రీహర్షుని కాలమున ననేక గ్రంథాలయములున్న ట్లెఱుంగవచ్చును.

శ్రీహర్షుని (క్రీ. శ. 606-647) కాలమున 18 మహాయాన, హీనయాన శాఖలుగలవు. భారతవర్షమున 5000 విహారములుగలవు కళింగలో 10 సంఘారామములలో 500 మంది భిక్షువులుండిరి. ఆంధ్రదేశములో 20 సంఘారామములలో 3000 మంది భిక్షువులుండిరి, ధాన్యకటకములో 20 సంఘారామములలో 1000 మంది భిక్షువులుండిరి. 'హుయన్‌త్సాంగు' లెక్కలనుబట్టి, 'రైస్ డేవిడ్సు' (Rhysdavids) భారతభూమిలోని సంఘారామములలోని భిక్షువుల సంఖ్య 212130 మంది అని, యుల్లేఖించెను. ప్రతిసంఘారామమును గ్రంథాలయమును, బాలశాలయైయుండెను. గ్రంథాలయములలో ననేకగ్రంథములుండెను.

'హుయన్‌త్సాంగు' కాశ్మీరములో నున్నపుడు, రాజభవనములోని గ్రంథాలయములో ఆయనకోరిన గ్రంథముల నకళ్లు వ్రాయుటకు 20 మంది లేఖకులను, యాత్రికుని యవసరముల నెల్ల దీర్చుటకు, భదంతఛింగును అతని శిష్యబృందమును, రాజు నియమించెను. ఇవ్విధముగా, రెండువర్షములకాలము, సూత్రములు, శాస్త్రములు చదువుకొనుచు, 'హుయన్‌త్సాంగు'గడపెను.117 ఈ లేఖకులు వ్రాసి పోయిన, వ్రాతప్రతులు, అనేక గ్రంథాలయములలోనివైయున్నవి. కాశ్మీరదేశములోని, శారదాపీఠ గ్రంథాలయ మతి ప్రాచీనకాలమునుండి ప్రసిద్ధిగాంచినది.

శ్రీహర్షుని కాలమున 'నాలందా విశ్వవిద్యాలయము' ప్రసిద్ధిగాంచి యుండెను. దీనిలో 'హుయన్‌త్సాంగు' ఐదువర్షములకాలము చదువుకొనెను. ఈయనకు ప్రత్యేకముగా 'మహాశాలి బియ్యము' నొసంగుచుండిరి. మగధదేశములోదప వేరొకచో నీధాన్యము పండుటలేదు.

---

117 R. K. Mukherjee--Harsha p 128 "--Kasmir-- King appointed Bhadantha Ching, with his disciples to look after the needs of the pilgrim and 20 clerks to copy out the manuscripts he wanted from the palace library--He thus spent two years, there studying certain sutras and sastras."

ఈవిద్యాలయ పోషణకు 'శిలాదిత్యుఁడు 100 గ్రామముల యాదాయము నొసంగుచుండెను. ఈగ్రామములలోని 200 మంది గృహస్థులు నిత్యము పెక్కువందల 'పికలుల' మామూలు బియ్యము, పెక్కువందల 'కాటీల బరువుగల వెన్న, పాలు, పంపుచుండిరి. ఇచట 10000 మంది విద్యార్థులుగలరని, 1510 మంది అధ్యాపకులుగలరని చైనీయ లేఖకుడు 'హుయాన్‌సాంగు' వ్రాసెను.[118] ఇత్సింగు, కాలమునాఁటికి, 3000కుపైగా నివసించుచుండిరని, 200 గ్రామముల భూములు విద్యాలయపోషణకుఁగలవని[119] దీనిలో 8 చతుశ్శాలలు, 300వందల గదులు గలవని[120] 'ఇత్సింగు' వ్రాసెను.

నాలందావిహారము క్రీ. శ. 5వ శతాబ్దములో స్థాపింపఁబడినది. నాలందాలోని గ్రంథాలయమునుగూర్చి చైనీయ లేఖకులేమియు వ్రాసియుండలేదు. కాని టిబెటీయ ప్రమాణముల ననుసరించి నాలందావిద్యాలయములో, గొప్ప 'ధర్మగంజ' (Piety mart) అను పేరుగలది కాన్పించుచున్నది. దీనిలో వరుసగా మూఁడు భాగములలో మూఁడుగొప్ప భవనములు, రత్నసాగర, రత్నదధి, రత్నరంజక యనునవికలవు. వీనిలో 'రత్నదధి' యనునది తొమ్మిది అంతస్తులు గలది; దీనిలో నాకాలమున 'జంబూద్వీపము'లోనెల్ల ప్రసిద్ధిగాంచిన పెద్దదైన 'గ్రంథాలయము' పెట్టఁబడియున్నది.[121]

---

118 Samuel Beal--Life of Hiuen Tsiang--(Shaman Hwiu Li) p 112 "The king of the country respects and honours the priests and has remitted the revenues of about 100 villages for the endowment of the convent. 200 house holders in these villages day by day contribute several hundred piculs of ordinary rice and several hundred catties in weight of butter and milk." (1 picul— $133\frac{1}{3}$ lbs. 1 catty =160 lbs )

119 J. Takakusu—Itsing. A record of the Buddhist religion as practised in India and the Malaya Archipelago. p 47 "Nalanda monastery. ... ... Number of residents above 3000.--The lands in possession more than 200 villages.".

120 Ibid P 154 "There are 8 halls and 300 apartments."

121 N. N. Mazumdar M, A.--A History of education in ancient India p 93, "Its three grandest buildings were called Ratnasagara,



ప్రాచీన భారతీయ

'బిహారులోని' గొప్పవిశ్వవిద్యాలయమగు 'నాలందా'లో ననేక బౌద్ధవిద్యార్థులు భిక్షువు లుండిరి. ఈవిద్యాలయము గ్రంథాలయములతో గూడియుండెను. 'భక్తియారు ఖిల్జీ', తనఖడ్గమును దానిపై ప్రయోగించెను. ముస్లిములు నాలందా గ్రంథాలయమును దగులవేసి నాశనముచేసిరి. మహమ్మదీయుల దండయాత్రలలో 'నాలందా' గ్రంథాలయము బూడిదపాలాయెను.[122] ఒక్క విద్వాంసుడైన మిగులసంశముస్లిములు చిత్రవధ చేసిరి. శక్తులుగలదని నమ్మబడు తార యను దేవతయొక్క విగ్రహమును పగులగొట్టి పాఱవైచిరి. ఏ రాజుల దండయాత్రలలో నైనను ఇట్టికృత్యములు సహజముగా జరుగుచుండును. నాలందా విద్యాలయమునకు క్షీణదశయారంభించినరోజులలో బీహారులోని ఉదంతపురిలో గోపాలలేకలోకపాలుడు అను వంగరాజు క్రీ. శ. 730 లో నొక విద్యాలయమును గ్రంథాలయమును స్థాపించెను.[123] దీనిలో బౌద్ధ బ్రాహ్మణ గ్రంథములనేకములు గలవు.

---

Ratnadadhi, and Ratnaranjaka. Of these Rathnadadhi was nine storeyed and in it was located the library then considered the largest in India. (S. C. Das's universities in Ancient India.")

122 V. A. Smith--Early history of India p 312 "The political decadence of Magadha never affected the reputation of the kingdom as the centre and head quarters of Buddhist learning; which continued to be cultivated sedulously at Nalanda and other places under the Pala Kings up to the time of the Mohammadan conquest at the close of the 12th century when the monasteries with their well stocked libraries were reduced to ashes."

N. N. Law--promotion of learning in India--p 19 (1916). "The first object of attack was the monastic University at Bihar which was then teeming with Buddhist students and monks, and was well equipped with libraries. The atrocities of Bakhtiyar, did not leave a single scholar alive. "N. N. Ghosh M.A.--Early history of India—p 88 "The great university library of Nalanda where Hiuen Tsiang studied for five years was burnt and destroyed. The same fate overtook the great university library at Vikramasila."

123 V. A. Smith--Early history of India p 473 "Taranath, the Tibetian historian ascribes the foundation of this university to Gopala, the Pala king of Bengal."

పాలరాజులు దీనిననేకవిధములఁ బోషించియుండిరి.124 ఈవిద్యాలయములో 1000 కి పైగా బౌద్ధ భిక్షువులుండిరి. బుద్ధగయలోని, నాలందాలోని విహారములకంటె నిదియున్నతమైనది. అలెగ్జాండ్రియా గ్రంథాలయమును సర్వవిధములఁబోలియున్నది. ఇట్టి గ్రంథాలయమును భక్తియార్ ఖిల్జీ యొక్క సేనానాయకుఁడగు ముహమ్మద్ బీన్ సిమ్ అనువానిచే క్రీ. శ. 1202 లోఁ దగులఁబెట్టఁబడెను.

ఉదంతపురిలో మహీపాలరాజు కుమారుఁడగు మహాపాలుని కాలమున హీనయానశాఖకుఁజెందినవారు 1000 మంది, మహాయాన శాఖకుఁజెందినవారు 1000 మంది భిక్షువులుగలరు. పాలరాజులు బౌద్ధ బ్రాహ్మణగ్రంథము లనేకములు గల గ్రంథాలయమును స్థాపించిరి. ముహమ్మదీయులచేత క్రీ. శ. 1202లో విహారము నాశనము చేయఁబడెను. 2000 మంది భిక్షువులు చిత్రవధచేయఁబడిరి. గ్రంథాలయము నాశనమాయెను.125 కొందఱి దృష్టిలో గ్రంథాలయమును గైకొని

---

N. N. Mazumdar—M. A.--A history of education in Ancient India-p 97 "Another monastic college was erected at Odantapuri (Bihar) by one Gopala or Lokapala who is said to have ascended the throne of Bengal about 730 A. D. It contained a splendid library of Brahmanical and Buddhist works, which was destroyed at the sack of the monastery and the massacre of its monks by the Muhammadans who dealt a death blow to the Buddhists and their religion.

124 Phanindranath Bose—Indian teachers of Buddhist universities. p 157 "The Pala kings endowed this monastery with a splendid library of Brahmanical and Buddhistic works."

125 Rai Sarath Chandra Das Bahaddur C.I.E.—Hindusthan review—March 1906—p 187 "The temple of Odanatapuri Vihara which is said to have been loftier than either of the two (Buddhagaya and Nalanda) contained a vast collection of Buddhist and Brahminical works which after the manner of the great Alexandrian library was burnt under the orders of Mahommed Bin Sim, General of Baktiyar Khilji in A. D. 1202.

Ibid P 190 "During the reign of the son of king Mahipal, who was called Pal the great, Ie Mahapal, there were 100 monks of the earlier school of Buddhism called Hinayan and about 5000 monks of the Mahayana school at Udantapuri. The Pal kings had esta-



ప్రాచీన భారతీయ

పోయినట్లు తెలియుచున్నది.126 క్రీ. శ. 749లో టిబెటురాజు 'సాంయి' (Samye) ఈసంఘారామమువంటి దానిని తనదేశములో నిర్మించెను.

విక్రమశిల విశ్వవిద్యాలయము క్రీ.శ. 8వ శతాబ్దములో ధర్మపాల రాజుచేత స్థాపింపఁబడెను. ఈవిక్రమశిల సంఘారామములోఁ గూడ 6 కళాశాలలు, గొప్ప గ్రంథాలయము కలవు. ఎచటను లభింపనట్టి తంత్ర, వ్యాకరణ, వేదాంత, తర్క-శాస్త్రసంబంధమగు గ్రంథములిచట విస్తారముగా దొరకుచుండెను. ఉదంతపురి, విక్రమశిల కళాశాలల నాశనమొకేపర్యాయము క్రీ. శ. 1202లో జరిగెను. అప్పుడు లక్ష్మణసేనుఁడను రాజు రాజ్యమేలుచుండెను. ఈవిక్రమశిల కళాశాల మగధలో నుండెను. ఈకళాశాలలోని పండితు లనేకులు ప్రసిద్ధిగాంచి మెఱుగుచుండిరి. దీనిలో 114మందికిఁ దక్కువ లేకుండ అధ్యాపకులు పని చేయుచుండిరి. విక్రమశిల సంఘారామములో 3000 మంది భిక్షువు లుండిరి. ముసల్మానులు మగధనంతయు జయించుచు, విక్రమశిలలోని భిక్షువులఁ బెక్కుర వధించిరి. భక్తియారుఖిల్జీ క్రీ. శ. 1202లో విక్రమశిల సంఘారామమును సర్వనాశనముచేసెను. 'మిన్హాజ్' అనెడు ప్రసిద్ధ చరిత్రకారుఁడు ముహమ్మ దెట్లువచ్చినది, కళాశాలలనెట్లు స్వాధీనము చేసికొన్నది, తలలు బోడులు చేసికొన్న భిక్షువులనెట్లు చిత్రవధ చేసినది వర్ణించినాఁడు. ఈ విహారనాశన వృత్తాంతము, 'టాబకాటినాసిరి' కర్త చక్కఁగా లిఖించినాఁడు. ఈ ప్రదేశములో నధికముగా నివసించువారు భిక్షువులు; వారితలలు బోడులైయుండెను. వారందఱిని ముస్లిములు చిత్రవధ చేసిరి. 'బౌద్ధమతము' మీఁద గ్రంథము లనేకములు కలవు. ఈ గ్రంథముల నన్నిటిని 'ముసల్మానులు' పరిశీలించి, గ్రంథముల విషయము తెలిసికొనుటకు హిందువు

---

blished a monastic library at Odantapuri with a splendid library of Brahminical and Buddhistic works which was destroyed at the sack of the monastery and massacre of its monks by the Mahommadans in A. D. 1202."

126 Cambridge history of India—Vol III—Chap III—P 42 "With this accession of strength, he invaded Bihar, took its capital Udantapuri, put to death the Buddhistic monks, dwelling in its great monastery, and returned with his plunder, which included the library of the monastery."

లకు వర్తమానముఁబంపిన నెవరును రాలేదు. భిక్షువుల ననేకుల వధించిరి. గ్రంథములలోని విషయములనుబట్టి, కోట, నగరమొక కళాశాలయని, హిందువులభాషలో వారు కళాశాలను 'బిహారు' (బౌద్ధ సంఘారామము) అని పిల్తురని పై లేఖకుఁడు వ్రాసెను. 127 విక్రమశిల విద్యాలయము నాశనమైనతర్వాత, చివరి పండితుఁడగు పండిత శాక్యశ్రీభద్రుఁడు' జగద్దాల గ్రంథాలయమునకేగి, యటనుండి త్రిపిషపమేగెను. ఈవిధముగా 'విక్రమశిల' గ్రంథాలయము ముస్లిముల రాకతో సర్వనాశనమాయెను.

ఇట్లే 'జగద్దాల' విశ్వవిద్యాలయము, వంగ మగధ రాజ్యముల కధిపతియగు 'రామపాలుని' (క్రీ. శ. 1084-1130) చేత 1100 సంవత్సర ప్రాంతమున నిర్మింపఁబడినది. ఒకశతాబ్ద కాలములో నీ విద్యాలయము మహమ్మదీయుల రాకతో నశించిపోయెను. ఇందలి గ్రంథాలయమును నామము లేకుండ పోయెను.

ఇంకను, సోమపురి, విక్రమపురి, వాలాభి, అమరావతి, ధాన్యకటకము, తామ్రలిప్తి మున్నగుచోట్ల బౌద్ధ సంఘారామములుగలవు. వీని యన్నిటిలోను గ్రంథాలయములు గలవుగాని, యవి యన్నియుఁ గాలక్రమమున నశించిపోయెను.

విక్రమశిల, ఉదంతిపురిలో ముసల్మానుల దండయాత్ర యైన తర్వాత, జీవించియున్న బౌద్ధభిక్షువులు, మిగిలియున్న గ్రంథములను

---

127 Phanindranath Bose—Indian teachers of Buddhist universities. p 102 "The greater number of the inhabitants of that place were Brahmanas (Bhikshus) and the whole of those Brahmanas had their heads shaven; and they were all slain. There were a great number of books on the religion of the Hindus, (Buddhists) there; and when all these books came under the observation of the Musalmans, they summoned a number of Hindus that they might give them information respecting the import of those books: but the whole of the Hindus had been killed. On becoming acquainted (with the contents of those books), it was found that the whole of that fortress and city was a college, and in the Hindu tongue, they call a college, Bihar (A Buddhist monastery.) Major H. G. Raverty's translation of Tabakati—Nasari (1881) Vol I. p 552.



ప్రాచీన భారతీయ

గైకొని, టిబెట్, నేపాళములకుఁ బాఱిపోయిరి. బౌద్ధగ్రంథములు క్రీ. శ. 1820 వరకు నేపాలులో నుండెను. క్రీ. శ. 1820 ప్రాంతమున నేపాలులో బ్రిటిషు రాయబారిగానుండి పనిచేసిన 'హాడ్గ్సను' (Brian Hodgson) బౌద్ధగ్రంథము లన్నిటిని పారిసులోనున్న 'బర్నాఫు'నకుఁ బంపఁగా నాయన శిష్యులతోఁగలసి పరిశోధనలుచేసి అమూల్యమగు విషయము లను బయటపెట్టెను. బౌద్ధ వాఙ్మయమునకు 'హాడ్గ్సను' అపారమగు సేవచేసెను. నేపాలులోని గ్రంథాలయములలో నేఁటికి ననేక గ్రంథములు తాటియాకులు, కాగితముపై వ్రాయఁబడినవి లభించుచున్నవి.128 హిందూదేశములో లేని గ్రంథములు, బౌద్ధమత సంబంధములు, మూలము సంస్కృతములోనివి, తర్జుమా చేయఁబడినవి, అన్ని 'టిబెట్టు' లోఁ గాన్పించుచున్నవి, అని, 'హంగేరి' యాత్రికుఁడు 'కొరాసి' (Korosi) వ్రాసెను.129 భారతీయ పండితులు 19 వ శతాబ్దములో 'టిబెట్టు' కేగి, యచటనుండి వేలకొలఁది గ్రంథములను గైకొనివచ్చిరి. 'రాహుల సాంకృత్యాయనుఁడు' అను భారతీయ విద్వాంసుఁడు, 'టిబెటు' నుండి 22 కంచరగాడిదలు మోయునంత బరువుగల గ్రంథములను భారతభూమికిఁ దీసికొనివచ్చెను. దిగ్నాగుని 'ప్రమాణ సముచ్చయము' 'టిబెటీయ పుస్తకాలయము' లో లభించినది. మన దేశములోఁగూడ పెక్కు వ్రాఁతప్రతుల గ్రంథాలయములు బయలుదేఱినవి. పూనా, కాశీ, కలకత్తా, జోధపూరు మొదలగుచోట్ల లిఖితపుస్తకాలయములు వెల

---

128 V. A. Smith—Oxford history of India p 176; The "Nepalese libraries contain a rich store of Buddhist manuscripts first made known by the labours of Brian Hodgson between 1820 and 1858, which have supplied much material for the study of the various forms of Buddhist religion and philosophy."

Also see Jadunath Sircar's—India through the ages.

129 Hungarian traveller—Korosi— "In complete preservation the volumes of Buddhist faith, in their original Sanskrit as well as in faithful translations, which might be sought in vain on the continent of India, are to be found in Thibet." (Quoted by Dharmapala in his book "Buddhism in its relationship with Hinduism p 14.)

సినవి. బౌద్ధమతము పుట్టిన భూమిలో, అమూల్యమగు బౌద్ధగ్రంథ మొక్కటైన లభింప లేదు. మహమ్మదీయులకుఁ బూర్వమే భారత భూమిలో బ్రాహ్మణులు బౌద్ధులను హింసించి, బౌద్ధుల గ్రంథాల యములు నాశనము చేసినట్లు కాన్పించుచున్నది. బౌద్ధగ్రంథాలయ ముల దగ్ధము చేయుటకు, బౌద్ధభిక్షువుల చిత్రవధ చేయుటకు, వెడలఁ గొట్టుటకు, బలాత్కారముగా మతము మార్పించుటకు, హిందువులే కారకులు. ఇంత క్రూరముగా బౌద్ధులను హింసించిన విధము, ప్రపంచ చరిత్రలో నెందును గాన్పింపదు. బలాత్కారముగా బౌద్ధ మత మీ దేశమునుండి వెడలఁగొట్టఁబడెను. 130

'దత్తు' అను విద్వాంసుఁడు, క్రీ. శ. 9, 10 శతాబ్దము లంధకార యుగమని, బౌద్ధుల హింసించుట ఆరంభమైనదని, సంఘారామములు నాశనమాయెనని, భిక్షువులను వెడలఁగొట్టిరని, గ్రంథములను దగ్ధము చేసిరని, రాజపుత్రులు రాజులైన చోట్లనెల్ల, బౌద్ధుల కట్టడములు నాశనము చేసి, హిందూదేవాలయములఁ గట్టించిరని, రాజపుత్రుల తర్వాత రాజులైన ముస్లిములు, వీరు తలంచిన కార్యమును బూర్తిచేసి రని, 1000 ఏండ్లు హిందూమతముతోఁ బాటు వర్ధిల్లిన బౌద్ధమత గ్రంథము లీదేశములో నొకటియేని లభింప లేదని, సింహళము, బర్మా, నేపాలు, టిబెట్టు, చైనా, జపాను, ఇంక నాసియాఖండ ప్రాంతము లలో బౌద్ధగ్రంథములు లభించినవని, పురాతనచరిత్రవిదులు, బౌద్ధ మతము పుట్టిన ఈదేశములో నొక్క విలువగల గ్రంథమునైన కనుఁ గొనలేకపోయిరని వ్రాసెను. 131

130 Rhys Davids—Buddhist India p 319. "Even before Muslims, Brahmins led the way to destroy the Buddhist libraries.—The disciples of Buddha were so ruthlessly persecuted that all men either slain, exiled, or made to change their faith. There is scarcely a case on record where a religious persecution was so successfully carried out as that by which Buddhism was driven out of India."

131 R. C. Dutt—Ancient India p 151 "History of North India in the 9th and 10th centuries is a blank in the dark ages. Religious persecution began in India. Monasteries were demolished, monks were banished and books were burnt, and wherever the Rajputs became rulers, Buddhist edifices went down and Hindu temples



ప్రాచీన భారతీయ

ఆంధ్రదేశములోఁగూడ బౌద్ధులను హింసించినట్లు, బౌద్ధ గ్రంథాలయములను నాశనము చేసినట్లు ఒప్పుకొనకతప్పదు. లేనిచో ఆంధ్రదేశములో సంపూర్ణముగా బౌద్ధవాఙ్మయము నశించిపోవుటకుఁ గారణము చెప్పఁజాలము, అని సుబ్రహ్మణ్యన్' అను ఆంధ్ర చరిత్రకారుఁడు వ్రాసెను.[132] ఈయూహ సత్యమే కావచ్చును.

బౌద్ధులను జంపినట్లుగానే, వారి గ్రంథాలయములు తగులఁబెట్టినట్లుగానే, జైనుల గ్రంథాలయములనుగూడ హిందువులు తగులవేసిరి. తమిళశైవుఁడగు 'తిరుజ్ఞాన సంబందర్' క్రీ. శ. ౭వ శతాబ్దములో జైనుల సంహారింప నారంభించెను. తరువాత చాలకాలమువఱకు దక్షిణదేశములో జైనమతములను, దేవాలయములను, గ్రంథాలయములను దగులవేయుచుండిరి. కనుక ముస్లిములకుఁ బూర్వమే, బౌద్ధ జైన గ్రంథాలయములను హిందువులు నాశనము చేసిరని, త్రోవ చూపినవారు హిందువులే నని, దిగుబాటుపనిని ముస్లిములు పూర్తి చేసిరని చెప్పక తప్పదు. 'తిక్కనసోమయాజి' కూడ చాలవఱకు జైన విధ్వంసమునకుఁ దోడ్పడినట్లుఁ గాన్పించుచున్నది. కుమారిలభట్టు, శంకర, రామానుజాదు లిట్టివారే.

నైజాము రాజ్యములో 'వాడి' వద్ద 'నాగై' (Nagai) అనుచోట క్రీ.శ. 11వ శతాబ్దమునాఁటి రెండు చాళుక్య శాసనములఁబట్టి, ఇచట నొక 'ఘటికాశాల' లేక కళాశాల' కలదనియు, నందు మంచి గ్రంథా

---

arose. By the end of the 10th century Buddhism was practically stamped out from India and the work of destruction, was completed by the Muslims, who succeeded the Rajputs as masters of India. So complete was the work of destruction, that modern antiquarians who have collected Buddhist scriptures from Ceylon and Burma, Nepal and Thibet, China and Japan and all parts of Asia, have failed to glean any valuable Texts from India which was the first home of that religion and where it flourished side by side with Hinduism for over 1000 years."

132 K. R. Subramanian M. A.—Andhra history p 31 "Generally there must have been persecution and destruction of Buddhist buildings and libraries to some extent. Otherwise we cannot explain the entire absence of Buddhist literature in Andhra."

లయము కలదని, ఆరుగురు గ్రంథాలయాధికారులు (సరస్వతీభాండారికులు) దానివ్యవహారముం జూచుచుండిరని తెలియుచున్నది. ధారానగరవాసియగు మొదటి భోజమహారాజు గ్రంథాలయమువలెనే, 'అనిహిలవాదపట్టణము' (Anhilvadpattan) లోం జాళుక్యరాజుల కొక గ్రంథాలయ మున్నట్లు 'బుహ్లరు' వ్రాంతలు తెల్పుచున్నవి.133

'జయసింహసిద్ధిరాజు'అనువాండు భోజరాజుకు 50 ఏండ్ల తర్వాత వాండు. (క్రీ.శ. 1093-1143) ఈయన బలవంతుండు; పరాక్రమశాలి; అనేకాలయముల నిర్మించెను. మ్లేచ్ఛాదుల జయించెను. ప్రఖ్యాతి గాంచిన జైనకవి హేమచంద్రుం డీయన ఆస్థానకవి. 'జయసింహసిద్ధిరాజు' భోజరాజురాజ్యమును జయించి, ధారానగరములోని గ్రంథాలయమును గైకొనివచ్చి అనిహిలవాదపట్టణములోని చాళుక్యరాజుల గ్రంథాలయములోం గలిపివైచెను. 13వ శతాబ్దిలోని 'చాళుక్యవిశాలదేవుని' 'భారతీభాండార' మను గ్రంథాలయముకూడ చరిత్రలోం బ్రసిద్ధి గాంచియున్నది.

'ఫిరోజ్‌షా' (క్రీ.శ. 1350-1388) కాలమున 'నాగరకోట'దేవాలయములో నొక గ్రంథాలయము బయల్పడినది.'నాగరకోట'రాజును 'ఫిరోజ్‌షా' జయించి, తిరిగి ఆయనకే యొప్పగించెను. ఈ కాలములో, నచటిజనులు 'ఫిరోజ్'తో' 'నాగరకోట దేవాలయము'లో హిందువు లారాధించుప్రతిమ, అలెగ్జాండరు భార్యయైన 'నౌషాబా' దనియు, యవనభూపతి వెళ్ళుచు నావిగ్రహమును వారికే వదలిపోయెనని, ఆ కాలమున నా విగ్రహము 'జ్వాలాముఖి' యను పేరం బిలువంబడుచుండెనని, ఈజ్వాలాముఖి యాలయములో 1300 హిందూగ్రంథములు గల గ్రంథాలయము కలదని 'ఫిరోజ్‌ఖాన్' అందులోం గొన్ని గ్రంథముల ననువాదము చేయుటకు విద్వాంసులైన హిందువులం గొందఱిని బంపెనని, ఆకాలమునం బ్రసిద్ధి కెక్కిన 'ఐజుద్దీన్ ఖాలిద ఖాని' అనువానిని రాజు, ఒకానొకపద్యకావ్యమును పారసీకభాషలో గద్యములోనికి మార్చుమని కోరెనని, సుల్తాను, ఆగ్రంథము పూర్తియైనతర్వాత 'దలైలి' ఫిరజ్‌షాహీ (Dalaili Firuz Shahi) అను

133 Buhler—Indian paleography. p 99.

బిరుదు రాజాసంగెనని తెలియుచున్నది. 134 దీనినిబట్టి బౌద్ధసంఘా రామములలోను, విహారములలోను' జైనమతములలోను గానుండ, హిందూ దేవాలయములలో గూడ నందందు గ్రంథాలయములు కాన్పించుచున్నవి, అని యెఱుంగనచ్చును.

అలసాని పెద్దన, తెనాలి రామకృష్ణకవి మున్నగువారి పద్యములం బట్టి వారికాలమున (క్రీ. శ. 16వ శ.) గ్రంథాలయములు గలవని తెలియుచున్నది. రామకృష్ణకవి, పుస్తకభాండగారంబు నిజభర్తృహస్తాంతరంబున' నని వర్ణించెను. ఆంధ్రభోజుఁడు శ్రీకృష్ణదేవరాయల యాస్థానములో గ్రంథాలయము లున్నట్లు సమకాలీనుల వ్రాతలలో మాకుం గాన్పింపలేదు.

ఇవిగాక, తంజావూరు ఆంధ్రనాయక రాజుల గ్రంథాలయము పేర్కొనం దగియున్నది. తంజావూరు రాజ్యము పాలించిన నాయక రాజులలో మొదటివాఁడు 'సేనప్పనాయక్' (1535-1561). పిమ్మట అచ్యుతనాయక్ (1561-1614), తరువాత రఘునాధనాయక్ (1614-1633), తరువాత విజయరాఘవనాయక్ (1633-1673) తరువాత నితరులు 1673-1676 వఱకు, 'శంకమాలదాసు' 1675లోను పాలించెను. వీరు దాదాపు ఒకటిన్నర శతాబ్దముల కాలము పాలించిరి. ఈ రాజులకు గ్రంథాలయములందు హెచ్చు అభిమానము కాన్పించు

134 N. N. Law—Promotion of learning in India—p 64 'The Raja of Nagarkot was conquered by 'Firuz Shah' in a battle, but was restored to his dominions. About this time, the people of the place told Firuz that the idol which the Hindus worshipped in the temple of Nagarkot was the image of Naushabah, (the wife of Alexander the great) and that the Greek conqueror had left the idol with them. The name by which the idol was known at the time of the contest was 'Jwalamukhi. In the temple of this idol was a fine library of Hindu books consisting of 1300 volumes. Firuz ordered that some learned Hindus should be sent there for translating a few books. A celebrated poet of the period, named Aizzuddin Khalid Khani, was ordered to translate one of these books from verse into Persian prose, and when it was finished the Sultan gave it the title of 'Dalaili Firuz Shahi.' (Tarikhi Firishtah, Elliot VI—p 227).

చున్నది. నాయకరాజుల గ్రంథాలయమును గూర్చి 'బర్నెల్' (Burnell) ప్రశంసించెను. "ప్రపంచములోని కెల్ల గొప్పదైన, అతి ముఖ్యమైన గ్రంథాలయమని 'బర్నెల్'ను, చాల ఉపయోగకరమైనట్టి, ఎచటను లభింపనట్టి, అద్వితీయమైనట్టి, ఇంతవరకుఁ దెలియనట్టి, ఎచటను సంపాదింపలేనట్టి, ఎంతయేని శ్రమతో, ఖర్చుతో మాత్రము సంపాదింపఁగలట్టి గ్రంథము లున్న"వని డా॥ బుహ్లరును ప్రశంసించిరి.[135]

ఈ 'సరస్వతీమహాలు గ్రంథాలయ' స్థాపన క్రీ. శ. 16వ శతాబ్ద ప్రారంభమున జరిగినట్లు గాన్పించుచున్నది. తెలుఁగు నాయకరాజులు, సంస్కృతి, ఆంధ్రభాషల వ్రాఁతప్రతులను, తెలుఁగు గ్రంథాక్షరములలో వ్రాయఁబడినవానిని, గ్రంథాలయమునకుఁ గూర్పసాగిరి. నాయకరాజుల పతనము తర్వాత 17వ శతాబ్దాంతమున మహారాష్ట్ర రాజులు (క్రీ. శ. 1673-1835) తంజావూరు రాజ్యమును జయించి, గ్రంథాలయమునువృద్ధిచేయసాగిరి. ఈవంశములో మొదటిమహారాష్ట్ర రాజు 'ఏకోజీ' (1676-1683 క్రీ. శ.) 2 షాహజీ 3 ప్రథమ శరభోజీ 4 తులాజీ (తుక్కోజీ) 5 ద్వితీయ ఏకోజీ 6 ప్రతాపసింహుఁడు, 7 రెండవ తులాజీ 8 అమీరసింహుడు, 9 రెండవ సెర్ఫోజీ 10 శివాజీ. (1833-1835) ఈ పదిమంది రాజులు దాదాపు 160 ఏండ్లు పాలించిరి. 9వ రాజగు ద్వితీయసెర్ఫోజీ కాశీయాత్రకుఁబోయి తిరిగి వచ్చునపు డనేకములగు వ్రాఁతప్రతులను గైకొనివచ్చి గ్రంథాలయములోఁ జేర్చెను. చివరిరాజు 'శివాజీ' మఱి పెక్కింటిని జేర్చెను. ఈప్రకార మీ గ్రంథాలయమున క్రీ శ. 1835 సంవత్సరమువరకు గ్రంథములు చేర్పఁబడుచునేయుండెను. 'సప్తసంతానములలోఁబ్రశస్తి గాంచినట్టి, ధాత్రిలో ఖిలముగాకుండునట్టి కృతులఁ బెక్కింటిని జేర్చి గ్రంథాలయమును బోషించిన, వృద్ధిచేసిన ఈరాజులు చిరస్మరణీయులు ధన్యతములుగదా!

---

135 Burnell—"to be perhaps the largest and most important in the world."

Dr. Buhler "Contains a great many useful and a number of very rare or nearly unique books, many of which are quite unknown or procurable only with great trouble and expense."



ప్రాచీన భారతీయ

'బుహ్లారు' 'ఖాంబే' (Khambay) లోని రెండు జైనగ్రంథాలయములలో 30000 కుఁ బైగా వ్రాత ప్రతులఁ జూచియుండెనని, తంజావూరు గ్రంథాలయములో 12000కుఁ బైగా వ్రాత ప్రతులఁ జూచెనని, 'వింటర్‌నిట్జ్' అను శార్మణ్యవిద్వాంసుఁడు వ్రాసెను.136 1868లో 'కోల్‌బ్రూక్' (Colebrook) మొదలగు విద్వాంసులు భారతవర్షములో వ్రాతప్రతుల నన్వేషింపసాగిరి. ఇండియా దొరతనమువారు సంస్కృత వ్రాత ప్రతులకు సాలీనా 24000 రూపాయలు మంజూరు చేసియుండిరి. 'కోల్‌బ్రూక్' అనేకములగు వ్రాత ప్రతులను భారత వర్షములో సంపాదించి, ఇంగ్లాండు చేరిన తర్వాత, ప్రస్తుతము ఇండియా కార్యాలయములో నున్న, 'ఈస్టుఇండియా కంపెనీ' వారి గ్రంథాలయమునకు బహూకరించెను. ఆక్సుఫర్డులోని 'బోడ్లియను' గ్రంథాలయమున 10000 సంస్కృత వ్రాతప్రతులున్నవి.

1868లో 'విట్లీస్టోక్సు' (Whitley Stokes) అను కెల్టిక్ విద్వాంసుఁడు సిమ్లాలో 'ఇండియాకౌన్సిలు' కుఁ గార్యదర్శిగానుండి భారత వర్షములోని వేఱు వేఱు ప్రాంతములలో దొరకిన వ్రాతప్రతుల పట్టీని సంపూర్ణముగాఁ దయారుచేయసాగెను. మదరాసు ప్రభుత్వమువారు 'పిక్‌ఫర్డును' (Pickford) 1868 డిశంబరులో 'తంజావూరు' లోని గ్రంథముల పట్టీని దయారు చేయుఁడని కోరిరి; కాని కొంతపని జరిగిన తర్వాత నాయనకు జబ్బుచేయుటచేత 'ఇంగ్లండుకు' 1870లో భారతవర్షమునకు మరలరాకుండ వెడలిపోయెను. తర్వాత 'న్యాయాధీశుఁడగు 'బర్నెల్' (Burnell) 1871 మార్చిలో, గ్రంథముల పట్టీని వ్రాయుట నారంభించి, కొలఁది కాలములోఁ దయారుచేసి 1873 అగష్టు 6 తేదీన మదరాసు ప్రభుత్వపు ప్రధానకార్యదర్శిగారి కీల్లు బెంగుళూరునుండి వ్రాసెను. ఇంతశ్రీమకీ గ్రంథాలయము తగియున్నదా! యని బహుళ యడుగుచుందురు. నిస్సంశయముగా

136 M. Winternitz—History of Indian literature—Vol I-p. 40 "Buhler found in two Jain libraries in Khambay over 3000 Manuscripts and in the palace library of Tanjore in South India, over 12000 manuscripts."

నిది తగియున్నదని నేను ప్రత్యుత్తర మిచ్చెదను. దాదాపు అన్ని సంస్కృతగ్రంథములు వేరు వేరు పాఠాంతరములలోనున్న వనియందఱు గుర్తించిన విషయమే. ఈ విషయములో తంజావూరు గ్రంథాలయము అసమానమైనది. ఇంతవఱకు తెలిసిన అన్ని ముఖ్యమైన గ్రంథములలో చాల ఉత్తమమైన వ్రాతప్రతులు, కొన్ని క్రొత్త ప్రతులలోగూడ ఇందున్నవి. ...... తంజావూరు గ్రంథాలయము నేను యితర స్థలములఁ గనుగొన్న గ్రంథములకంటె క్రొత్తవి, కల్గియున్నది. ఇది చాల ముఖ్యమగు విషయము.

ఈగ్రంథాలయము, శీఘ్రముగానో, నెమ్మదిగానో, సర్కారునకు వారసులు లేని సొత్తుగా చేరునని నేను నమ్ముచున్నాను. విశేషము విలువగల సొత్తు సీగ్రంథములపట్టీ తయారుచేయుటవలన కాపాడఁబడనున్నది. సంస్కృతవ్రాతప్రతులు చాలకాలమునుండి చాలప్రియములుగానున్నవి. సరియైన వ్రాతప్రతుల నకళ్ళు తీయుఖరీదు చాలభారమైనది. తంజావూరు గ్రంథాలయమువంటి దేర్పఱపవలెనన్న. 50000 పౌనులకుఁ దక్కువ కాదని నాయభిప్రాయము. ఇందలి చాల వ్రాతప్రతులు నిస్సందేహముగా నద్వితీయమైనవి, లేక అమూల్యములైనవి.[137] ఇందలి వ్రాతప్రతులు, తాటియాకు, కాగితముపైన

---

137 Burnell "It may perhaps be asked if the library is worth the labcur spent on it. I can answer unhesitatingly that it is. It is now a recognised fact that nearly all Sanskrit works of importance exist in different recensions. The Tanjore library is unrivalled in this respect: it contains several good manuscripts of all the most important ones known as yet, including a few that are new......The Tanjore library, however, contains additional manuscripts of most of the works which I had discovered elsewhere, and this is a matter of great importance.

I believe that this library must, sooner or later, escheat to the Government. The preparation of this catalogue will therefore protect property of enormous value. Sanskrit manuscripts have long been very dear and the cost of making proper transcripts is now very heavy. As far as I can judge, it would not be possible to form a collection like that at Tanjore at a less cost than £ 50000, but many manuscripts are unquestionably unique. (See Andhra university publication No 11—A descriptive catalogue of the Telugu manuscripts. p II.)

లిఖింపఁబడినవి. ఇవి 11 కంటె నెక్కువ లిపులలో వ్రాయఁబడినవి. భారతవర్షములోని అన్నిప్రాంతములనుండి వచ్చినవైయున్నవి. సంస్కృతములోనే 24, 432 వ్రాఁతప్రతులు గలవు. ప్రపంచములోని సంస్కృత గ్రంథాలయములలోనెల్ల నిది గొప్పది. మదరాసు ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములో 22,270 సంస్కృత గ్రంథములు మాత్రమున్నవి. అది రెండవది. ఇంక నీ తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోఁ దెలుఁగు, తమిళ, మహారాష్ట్ర, ఆంగ్లభాషలలో వ్రాఁతప్రతు లనేకములు గలవు. దీని విలువ 50000 నవరసులకుఁ దక్కువ కాదనుటలో నాశ్చర్య మేమికలదు? ఇందులోఁ దెలుఁగువి 816 కాన్పించినవి. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు 1933లో వీని నన్నిటి నొక ప్రత్యేకమైన పట్టీగాతయారుచేసి, మనకు మహోప కార మొనర్చిరి.

# పంచమాధ్యాయము

ముస్లీమురాజుల కాలమున గజినీ, మెక్కా, మెడీనాలలో గ్రంథాలయములు- జలాలుద్దీను గ్రంథాలయము - తైమూరు గ్రంథాలయము - బహమనీరాజుల గ్రంథాలయములు- బీజపూరు రాజుల గ్రంథాలయము- టిప్పుసుల్తాను గ్రంథాలయము- మీర్ మహమ్మద్ ఆలి గ్రంథాలయము- మొగలాయిరాజుల గ్రంథాలయములు-మహమ్మదుషా, షాఆలమ్ గ్రంథాలయములు -

గజనీమహమ్మదు (998-1030) భారతవర్షముపై 17 సార్లు దండెత్తివచ్చెను. ఈయనకు విద్యావిషయములో శ్రద్ధగలదు. సాలీనా విద్వాంసులకు, కవులకు 4 లక్షల దీనారములు ఖర్చుచేయుచుండెనని, 'గుజిడా' వ్రాఁతలు తెల్పును. అంతియేకాదు, చలువరాయి, గ్రైనైటు రాతితోఁ గట్టఁబడిన మసీదు చెంతనే, యొక గొప్ప విశ్వవిద్యాలయము స్థాపించి, యనేక భాషలలోని విలువగల గ్రంథములను గూర్చెను.[138] దీనిలోనే చిత్రవస్తు ప్రదర్శనశాలగలదు. 'ఉన్సూరి' (Unsuri) అనువాఁడు 'గజినీవిశ్వవిద్యాలయము'లో నధ్యాపకుఁడు.

---

138 N. N. Law--Promotion of learning in India p 5. "was founded a university supplied with a vast collection of curious books in various languages."

'గజినీముహమ్మదు' తర్వాత కొన్నాళ్ళకు 'సుల్తాను ఇబ్రహీమ్' (1059-1099) అనువాడు, రాజ్యమునకు వచ్చెను. ఈయన చక్కగా వ్రాయనేర్చినవాడు. తాను విశ్రాంతిగా నున్నపుడు వ్రాసిన రెండు కురాను ప్రతులను, 'ఖలీఫాకు' మెక్కా, మెడీనా గ్రంథాలయములలో నుంచవలసినదని పంపెను.[139] దీనినిబట్టి యాకాలమున నన్నగా క్రీ. శ. 11వ శతాబ్దములో గజినీలోను, 'మెక్కా మెడీనాలలో'ను గ్రంథాలయములు గలవని స్పష్టపడుచున్నది.

'ఖిల్జీవంశము'లోని 'జలాలుద్దీను' (క్రీ. శ. 1290-1296) ఢిల్లీలోని ప్రభుత్వగ్రంథాలయమునకు గ్రంథాలయాధికారిగా దగినవానిని, అనగా 'అమీర్ ఖుస్రో' అను వానినేర్పఱచెను.[140] దీనిబట్టి అప్పటికి 'ఢిల్లీ'లో ప్రభుత్వ గ్రంథాలయము కలదనుట స్పష్టము.

'అల్లాఉద్దీను' (క్రీ. శ. 1296-1316) కాలమున, 'నిజాముద్దీను ఔలియ' అను సాధువుండెను. ఆయన సమాధి నేటికిని ఢిల్లీలో గలదు, ఆయన కొక గ్రంథాలయము గలదు. విద్వాంసుడైన షేక్ ఉస్మాను (Maqdum Sirajuddin) ఈయన ప్రథమశిష్యుడు. 'నిజాముద్దీను' మరణానంతరము, 'ఉస్మాన్', లక్నౌతి కేగుచు గురువుగారిగ్రంథాలయమునుండి, అనేకముఖ్యమైన గ్రంథములను గైకొనిపోయెను.[141]

---

139 Ibid p 14 "The Sultan.........sent two copies of the Quran which he had transcribed with his own hand during his leisure hours to Mecca and Medina as presents to the Caliph to be deposited in their respective sacred libraries."

140 Ibid p 31 "A noticeable feature of Jalaluddin's reign was that he chose the right person to fill the office of librarian for the imperial library at Delhi. This high post.........was conferred on Amir Khusrau."

141 Ibid p 36 "The learned and pious 'Nizamuddin Auliya', whose tomb in Delhi is looked upon as a very sacred place by all Muhammadans, also flourished at this time. The learned Shaikh Usman, who is also known as Maqdum Sirajuddin, was his first pupil Nizamuddin had a library. When, after his death, Usman removed to 'Lucknauti,' he took away many important books from the saint's library."

'బైమూరు' (క్రీ. శ. 1398-1412) సామరఖండములో నొక కళాశాల నేర్పఱచెను. ఆయన యనేక గ్రంథాలయములను స్థాపించి శంకుస్థాపనలను లెక్కింటిని జేసెను. 'లక్నో'లో 'నవాబ్ జలాలుద్దౌలా గ్రంథాలయములో, జ్యోతిషశాస్త్రమొకటి గలదని, దానిని 'ఫిరోజ్‌షా' (1351-1388) కాలమున సంస్కృతమునుండి పారసీక భాషలోని కనువాదముచేసిరని, 'ఎలియట్' వ్రాసెను. అదియునుగాక పశుచికిత్సాశాస్త్రసంబంధమగు 'కుఱ్ఱుతులముల్క్' అను గ్రంథము కూడగలదు. దీనికి మూలగ్రంథము 'సాలోతర్' (Salotar)అని తెలియుచున్నది.[142]

బహమినిరాజులలో 'ముహమ్మద్‌షా బాహ్మనీII (క్రీ. శ.1463-1482) ప్రసిద్ధుడు. ఈయనమంత్రి 'మహమ్మద్‌గావాన్' గొప్పవాడు. ప్రసిద్ధ లేఖకుడు, కవి, నిరాడంబరజీవి. ఈయనమరణమునకు రెండేండ్లు ముందుగా, 'బీదర్' (Bidar) లో నొకదివ్యమైన సర్వకళాశాలను నిర్మించెను. దీనిని 'ఫెరిస్టా' చూచెను. దీనిలోనికి విద్యార్థుల కొక గ్రంథాలయము 3000 సంపుటములుగల దానిని జేర్చెను. తీరిక సమయములో 'సర్వకళాశాల'లో గూర్చుండి, విద్వాంసులమధ్య గడపుచుండెను. 'ముర్తాజాహుస్సేన్' వ్రాతలనుబట్టి, 'ముహమ్మద్‌గవాన్' గృహములో 35000 గ్రంథములు లభించినవని తెలియుచున్నది.[143]

---

142 Ibid p 70 "Mr. Elliot says that in the library of Nawab Jalaluddaulah at Lucknow, there is a work on astrology translated from Sanskrit into Persian in Firuz Shah's reign. There is also another work on the veterinary art called kurrutul-mulk translated from the Sanskrit original styled Salotar."

143 Ibid p 89 "The college was equipped with a library for the use of its students, containing 3000 volumes.

Murtaza Husain says, in his Hadiqatual aqalim, a modern work (M. S in A S B, leaf 39) that from Mahmud Gawan's house, 35000 books were obtained."

C. F. E. Keay M. A.—Ancient Indian education. p 119 "The college which Mahmud Gawan-minister of Muhammad Shah (1463—1482) built at Bidar, is said to have possessed a library of 3000 volumes."

అహమ్మదునగరము, బీజపురములలో ప్రసిద్ధమైన గ్రంథాలయము లుండెను. బహమనీరాజుల 'అహమ్మదునగర' గ్రంథాలయమును స్వయముగా 'ఫెరిష్టా' యను చరిత్రకారుడు చూచియుండెను.144 బీజపుర గ్రంథాలయములోని యొక్క వ్రాతప్రతి బ్రిటిషు చిత్రవస్తు ప్రదర్శనశాలలోనున్నది.

బీజపూరులో 'ఇబ్రహీమ్' ఆదిల్‌షాహ్ II కాలమున (1579-1596) నొక గ్రంథాలయము కాన్పించుచున్నది. ఇవినేటికి బీజపూరులో ఆసరిమహాలులోఁగలవు. 'ఫెర్గుసన్' వ్రాతలనుబట్టి దీనిలోని కొన్ని పుస్తకములు వింతలుగాను. ముచ్చటగొల్పునవిగాను ఉండెనని తెలియుచున్నది. ఇవి పారసీ అరబ్బీ భాషలలో నున్నవి. క్రీ. శ. 1686 లో 'ఔరంగజేబు' ఈరాజ్యముజయించి విలువగలయన్ని గ్రంథములను బండ్లపైన వేయించు కొనిపోయెను. కొలదిప్రతులుమాత్రము మిగిలి యున్నవి.145 ఆసరిమహాలునకుఁబోయి ఆదిల్‌షాహి గ్రంథాలయమును మనము దుఃఖముతో నేడుచూడవచ్చును.

'షోబరల్' (Shoberl) వ్రాతలనుబట్టి, మైసూరులో నంతిమ రాజగు టిప్పుసుల్తాను (1782-1799) కనేక ప్రాచ్యభాషలు తెలియునని, అనేక ఐరోపీయ ప్రాచ్యగ్రంథములతోఁగూడిన గ్రంథాలయమొండుగలదని తెలియవచ్చుచున్నది. టిప్పుసుల్తాను చనిపోయినపుడు చూడఁగా, లేఖలకట్టలు రెండును, అమూల్యమైన గ్రంథాలయ

144 V. A. Smith—Oxford history of India p 299 "Fine libraries are known to have existed at Ahmednagar and Bijapur. One illuminated manuscript from the latter is in the British Museum.' N. N. Law—Promotion of learning in India—p 90 "we should note here that the Bahmani kings had a library at Ahmednagar, which Ferishta visited."

145 Ibid. p 94—Fergusson tells us 'Some of its books are curious and interesting to anyone acquainted with Arabic and Persian literature. All the most valuable manuscripts were, it is said, taken away by Aurangzib in cart-loads, and what remain are literally only a remnant, but a precious one to the persons in charge of the building who show them with a mournful pride and regret."

మొకటియుఁ గాన్పింపఁగా, వానిని కలకత్తాకు ఆంగ్లేయులు తోడ్కొని పోయిరి.[146]

బెంగాలులో 'అలివర్దీఖాను' 18వ శతాబ్దములో ననేక విద్వాంసులను తన ముఖ్యనగరమగు 'మూర్షిదాబాదు'లో నుండుట కాహ్వానించెను. 'మీర్ ముహమ్మద్ ఆలి' ఇందులో నౌకరు. ఈయనకు 2000 సంపుటములుగల గ్రంథాలయ మొండుగలదు.[147]

మొగలాయి చక్రవర్తుల గ్రంథాలయములు:- మొగలాయిచక్రవర్తులలో 'బాబరు' (1526-1530) మొదటివాఁడు. ఈయన క్రీ. శ. 1526లో, పానిపట్టు యుద్ధముచేసి, 'లోడీల' నోడించి, మన దేశమును జయించెను. ఈయన యాస్థానమున, ఖుందమిర్ అను విద్వాంసుఁడుండెను. ఈయన 'హీరట్' నుండి, అనేక కష్టములఁ దప్పించుకొని, హిందూస్థానమునకుఁ జేరి 'బాబరు' ఆస్థానములో నుండెను, హుమాయూను రాజైన తరువాతకూడ నీయన జీవించియుండెను. 1535వ సంవత్సర ప్రాంతమున, గుజరాతులో నీయన 'హుమాయూను'తోఁ బాటు వెళ్ళి చనిపోయెను. ఈయన లేతరికములో 'హీరట్'లోని 'సుల్తాన్ హుస్సేన్' యొక్క అమాత్య శేఖరుని సాయమును బొందెను. ఈమంత్రి ఆకాలమున ప్రసిద్ధికెక్కిన గ్రంథములనుగూర్చి, యమూల్యమైన గ్రంథాలయ మేర్పఱచి 'ఖుందమీర్'న కప్పగించెనని ఎలియట్ వ్రాసెను.[148]

---

146 Ibid p 96 'Tipu Sahib, the last sovereign of Mysore' understood several oriental languages, and possessed a library enriched with all sorts of European and Eastern works." (Shoberl's Hindustan in miniature, Vol IV. p 215, 216.)

V. A. Smith—Oxford history of India (1923) p 585, "He left behind him two collections of letters, and possessed a valuable library. which was removed toCalcutta."

Ishwari Prasad—A new history of India—p 427 "He had a large library which was after his death transferred to Calcutta."

147 N. N. Law—Promotion of learning in India—p 112 "Mir Muhammad Ali possessed a library of 2000 volumes."

148 N. N. Law—Promotion of learning in India. p 124 "In his early career as an author, he had been much helped by the learned minister of Sultan Husain of Hirat, who collected a valuable library of the most esteemed works of the time, and placed him in charge of it (Elliot. Vol IV)

'బాబరు' కాలమున గ్రంథములలోఁ జిత్తరువులు గీయు ఆచారము గలదు. బాబరుకుఁగూడ చిత్తరువులు గీయుటయన్న నపేక్షమెండు. తన పూర్వుల గ్రంథాలయమునుండి అన్నివిధములగు, నమూనాలను గైకొని, భారతభూమికి వచ్చెను. వీనిని తిరిగి తర్వాత, 'నాదిర్ షాహ' ఢిల్లీనిజయించి పారసీకమునకుఁ గైకొనిపోయెను. భారతీయుల చిత్రకళ మీఁద నీవ్రాఁతప్రతు లద్భుత ప్రభావమును గన్పఱచుచున్నవి.149

'పంజాబు'లోని 'అఫ్గన్ సర్దారగు ఘాజిఖాన్' బాబరును, ఇబ్రహీం లోడీ యొక్క క్రూరమగు బాధలనుండి ఆఫ్గనుల విడిపింపవలసిన దని కోరెను. బాబరు దేశముపై దండెత్తుట కాహ్వానించెను. ఆయనకు విలువగల పుస్తకములు గల చక్కని గ్రంథాలయ ముండెను. బాబరు వానిని రాజద్రోహమునకు ఖైదులోవేసెను. అతఁడు తప్పించుకొన్న తర్వాత, గ్రంథాలయమును బరీక్షించి వానిలోఁ గొన్ని గ్రంథములను 'హుమాయూను కామరాను'ల ఉపయోగార్థము పంపెను.150 ఈగ్రంథములు బహుమూల్యములు. ధార్మిక విషయ సంబంధములు. ఈగ్రంథాలయములోని కొన్ని వేదాంత సంబంధములగు గ్రంథములు

---

149 Ibid. p 126 "Babar was interested in painting and took with him to India all the specimens he could collect from the library of his ancestors (the Timurides) some of which were taken back to Persia, by Nadir Shah after the conquest of Delhi. These manuscripts exercised the greatest influence on the art of India"

150 Ibid p; 125 "Ghazi Khan, the Afgan noble of the Punjab, who invited Babar to deliver the Afgans from the Emperor Ibrahim, had a good library, containing a number of valuable books. Baber imprisoned him for treachery, and after his escape, examined the library in 1525 A. D, and sent some of its books to Humayun and Kamran for their use The library had in it a few theological books which also attracted the notice of the Sultan. However, Babar was not satisfied with the collection, for says he "I did not on the whole find so many books of value as, from their appearance I had expected" (Talboit's Memoirs of Babar p. 176")

Also see— Vrajaratna Das — Humayun nama p. 4 and 13 (Hindi Book)

సుల్తాను దృష్టి నాకర్షించెను. కాని 'బాబరు' అనుకొన్నంతగా తృప్తిపడ' లేదు. బాబరిట్లు చెప్పెను. ''వానిని జూచినపుడు, నేను తలంచి నట్లుగా, మొత్తము మీఁద అంత విలువగల గ్రంథములు కాన్పింప లేదు.''

'బాబరు' కూఁతురు 'గుల్బదన్ బేగమ్' హుమాయూన్ నామా' యను గ్రంథమునులిఖించెను. ఈబేగమ్ తనగ్రంథాలయమునకు గ్రంథములను గూర్పసాగెను.[150(a)] పుస్తకములఁ గూర్చుటలో నీమెకు సర్దా మెండుగాఁగాన్పించుచున్నది. ఈమె స్వహస్తముతో వ్రాఁయబడిన గ్రంథము, 'ఇంగ్లండు'లోనిచిత్రవస్తు ప్రదర్శనశాలలో సురక్షితముగా నున్నది. ఇది పారసీక భాషలోనున్నది. 'కర్నల్ హామిల్టన్' ఇంగ్లండునకుఁ బోవుచు, ఢిల్లీ, లక్నోలలో సంపాదించిన 1000 వ్రాఁతప్రతులను వెంటఁగైకొనిపోయెను. ఆయనభార్య 1868లో బ్రిటిషు చిత్రవస్తు ప్రదర్శనశాలకు 352 పుస్తకములనమ్మెను. అందులో నీవ్రాఁతప్రతి గలదు 'డాక్టర్ రివు' ఈపుస్తకములనూచి తయారు చేయుచు, నీపుస్తకము, సర్వోత్తమమైన వానిలోఁ బరిగణించెను, 'యస్. బేవరిజ్' 19వ శతాబ్దాంతములో దీనినింగ్లీషులోనికి మార్చి యొకక్రొత్తగ్రంథమాల(Royal Asiatic Society and oriental translation fund) లోఁ బ్రకటించెను. భారతవర్షములో, గ్రంథాలయమేర్పఱచిన మొదటి నారీరత్నము 'గుల్బదన్ బేగమ్' అని చెప్పవచ్చును.

హుమాయూను (1530-1556) నకు గ్రంథములన్న ప్రేమ మెండు. దండయాత్రలలోఁ గూడ కొన్నిపుస్తకములనేరుకొని, వెంటఁగైకొని పోవుచుండెను. కాంటునోయర్ వ్రాఁతలప్రకారము హుమాయూన్ పాఱిపోవుచున్నపుడుకూడ గ్రంథాలయాధికారిని కొన్నియభిమాన గ్రంథములు వెంటఁ దనతోఁ గైకొనిపోవుచుండెనని, తెలియుచున్నది. కాంబేలో మకాము వేసినపుడాయన వెంట చాల గ్రంథములుండెను.

---

150 (a)— N. N. Law—Promotion of learning in India—p 201. 'It appears also that Gul-badan used to collect books, for a library of her own." (Humayun Namah of Gul-badan Begum, by Mrs. Beveridge 76.)

అందులోనొకటి 'తామర్ లేన్' చరిత్రము లేక తైమూరు చరిత్రము. దీనినచటి ఆటవిక జనులగు క్యూలిస్ (Qulis) అను తెగవారు ఒకనాటిరాత్రి అతని మకాముమీద దండయాత్రచేసి, దానిని గైకొనిపోయిరి. ఈపుస్తకము తర్వాత నెట్లో లభించెను. లాలాబేగ్ తండ్రి నిజామ్ (Baz Bahadur) సుల్తానునకు గ్రంథాలయాధికారిగా నుండెను. షిర్‌షా చేత పురాణఖిల్లాలో షీర్‌మండల్ కట్టింపబడెను. ఇది ఉల్లాస మందిరముగానుండెను. హుమాయూను రెండవ పర్యాయము రాజైన తర్వాత, దీనిని గ్రంథాలయముగా మార్చెను. ఇచటనే యతని ప్రాణముపోయెను.[151]

సియారల్‌ముతాఖిరిన్ గ్రంథకర్త వ్రాతల ప్రకార మొకనాడు శుక్రోదయమగునని సాయంకాలము, దానిని జూచుటకు, హుమాయూను గ్రంథాలయము యొక్క పైభాగమున కేగెను. క్షణముసేపు నిల్చుండి దిగ నిచ్ఛగల్గుటచేత, క్రిందకు రాబోవుచుండెను. ఇంతలో ప్రార్థనకు బిలుపువచ్చినది. హుమాయూను రెండవ మెట్టుపైన గూర్చుండవలెనని, యెంచునంతలో, మెట్లు శుభ్రముగా, నున్నగా నుండుటచేత, జారుచున్నట్లుండెను. అతని రాజదండముయొక్క పొన్నుజారి, హుమాయూను, తల క్రిందుగా బడి, నేలమీదకొరుగుటచేత నవయవములు, కీళ్లు తలయొక్క కుడిప్రక్కైపు చాలగాయపడెను. అప్పుడాయన స్మృతితప్పి పడిపోయెను.

---

151 N. N. Law—Promotion of learning in India—p 132 "Humayun was fond of books, and even during expedition carried a select library with him. While fleeing as a fugitive, Count Noer says, he took with him his librarian and a few of his favourite books. While he was encamped at Cambay he had with him several books, among which was a remarkable copy of the History of Tamerlane, which was taken away by a body of Qulis, a forest tribe, in a night attack upon his camp. This book, however, was subsequently recovered. Nizam, father of Lala Beg, styled Baz Bahadur, was a librarian to the Sultan. (Tujaki— Jahangiri by Rogers and Beveridge. p 21),

తరువాతఁ గొన్నాళ్ళకు1556 జనవరిలోఁ జనిపోయెను 152 ఈచక్రవర్తి పారసీ, అరబ్బీ, తురుష్క భాషలలో గొప్పపండితుఁడు, జ్యోతిష భూగర్భ శాస్త్రముల నెరింగినవాఁడు, పారసీలోఁ గవియునైన హుమాయూను తన ప్రాణప్రియమైన గ్రంథాలయము పైభాగము నుండి జారిపడి మరణించెను.

అక్బరు (1556-1605) చక్రవర్తి, కవుల, పండితులఁ బోషించెను. సంస్కృతములోని యనేక గ్రంథములు పారసీ, హిందీ భాషలలోనికి మార్పించెను. మహాభారతము, రామాయణము, అథర్వవేదము, లీలావతీగణితము, హరివంశము, పంచతంత్రములఁ బారసీక భాషలోనికి మార్పించెను. అనువాదములు చేయించి ప్రభుత్వ గ్రంథాలయములోనుంచి నకళ్లు తీయించుచుండెను. అక్బరు అనేక గ్రంథములను, దన గ్రంథాలయమునకుఁ గూర్చుటలో నుల్లాసపడుచుండెను. ప్రభుత్వ గ్రంథాలయములోని కొన్ని గ్రంథములు అంతిపురములోను, మిగతవి తక్కిన గదులలోను నుంపఁబడుచుండెను. తన గ్రంథాలయ నిర్వాహకమునకుఁ జక్కని యేర్పాట్లనేకములు చేసెను. గ్రంథములను శాస్త్రములు, చరిత్రలు, అను శీర్షికలలో నేర్పఱచెను. 'ముల్లాపీర్ మహమ్మద్' అను ఉద్యోగి, ఒకమారు గ్రంథాలయమునకు సంబంధించిన గొప్ప యుద్యోగియైయుండెను.153

అక్బరొకనాఁడు గుజరాతుపై దండెత్తి, యచట ఇతిమాద్ ఖాన్ గుజరాతి, (Itimad Khan Gujrati) యొక్క గ్రంథాలయమును

---

152 Ibid—p 133—"In the evening, in order that he might see that planet, he went on to the top of the roof of his library.......... He became altogether insensible and died some time after. (Jan 1556 A. D.)

153 Ibid—p 151 "The emperor took much delight in the collection of books in his library, a feeling natural to all bibliophiles. Some of the books in the royal library were kept in the harem and the rest in the outer apartments. He made several provisions for the good management of his library, and its books were classed under sciences and histories..........Mulla Pir Muhammad was at one time the superintendent of the library."

గైకొనివచ్చెను. వానిలోఁ జాలశ్రేష్ఠములగు గ్రంథములుండెను. అక్బరు వానిని ప్రభుత్వ గ్రంథాలయమునందుంచి, తర్వాత తీసి పుణ్యులగు పండితులకుఁ బంచిపెట్టెను'. ఫైజీ' చనిపోయినపుడు, చూడఁగా నాయనకు 4600 సంపుటములుగల గ్రంథాలయము గాన్పించినది. ఇందులోఁ గొన్ని బహుజాగరూకతతో విశేషవ్యయముతో వ్రాయఁబడెను. ఇవియన్ని ప్రభుత్వ గ్రంథాలయమునకుఁ జేర్పఁబడి, పట్టీలు వ్రాయఁబడి, వరుససంఖ్య వేయఁబడి, 3 భాగములుగా విభజింపఁబడెను. మొదటి భాగము పద్యకావ్యములు, వైద్య, జ్యోతిష సంగీతసంబంధములు. రెండవభాగము శబ్దవ్యుత్పత్తిశాస్త్రము, తత్త్వశాస్త్రము, ఖగోళశాస్త్ర, క్షేత్రగణితసంబంధములు, మూఁడవది వ్యాఖ్యలు, సాంప్రదాయములు, వేదాంతము న్యాయశాస్త్రసంబంధములు. ఫైజీగ్రంథాలయమున నలదమయంతులు అను పద్యప్రతులు 101 ఉండెను.[154]

ఆగ్రాకోటలో నొకగదిలో అక్బరు గ్రంథాలయముండెనని 'హావెల్' అను చరిత్రకారుఁడు వ్రాసెను. అనేకగ్రంథములు చిత్రపటసుశోభితములై యుండెను. పారసీక గ్రంథములన్ని నానావిధములగు బొమ్మలతో నిండియుండెను. క్విస్సాహంజాహా (Qissah Hamzah) అను 12 సంపుటముల గ్రంథము 1400 చిత్రపటములతో సర్వాంగ సుందరమైయుండెను. రజమ్‌నామాహా (Razm Namah-Book of war) అనఁగా మహాభారతము వ్రాయుంచుటకు అక్బరు చక్రవర్తికి 40,000 సవరసుల ఖర్చాయెను. ఈనాఁడా ప్రాతప్రతి జయపూరులో

---

154 Ibid p 152 "The emperor acquired a library belonging to Itimad Khan Gujrati during the conquest of Gujrat. It contained many fine books which were placed in the royal library, but were subsequently distributed by the emperor among learned and pious men.———When Faizi died, he left a library containing 4600 volumes, some of which were exquisitely copied with extravagant care and expense———They were all removed to the king's library, and catalogued and numbered in 3 different sections.—.— There were 101 copies of the poem Nal-Daman in Faizi's collection."

నున్నది.155 పుస్తకములయంచుల శృంగారించుటకు, తెలివి తేటలు బుద్ధిసూక్ష్మతగల చిత్రకారులుండిరి. పుస్తకములకు అట్టగట్టుటకు (Binding) విశేషధనము వ్యయము చేయఁబడెను. అశోకచక్రవర్తికి సాటియైన ఈచక్రవర్తి, గ్రంథాలయకృషికిఁ జేసిన ప్రయత్నములు చిరస్మరణీయములు.

అక్బరునకు లలితకళలన్న నభిమానముమెండు. చిత్రలేఖనమునకుఁ బ్రోత్సాహ మొసంగుచుండెను. అతని యాస్థానముననున్న ఉద్యోగులందఱిబొమ్మలు గీయించి, యొక సంపుటముగాఁ దయారుచేయించెను.156 అచ్చురాక పూర్వము, ప్రాచీనులు చక్కని, పరిశుభ్రమైన, స్పష్టమైన దస్తూరిని శ్లాఘించుచుండిరి. అక్బరుకాలముననిట్టి వ్రాయసకాండ్రనేకులు గలరు. ఇదియొక కళగానభిమానించుచుండిరి. అక్బరునకు, రత్నములచే నలంకృతమైన కలముండెను. ప్రతిదినము సాయంకాలము గ్రంథమును జదివించుకొని పుటలసంఖ్య స్వయముగా వేయుచుండెను. షానామా మున్నగు గ్రంథములుగాక, చారిత్రక గ్రంథములనుగూడ అక్బరు చదివించుకొనుచుండెను. అక్బరు కాలమున విదేశములలో కోర్డోవా, కైరో, మెర్వ్, బుఖారా, బాగ్డాడ్, మున్నగుచోట్ల ముస్లిము గ్రంథాలయములు కలవుకాని 24000 సంపుటములు గలిగిన, యమూల్య గ్రంథరాజములుగల ఈగ్రంథాలయమున కవిసాటిరావు.

---

155 Ibid—p 153 "In the Agra fort there is a room which is pointed out as the place where a library was located."

While dwelling on libraries, we should not omit to notice how painting was laid under contribution to beautify and illustrate the books in the royal library. Persian books in prose and verse were richly illuminated by eminent artists. The Qissah Hamzah in 12 volumes was profusely illustrated by so many as 1400 paintings. ........The famous manuscript of Razm—Namah is said to have cost Akbar about £ 40,000—a sum which in our days would be much greater. It is now at Jaipur."

156 Ibid p 155 "The portraits of all the principal officers of he court were made by the court painters, and were bound up into a thick volume."

'అక్బరు' గ్రంథాలయమునుగూర్చి, వి. ఏ. స్మిత్ అను చరిత్ర కారుఁడిట్లు వ్రాసియుండెను. "అక్బరునకు చదువుట, వ్రాయుట తెలియదు. అక్బరు, బ్రహ్మాండమైన గ్రంథాలయమును, అసాధారణమైన విలువగలదానిని, సంపాదించెను. దీనికి సాటియైన దప్పటికిఁగాని, యింతకుఁ బూర్వముగాని, ప్రపంచములో లేదు. అన్ని గ్రంథములు వ్రాఁతప్రతులు, ……… 1605 అక్టోబరులో నీగ్రంథాలయమును గనిపెట్టిరి. గొప్పవారిచేత వ్రాయఁబడిన గ్రంథములు, ఇందధికముగా ప్రాచీనులగు, ఉన్నతభావములుగల గ్రంథకర్తలచే వ్రాయఁబడినట్టి, మిగుల విలువగల యట్టలచే నలంకరింపబడినట్టి, అనేకసందర్భములలో గొప్పచిత్రకారులచే గీయఁబడినట్టి, చిత్రపటములచేత సుశోభితమైనట్టి 24000 గ్రంథములు, గలవు. వీని విలువ ఆరున్నర మిలియనులు లేక రు 64,46,373 లు. ప్రతిసంపుటము నగటు ఖరీదు దాదాపు 27 పౌనులనుండి 30 పౌనులవరకుండెను. 4300 ఉత్తమమగు వ్రాఁత ప్రతులేరినవి, 1595లో 'ఫైజీ' మరణానంతర మీగ్రంథాలయమునకుఁ జేర్పఁబడెను. ఈలెక్కలన్ని ఇద్దరు పాశ్చాత్య గ్రంథకర్తలగు 'మాఁరిక్' (Manrique) 'డిలాక్టు' (Delact) అనువారలచేత స్వతంత్రముగాఁ దయారుచేయఁబడిన, సర్కారు జాపితాలనుండి కైకొనఁబడియుండుటచేత, నీలెక్కలనుగూర్చి సందేహింపవలసిన పనిలేదు.157

---

157 V. A. Smith—Akbar the Great Moghul (1919) p 424 "Akbar did not know to learn or write. He collected an enormous library of extraordinary peculiary value to which properly no parable there existed or even has existed in the world—All the books were manuscripts……Discovered in Oct 1605. Books written by great men, mostly by ancient and serious authors adorned with extremely valuable bindings and in many cases enriched with costly illustrations by the best artists numbered 24000 valued at nearly 6½ millions or Rs. 64,46,373. Average volume costs to about £ 27—£ 30. 4300 choice manuscripts had been transferred from Faizi's library} after his death in 1595. The figures of the inventing are beyond doubt being taken from official registers copied independently by two European authors (Manrique and Delact) (See the

'అక్బరు' కాలములోనే 'బైరామ్ ఖాను కుమారుఁడు 'అబ్దుల్ హీమ్' కొక గ్రంథాలయము కాన్పించుచున్నది. గ్రంథములఁ వుటకొరకు, భాషాభివృద్ధికొరకు పలువురు విద్వాంసులచటికి చ్చుచుండిరి. ఇదియెంత పెద్దగ్రంథాలయమో, దీని వివరములేవియో గమునగాఁ దెలియకున్నవి.158 కాని 'రహీమ్' గొప్పపండితుఁడుగాను రసీ, తురుష్క, అరబ్బీ, హిందీభాషల నెఱింగినవాఁడుగాఁ న్పించును. 1590 లో 'బాబరు' ఆత్మచరిత్రము నీయన పారసీ నికిమార్చి అక్బరున కొసంగెను.

ఆకాలముననే బైరామ్ ఖాఁ జన్మభూమియగు బాదక్షానునకు గ్గఱగా, 'పర్షియా'లో హుల్వానులో నొక ప్రాచీన గ్రంథాలయము లదని, ఈగ్రంథాలయములోని యేర్పాట్లన్ని యనేకవిధములుగాఁ లు చక్కగానుండెనని, యచటకుఁ జేరినవారికి గ్రంథములు చదివి నిపించుచుండెడివారని, క్రీ. శ. 1237 నాఁటిదగు 'హరిరి' అను నాఁతప్రతినిబట్టి, యందలి చిత్తరువులఁబట్టి మెఱుంగవచ్చును. ముస్లిము గ్రంథాలయముల పటములీ గ్రంథములోఁదక్క నింక చటను గాన్పింపవు

'జహాంగీరు' (1605-1628) కూడ చదువుకొనియుండెను. స్వహస్తముతో 'బాబరు' వ్రాసిన 'ఆత్మచరిత్రము' యొక్క ప్రతి యీయనచెంతనే యుండెను. ఇద్దరు చరిత్రకారుల సాయములో జహాంగీరు'కూడ 'ఆత్మచరిత్రము' (జహాంగీరునామా) వ్రాసికొనెను.

---

easures of Akbar in J.R.A.S. 1915) F. E. Keay—Ancient Indian ducation. "Akbar was particular in building up a great library nd almost every day he had books from it read to him."

158 N. N. Law—Promotion of learning in India—p 170 "Abdul ahim had a library to which many learned men used to come for udy and self-improvement." We are left in the dark as to how big s library was. Pictures of old libraries of Muhammadan gentle. en of India or of any other place are very rare. I append hereto representation of an ancient library at Hulwan, in Persia, a ountry very near to Rahim's father's birth Place, Badakshan. It atisfies our curiosity as to several points regarding the internal rrangement of the library.

అది పూర్తియైన తర్వాత, తన గ్రంథాలయములో వ్రాతప్రతులు వ్రాయువారిని, నకళ్ళుతీయుమనెను. ముఖ్యమైన సర్కారు ఉద్యోగులకు, గొప్ప పలుకుబడిగలవారికి, దేశములోనివారికి కొందఱికొసంగవలెనని, చక్రవర్తి ఉద్దేశము. మొదటిప్రతి 'కుమారుడగు' 'షాజహాను' కొసంగెను.159

'జహాంగీరు' కాలములో 'మక్తుబ్ ఖాన్' ప్రభుత్వ గ్రంథాలయమునకు, ప్రధానోద్యోగిగానుండెను. 'జహాంగీరు' ఘూర్జరదేశమేగినపుడు, వానితోఁబాటొక గ్రంథాలయమును గైకొని పోయెను. ఈనిదర్శనమునుబట్టి ఈయనకుకూడ, తండ్రివలెనే గ్రంథములందు గలప్రేమ స్పష్టపడుచున్నది. 'గుజరాతు'లోని 'షేకులకు' 'జహాంగీరు' తన గ్రంథాలయమునుండి, తాఫ్సిరి హుసైని (Tafsiri Husaini) 2 తాఫ్సిరి కాశ్శఫ్ (Tsfsiri Kashshaf)3 రౌజాతులాహ్బాబ్ (Rauzatulahbab) అను గ్రంథముల నొసంగి, పుస్తకముల వెనుక వైపున, తాను గుజరాతునకు వచ్చిన తేది, ఆపుస్తకమునిచ్చిన తేది లిఖించెను. 'మార్టిన్' అను లేఖకుని వ్రాతలఁబట్టి చూడఁగా, నతనికి గ్రంథములందుగలప్రేమ, అభిలాషవ్యక్తమగుచున్నది. ఆకాలమున పారసీక వ్రాతప్రతులకు విశేషద్రవ్య మొసంగుచుండిరి. ఒక వ్రాత

---

159 Ibid p—174 "He wrote his memoirs with his own hand, but two historians had a hand in the work, viz Muhammad Hadi and Mutamad Khan. When it was completed, he ordered the mutasaddis (Scribes) of his library to prepare copies to be distributed among the chief Government officers, and to be sent to great and influential men in all parts of the country. The first copy was presented tc Shah Jahan. Ibid p 175 "During Jahangir's riegn Maktub Khan was a superintendent of the Royal library.——When Jahangir went to Gujrat, he took a library with him, which shows that love of books which was so marked a trait in his father's character was inherited by him to the Shaikhs of Gujrat, he presented from his library such books such as the Tafsiru Husaini, the Tafsiri Kashshaf and the Rauzatul Ahbab. Ibid p 176 Martin—The manuscript for which Jahangir paid 3000 gold rupees a sum equivalent to £ 10000—would not fetch £ 2000 at a sale in Paris today."

ప్రతికి 'జహాంగీరు' 3000 బంగారురూప్యములను లేక 10000 పౌనుల నొసంగెను గాని ఈనాఁడది అమ్మిన 'పారిసులో' 2000 పౌనులు కూడ విలువచేయదు. 'కురాను' ప్రతి కాకాలమున పదిలక్షల ప్రాంకులకు సమానమగు విలువ నొసంగుచుండిరి.

'షాజహాను' — (1628-1659) ఈయన కాలములోఁ గూడ ప్రభుత్వ గ్రంథాలయముగలదు. చక్రవర్తి రాత్రి 8½ గంటలకు, అంతిపురమునకుఁ బోవుచుండెను. రెండు లేక మూఁడు గంటల కాలము స్త్రీలపాటలువినుచు ప్రొద్దుపుచ్చుచుండెను. రాజు నిద్రించు వఱకు, చక్కఁగా చదువునేర్చినవారు పర్దావెనుక కూర్చుండి గ్రంథములు చదువుచుండిరి. రాజుగారి శయన మందిరమునకిది కొంచెము దూరముననేయుండెను. యాత్రా సంబంధములు, ఫకీరుల ప్రవక్తల జీవితములు పూర్వపురాజుల చరిత్రములు రాజునకు వినిపించుచుండిరి. వీని యన్నిటిలో ముఖ్యముగా 'తైమూరు జీవితచరిత్రము, బాబరు ఆత్మచరిత్రము షాజహానునకుఁ బ్రియతమములైయుండెను.[160] వీనిని వినుచు రాజు నిద్రించుచుండెను.

'ముహమ్మద్ అమిని ఖ్వాజవాని' రచితమగు 'షాజహానునామా' అను గ్రంథమునుబట్టి, 'బాబరు' స్వహస్తముతో లిఖింపఁబడిన 'ఆత్మ చరిత్రము షాజహానుయొక్క గ్రంథాలయములోఁ గలదని తెలియు చున్నది.[161] ప్రభుత్వ గ్రంథాలయము 'షాజహాను' కాలమునఁ గూడ వృద్ధిలో నున్నట్లుగాఁ గాన్పించుచున్నది.

షాజహాను కుమారుఁడు 'దారా' గొప్ప విద్వాంసుఁడు, అరబ్బీ, పారసీ, సంస్కృతములలోఁ బండితుఁడు. ఈయనదగ్గరకూడ చాల గ్రంథములున్నట్లు గాన్పించుచున్నది. ఈయన ఉపనిషత్తులను పార సీక భాషలోనికి మార్చెను. భగవద్గీతను, యోగవాశిష్ట రామా

---

160 N. N. Law—Promotion of learning in India—p 182 "Among them the life of Timur and the autobiography of Babar, were his special favour ites."

161 Ibid p 182 "It appears from Shah Jahan Namah, by Muhammad Amini Qazwani, that a copy of the memoirs in Babar's hand writing, was in Shah Jahan's library."

యుణము మున్నగు వానిని దర్శుమూ చేసెను. తెలంగాణా బ్రాహ్మ ణుడు, పండితుఁడగు జగన్నాథరాయ లీయన మిత్రుఁడు; 'దారా'ను హత్య చేసినతర్వాత, (క్రీ. శ. 1659) జగన్నాథరాయలు, కాశికి వెళ్లిపోయి, అచటభార్యయగు 'లవంగి'తోఁ(ముస్లింస్త్రీ) గొన్నాళ్ళుండి 'అప్పయ్యదీక్షితులు' మున్నగు బ్రాహ్మణులుచేయు నవమానపరం పరల భరింపలేక 'లవంగి'తోఁబాటు 'భాగీరథి'లోఁబడి మునిఁగి యసువులఁబాసెను.162 ఈసందర్భముననే గంగాలహరి 53 శ్లోకములు గల పుస్తకము వ్రాయఁబడినట్లు గాన్పించుచున్నది.

ఔరంగజీబు - (1659-1707) ఈయన లెస్సగాఁ జదువుకొనెను. అరబ్బీ, పారసీ, భాషలు చదువను, వ్రాయను నేర్చినవాఁడు. 'టర్కీ' భాషకూడ ఎఱుంగును. అనేక తత్వగ్రంథములఁ జదివి యుండెను. ఈయన దినచర్యనుబట్టి చూడఁగా ఉదయము 5 మొదలు 7 వరకు సాయంత్రము 2-30 మొదలు 5-30 వరకు 'కురాను' చదివి వ్రాసి కొనుచు, ముస్లిము భక్తుల చరిత్రములఁ జదువుకొనుచుండెను. ప్రతి గురువారము సాయంత్రమంతయు పవిత్ర గ్రంథములఁ జదువు కొనుచు, ప్రార్థనలఁ జేసికొను చుండెను. ఈయన వ్రాసిన మరణశాసనమును బట్టి, ఔరంగజీబు స్వయముగా 'కురాను' ప్రతులనువ్రాసి, వానిని విక్రయించి, వచ్చిన ద్రవ్యముతోఁ దనఖర్చులను వాడుకొనుచున్నట్లు తెలియుచున్నది. ఆయన చనిపోవునపుడు సంచిలో నివ్విధముగా సంపాదించిన ద్రవ్యము రు 305 లుండెను. 'ఔరంగజీబు' అనేక తత్వ శాస్త్రగ్రంథముల నేరుకొని, తన ప్రభుత్వగ్రంథాలయములోఁ జేర్చు కొని, దానిని వృద్ధిపఱచెను.163 మొగలాయి చక్రవర్తులందరు,

162 J. B. Choudary—Muslim patronage to Sanskritic learning part I—p 49 "The tradition is that Jagannadha Panditaraja left the court of Delhi in sheer disgust after the murder of Dara Shikoh and came to Benares, where he was severely reprimanded by Appayya Diksita, apparently for marrying a Muslim girl..........Jagannatha however took the insult so terribly to heart that he is said to have committed suicide along with his beloved Lavangi in the holy water of the Ganges."

163 N. N. Law—Promotion of learning in India p 193

  

ప్రభుత్వ గ్రంథాలయమును ప్రాణతుల్యముగాఁ గాపాడుకొనుచు, ననేక గ్రంథములను జేర్చుచు వృద్ధిచేసియుండిరి.

ముహమ్మద్ షా-(1719-1748) ఈయన బహదూర్ షా మనుమఁడు. ఈయన రాజ్యము చేయుకాలమున, 1739లో పర్షియానుండి 'నాదిర్ షా' గొప్ప సైన్యముతోవచ్చి, భారత దేశముపై దండయాత్ర చేసెను. ఢిల్లీనగరమును దోపిడిచేసి, తనతోఁబాటు ప్రఖ్యాతి గాంచిన ప్రభుత్వ గ్రంథాలయమును పర్షియాకుఁ గొంపోవుచు, విశేష ధనముతోఁ గైకొనిపోయెను. మొగలాయిరాజులకుఁ బ్రాణతుల్యమైన గ్రంథాలయమును గైకొనిపోయి, పర్షియాలో ఆ వ్రాతప్రతు లన్నిటిని, చాల తక్కువ ధరలకు విక్రయించెను.[164]

'షాఆలమ్' II (1757-1806) కాలమున, తమ విలువగల గ్రంథాలయము 'నాదిర్ షా' దండయాత్రలోఁ బోవుటచేత, రాజకుటుంబము వారు తిరిగి గ్రంథాలయమును సేకరింపసాగిరి. మరల కొలఁది కాలములోనే, గొప్ప గ్రంథాలయ మేర్పడెను. 'ఇబ్రట్ నామా' అను గ్రంథమునుబట్టి, 'గులామ్ఖాదిర్' అను మనుష్యాకారమున నున్న దయ్యము, బుద్ధి పూర్వకముగా మూఁడురోజుల క్రితము, చక్రవర్తి కన్నులఁ బీకివేసినవాఁడు, రత్నమందిరములోనికేగి, ఒక పెద్ద పెట్టెను, ఒకరత్నముల పెట్టెను, గ్రంథాలయమునుండి కురాను, యొక్క అనేక ప్రతులను, 8 పెద్దబుట్టలలో గ్రంథములను గైకొనిపోయెనని తెలియుటచేత, నప్పటికి గొప్ప గ్రంథాలయ మేర్పడుచుండెనని, 'ఎలియట్' వ్రాతల వలన తెలియుచున్నది.[165] భారతవర్షమున

---

"Aurangzib's love of theology led him to collect Tafsirs, works on Hadis, Figh etc. The collection in the Imperial library was thus augmented."

164 Ibid p 198 "Nadir carried away with him the celebrated Imperial library of Delhi, along with an enormous treasure on his return to Persia This library had been preserved by the Mughal Emperors as their most precious possession. By an irony of fate, some of these valuable books were afterwards sold in Persia at ridiculously low prices."

165 Ibid p 198 "It appears that the royal family, after they had been deprived of their valuable library by the rapacity of

ఢిల్లీలో మహమ్మదీయ చక్రవర్తుల పరిపాలన, వారి గ్రంథాలయ ములు తర్వాత కాన్పింపవు.

# షష్ఠాధ్యాయము

అచ్చు ఆరంభము - ముద్రణాలయము - అచ్చుగ్రంథములు - భారతవర్షమున యూరోపియనుల గ్రంథాలయములు - గ్రంథాలయముల క్రమవికాసము.

అచ్చు ఆరంభమైన తర్వాత, దినదినమనేక క్రొత్తగ్రంథములు బయల్పడుచున్నవి. అచ్చుయొక్క ఆరంభము క్రీ. శ. ౨వ శతాబ్దములో బౌద్ధులవలన జరిగినట్లు గాన్పించుచున్నది. అంతకుఁ బూర్వమే పురాణశిలాయుగ కాలముననే జనుల కచ్చువేయు పద్ధతి తెలియునని, ప్రాచీన 'సుమేరియా'లో లభించిన ముద్రికలనుబట్టి యెఱుంగ వచ్చునని, కాగితములు కనిపెట్టఁబడకపోవుటచేత, నచ్చువలన ప్రయోజనము లేకపోయినదని, 'హెచ్. జి. వెల్సు' వ్రాసెను.

క్రీ. శ. 868 లో 'చైనా'లో బౌద్ధ భిక్షువు 'వాంగ్‌చిక్' చేత నుచితముగా నందఱికిఁ బంచిపెట్టుటకు, శాశ్వతముగా నతని జననీ జనకుల నామము సుస్థిరముచేయుటకు, నొకగ్రంథము కాగితముపై ముద్రింపఁబడెను. ముద్రింపఁబడిన అన్ని పుస్తకములలో నిదియే యతి ప్రాచీనమైనదిగాఁ గాన్పట్టును. ఈపుస్తకము 'టర్కీస్థానముయొక్క' చైనీయ సరిహద్దుయొద్ద సహస్రబుద్ధుల గుహాలలోఁ గాన్పించినది. ఈ గుహాలు, నిట్టముగానుండు ఎత్తయిన పర్వతశ్రేణిముఖమునుండి,

---

Nadir, continued collecting books, which in the reign of Shah Alam II (1759—1806) served to form a decent library, for it is mentioned in the 'Ibrat—Namah' that Ghulam Qadir, the fiend in human shape, who had most wantonly deprived the monarch of his eyes only three days before, went into the jewel-house and took out a chest and a box of jewels, several copies of the Quran and eight large baskets of books out of the library." (Elliot VIII—249).

గొలపఁబడియున్నవి.[166] అవిగాక క్రీ. శ, 1218 లో కొరియాలో పూర్ణమైన బౌద్ధుల పిటకములు, కొయ్యమొద్దులనుండి ముద్రింపఁబడినవి కాన్పించుచున్నవి, 'యూరోపు'లో కొయ్యమొద్దులమీఁద ముద్రణారంభము కనిపెట్టఁబడినదని చెప్పుటకు రెండు శతాబ్దములకుఁ బూర్వమే, బౌద్ధు లాసియాఖండములోఁ గొయ్యపలకలనుండి ముద్రించు పద్ధతిని గనిపెట్టియుండిరి.[167] జర్మనీ, ఫ్రాంసులు 14 వ శతాబ్దాంతమునను దీనిని గనిపెట్టిరి.

యూరోపుకంటెముందుగా, చీనా జపానులలో కొయ్యదిమ్మల మీఁద ముద్రించు పద్ధతి కనిపెట్టఁబడినది. 15వ శతాబ్దమునఁగూడ యూరోపు ఖండములో కొయ్యదిమ్మలతో, ముద్రించు పద్ధతి అల్పముగాఁ గాన్పించుచున్నది. క్రీ. శ. 1450 నాఁటికి, పశ్చిమ దేశీయులు విశేషముగా వ్రాఁతప్రతులను వ్రాయుచుండిరి. వ్రాఁతప్రతి వ్రాయుటకుఁ జాల కాలముపట్టుచుండెను. అందుచే వ్రాఁతప్రతులు చాల స్వల్పముగా నుండెను. వానివిలువకూడ నెన్నియోరెట్లుండెను. అచ్చుపుస్తకములు వచ్చునవఱకు, మామూలు జనులలో విద్యావ్యాప్తి చాల తక్కువగాను ప్రపంచజ్ఞానము శూన్యముగా నుండెను. క్రీ. శ. 1500 నుండి పాశ్చాత్య దేశములలో, గ్రంథములు వృద్ధిపొందసాగెను. జార్మణ్య దేశీయులు 18వ శతాబ్దములో సీసముతో నక్షరములుచేసి, అచ్చువేయుట ఆరంభించిరి. అంతట ముద్రణాలయములు వృద్ధియై గ్రంథము

---

166 Frederick Harrisson— A book about books—p 91. "From the 9th century the art of printing on paper.........was known. A D. 868—In China, by Buddhist monk Wang Chick, a book was printed for free and general distribution, in order, in deep reverence to perpetuate the memory of his parents. This earliest of all printed books was found near the Chinese border of Turkeystan in the caves of the 1000 Buddhas, which are hewn out of the face of a cliff. Germany and France.........end of 14th century.

167 James H. Cousins—The cultural unity of Asia—p 28. "It was during this era,about the year 1218. that the complete Buddhist scriptures were printed from wooden blocks, two centuries before the year in which history text books, record the fact that wood block printing was discovered in Europe."

లధికము కాసాగెను. నాల్గుశతాబ్దముల క్రితము యూరోపులోనిముఖ్య నగరములలోని గ్రంథాలయములలో 1000 సంపుటములకంటె నధిక గ్రంథములు కాన్పింపవు. కాని ముద్రణ వచ్చిన తర్వాత, ఈనాడు లక్షలాది గ్రంథము లేర్పడుచున్నవి. బ్రిటిషు చిత్రవస్తుప్రదర్శనశాల లోని గ్రంథాలయములోను, ఆక్సుఫర్డు లోని 'బోడ్లియను' గ్రంథాలయములోను ఈనాడు 15 లక్షల గ్రంథముల కధికముగా నున్నవి.

చీనాలోఁ గాగితము క్రీ. శ. 2వ శతాబ్ద ప్రాంతమునఁ గనిపెట్టఁబడెను. క్రీ శ. 751లో చైనీయులు, 'సామర్కండము'లోని అరబ్బులపై కేగి యుద్ధములో నోడి, వారికి ఖైదీలుగాఁ జిక్కిరి. అరబ్బులు ఖైదీలగు చైనీయులనుండి కాగిత పరిశ్రమను నేర్చిరి. క్రీ.శ. 9వ శతాబ్దమునాఁటి కాగితపు ప్రతులింకను గలవు. క్రీ శ. 14వ శతాబ్దమునాఁటికి జర్మనీ మున్నగుచోట్లను కాగితవ్యాప్తి యగుటచేత చౌకగా నచ్చువేయసాగిరి. 15వశతాబ్దమున హాలండులోను, రైనునదీ ప్రాంతములలోను సులభముద్రణ యారంభమాయెను. ఇంగ్లండులో 1477లో 'కాక్స్టను' (Caxton) ముద్రణాయంత్రము నారంభించెను. బైబిలు ప్రతుల ముద్రించి ముద్రణ వ్యాప్తిచేసిరి.

'ఓవింగ్టన్' (Ovington) వ్రాతలనుబట్టి, క్రీ. శ. 1689లో ముద్రణ భారతవర్షమున నారంభమాయెనని తెలియును. కాని నకలు ప్రతులు వ్రాయువారికి జీవనోపాధి పోవునని, వారు గ్రంథముద్రణ నంగీకరింపరైరి.[168] పోర్చుగీసువారి వ్రాతలప్రకారము, ముద్రణాలయము క్రీ. శ, 1556లో నారంభించిరని, 1557లో మొదటి గ్రంథమచ్చువేసిరని తెలియుచున్నది. అచ్చువేసిన మొదటి గ్రంథము 1577 లోనిదని కొందఱు వ్రాసిరి. పోర్చుగీసువారు భారతవర్షమున 5 ముద్రణాలయములు స్థాపించిరి. 'అబుల్ ఫజల్' వ్రాతప్రస్తావనచేసినను ముద్రణాలయమును గూర్చి యేమియు వ్రాసియుండ లేదు.

---

168 Rev J. Ovington—A voyage to Surat in 1689—p 251. "Neither have they (Indians) endeavoured to transcribe the art of printing; that would diminish the repute and livelihood of their scrivans who maintain numerous families by their pen."



ప్రాచీన భారతీయ

దుచే నప్పటికి ముద్రణపద్ధతి వ్యాప్తిలో లేదని చెప్పవచ్చును.[169]
బ్రిటిష్ ఇండియాలో, మదరాసులో ముద్రణాలయము 1711-లో రంభమైనది. తమిళములోఁ క్రొత్త నిబంధన 1714లో ముద్రింపఁ డెను. 1774 నాఁటికి 'ఇండియా గెజెట్' ముద్రింపఁబడుచుండెనని రి' (Carry) వ్రాసెను. 1778లో హుగ్లీలో నొక ముద్రణాలయ ములో బెంగాలి వ్యాకరణము ముద్రింపఁబడెను. 'విల్కిన్సు' అను గ్లేయుఁడు 'పంచానన' యను కమ్మరికి అక్షరములుపోఁతపోయువిధము ర్పెను. కాని 1806 నుండి భారతవర్షమున గ్రంథము లచ్చువేయుట స్తారముగా సాగినది. అందుచే గ్రంథాలయములు వృద్ధికాసాగెను.
1661లో మదరాసులో ప్రథమముగా 'సెంటుజార్జికోట' లో గ్రంథాలయ మేర్పడెను. వైట్ ఫీల్డు (Whitefield) దీనికి కారకుఁడు. ర్కారుఉద్యోగులను, వర్తకుల నీయనకోరఁగా వర్తకులొక 'క్యాలికో' బేలు నొసంగి దాని నమ్మి గ్రంథములు కొనుమనిరి. ఆ బేలును డనును, ఓడమీఁద విక్రయించుటకుఁ బంపెను. ఆ వచ్చిన ద్రవ్య ముతో గ్రంథములు కొన సంకల్పించెను. ఇంగ్లాండులో 85 పౌనుల మ్మి, 23½ పౌనులు వైట్ ఫీల్డుకుఁ బంపిరి. మిగత ద్రవ్యము పుస్త ముల కొరకు ఖర్చిడి, ఆ గ్రంథములను దర్వాత, మదరాసుకోటలోని గ్రంథాలయమున కుద్యోగులుపంపిరి. ఇదియే కంపెనీ గ్రంథాలయము పుట్టుక.[170] అప్పుడప్పుడు, పైయధికారులు గ్రంథాలయమునకు గ్రంథ ములఁ బంపుచుండిరి, 1669 లో పౌ 5 లకు, తర్వాత కొన్నాళ్ళకు పౌ 30 లకు పుస్తకములు కొని పంపిరి. బందరు (Machula) లోఁ కూడ 1671 కి పూర్వమే గ్రంథాలయము గలదు. అచట 'హుక్' (Hook) అను మతగురువు చనిపోవుటచేత, అతని గ్రంథములు

169 N. N. Law—Promotion of learning in India by early Europian settlers- p. 104 'It is noteworthy that Abul Fazl does not make a single reference to printing or printed books, while speaking of writing, either in his Ain or in his letters. From this, it seems that printing did not become popular at the time when Abul Fazl wrote."

170 Ibid—See chapter IV on "Early Europian libraries in Southern India."

కూడ మచిలీ పట్టణపు గ్రంథాలయములోఁ జేర్చిరి. 1678లో దీనిలో 73 గ్రంథములు మాత్రముండెను, 1676 లో పైయధికార్లు వారి ఫ్యాక్టరీ గ్రంథాలయములకు గ్రంథములనుబంపిరి. 1695 లో 300 పోర్చు గీసువారి ప్రార్థనా గ్రంథములు పంపఁబడెను. తరువాత వారు సెంటు జార్జికోట గ్రంథాలయమునుండి ఆ గ్రంథములను పోర్చుగీసు వారి కిచ్చుచుండిరి. ఇతరులకు కూడ నిచ్చుచుండిరి. కాని అడిగినపుడియ్యని చో నొక పగోడా అపరాధము వేయుచుండిరి, తరువాత సెంటు డేవిడ్‌కోట గ్రంథాలయములో లాడన్ (Laudon) అను మతగురువు చాల గ్రంథముల చేర్చెను. 1707 లో నీయన వెళ్ళుచు కంపెనీవారి కాపుస్తకముల నన్నిటిని విక్రయించెను.

ఈ సమయమున సెంటు జార్జికోట గ్రంథాలయములోఁ జాల గ్రంథములుండెను. యాత్రికుఁడగు లాక్‌యర్ (Lockyer)1703 లోఁ గోటనుజూచి, దైవసంబంధములగు గ్రంథములు, పౌ 438-6-0 ల విలువగలవి గ్రంథాలయమున నున్నవని చెప్పెను,[171] గ్రంథాలయ మభివృద్ధిలోనుండెను. కాని తర్వాత కొన్ని గ్రంథములు పోయెను. సరియైన పుస్తకముల పట్టీ లేకుండెను. అధికారులు పట్టీ వ్రాయక పోయిరి. తరువాత గ్రంథాలయమును, సరియైన పద్ధతిలోనుంచి, పుస్తకముల పట్టీ వ్రాసినందునకు థామస్ వెండీ (Thomas Wendey)అను వానికి, పల్లకీఖర్చు నొసంగుటకు గవర్నరు, ఆయన సభవారు తీర్మా నించిరి. తరువాత పై యధికార్లు పుస్తకములను, గ్రంథాలయమునకుఁ బంపుచుండిరి. కొన్నిసమయములలో నోడలపైన రుసుము లేకుండ పుస్తకములు మన దేశమునకుఁ జేర్చుచుండిరి. కాని గ్రంథాలయము వృద్ధిలోనికి వచ్చినట్లు గాన్పింపదు.

1700లో వంగదేశములోని గ్రంథాలయమును 'బెంజమిన్ ఆడమ్స్' వృద్ధిచేసెను. ఇట్లే మన దేశమున క్రమముగా గ్రంథాలయములు ఆంగ్లేయ పరిపాలనలో అభివృద్ధిఁ జెందెను.

---

171 Ibid—p 91 "The traveller Lockyer who visited the Fort in 1703, says that books of Divinity in the library were worth £ 438 6s—at the time." (Records I—p. 132).



ధామా ప్రెస్, సికింద్రాబాదు. 1946

## వెలువడిన గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1 భారత విదుషీరత్నములు | 1వ భాగము | రు 0-4-0 |
| 2 ,, | 2వ భాగము | 0-4-0 |
| 3 ప్రాచీన భారతీయ గ్రంథాలయ చరిత్ర | | 2-8-0 |

## వెలువడనున్న గ్రంథములు (Books to be published)

4 A History of Indian Ithihasas (English and Telugu)
5 Social Tyranny "
6 Hindu Hostility to Buddhism "
7 A History of Indian Hermits "
8 Ancient Indian Chronology "
9 వివాహముల చరిత్ర---విధి
10 నాగార్జునుని చరిత్ర
11 ప్రాచీన ప్రజాప్రభుత్వరాజ్యములు—ఎన్నికలు
12 ప్రాచీన విద్యావిధానము
13 ప్రాచీన సాంఘిక దురాచారములు
14 దాస్య చరిత్రము
15 వ్యాసావళి(అనేకపత్రికలలో ప్రకటింపబడిన వ్యాసముల సంపుటి)

All books written by the same author—

***For Copies Apply to :***

1 Kodali Raja Ramamohanarao,
Ithihasa Parisodhakamala
Moparru (via. Tenali) M. S. M. Ry.

2 Arige Ramaswamy,
6381, Kummar Guda,
Secunderabad-Deccan.